# ఆంధ్రప్రశస్తి

## (వివిధ కవుల కవితా సంకలనం)



808 81.67
వివి..ఆంధ్ర
66.439



అంతర్జాతీయ తెలుగు కేంద్రం
తెలుగు విశ్వవిద్యాలయం
హైదరాబాద్ - 500 007

# ఆంధ్ర ప్రశస్తి

(వివిధ కవుల కవితా సంకలనం)

సంకలన కర్త :

శ్రీ డి. మునిరత్నం నాయుడు

సంపాదక మండలి

ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం

ఆచార్య చేకూరి రామారావు

ఆచార్య కేతు విశ్వనాథరెడ్డి

డాక్టర్ రాపూరి భరద్వాజ



ప్రచురణ :

అంతర్జాతీయ తెలుగు కేంద్రం

తెలుగు విశ్వవిద్యాలయం

హైదరాబాదు

ANDHRA PRASASTHI (An anthology of poems by Various Telugu poets on the praise of 'ANDHRA'.

---

తెలుగు విశ్వవిద్యాలయం
హైదరాబాదు–500 004.

ప్రథమ ముద్రణ : 1989
ప్రతుల సంఖ్య : 1000

808.8167
ము. 2-80

వెల : రూ. 32/-

ముఖచిత్రం: శ్రీ వేదాంత కుమార్




ప్రతులకు :

తెలుగు విశ్వవిద్యాలయం,
కళాభవన్, సైఫాబాద్,
హైదరాబాదు-500 004.

ముద్రణ :

శ్రీనివాస ప్రింటర్స్,
2-3-529/ఎ,
బి. ఎన్. పాలిటెక్నిక్ రోడ్డు,
అంబర్‌పేట,
హైదరాబాదు–500013.

# కృతజ్ఞతలు

తెలుగు సాహితీ సంస్కృతుల పరిరక్షణకు, పరిపోషణకు ఒక వేదికగా తెలుగు విశ్వవిద్యాలయం ఏర్పడింది. బోధన, పరిశోధన, ప్రచురణల ద్వారా ఇది తన కార్యక్షేత్రాన్ని విస్తరింప జేసుకొంటోంది.

తరతరాల మన సాహిత్య చరిత్ర సంస్కృతుల స్ఫూర్తిని భావి తరాలకు అందించడం ఈ విశ్వవిద్యాలయం లక్ష్యాలలో ఒకటి.

'దేశ భాషలందు తెలుగులెస్స' అని ఇటు ప్రాచ్యుల చేత; 'ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్' అని అటు పాశ్చాత్యుల చేత ప్రశంసింప బడిన తెలుగు భాషా మాధుర్యాన్ని, ఆ జాతి ఔన్నత్యాన్ని, ఆ భూమి గరిమను ఆ కళాసంస్కృతుల ప్రాభవవైభవాలను చాలామంది కవులు గానం చేశారు. ఆ కవితాగానాన్ని ఆస్వాదించిన ఒళ్ళు ఆనందంతో పులకరించడమే కాదు ఆ జన్మ ధన్యమవుతుందనడం అత్యుక్తి కానేరదు.

అటువంటి కవుల కవితలను ఏర్చి కూర్చి 'మా తెలుగు తల్లికి కవితల పూదండ'గా ఈ పుస్తకాన్ని సమర్పిస్తున్నాం. ఈ కవితా సంకలనానికి శ్రీ డి. మునిరత్నంనాయుడుగారు సంకలన కర్తగా వ్యవహరించారు.

ఆయా కవులు రచించిన కవితలలో పరిమళ భరితమైన వాటిని ఎంపిక చేయడానికి ఏర్పడిన సంపాదక మండలిలో ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యంగారు, ఆచార్య చేకూరి రామారావుగారు, ఆచార్య కేతు

విశ్వనాథరెడ్డిగారు, డాక్టర్ రావూరి భరద్వాజగార్లు మాతో ఎంతగానో సహకరించారు. వారికి మా హృదయ పూర్వకమైన ధన్యవాదాలు. విశేషించి ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారు ఈ సంకలనం ముద్రణ కాలంలో ప్రతిపుటను ప్రత్యేక శ్రద్ధతో పరిశీలించి విలువైన సూచనలు చేయడమేగాక సంపాదక మండలి పక్షాన మల్లెపూదండను కూర్చి ఇది ఈ రూపంగా వెలువడడానికి కారకులయ్యారు. వారికి మా ప్రత్యేక కృతజ్ఞతలు. ఈ సంకలనంలో చేర్చిన కవితలను రచించిన ఆయా కవులకు మా కృతజ్ఞతలు. ప్రూఫులు సరిచేయడంలో సహకారం అందించిన డా॥ వడ్లా సుబ్రహ్మణ్యం గారికి మా కృతజ్ఞతలు.

మా ఈ ప్రయత్నం పాఠకలోకం హర్షిస్తుందని ఆశిస్తున్నాం.

హైదరాబాదు-500 004
తేదీ : 1-4-1989.

ప్రకాశకులు,
తెలుగు విశ్వవిద్యాలయం

# ప్రకాశకుల విజ్ఞప్తి

మనదేశం విభిన్న భాషాసంస్కృతుల సమ్మేళనం. అయినప్పటికీ దీనిలో భిన్నత్వంలో ఏకత్వం భాసిస్తుంది. భారతీయ సాంస్కృతిక వారసత్వ సంపద ఆయా భాషా సాహిత్యాలలో ప్రస్ఫుటిస్తుంది.

మనమంతా భారతీయులమైనప్పటికీ, భారతదేశం లోపలగానీ, వెలుపలగానీ నివసిస్తున్నప్పటికీ మన మాతృభాషా సంస్కృతులను పరిరక్షించుకొంటూనే జాతీయ సమైక్య జీవన స్రవంతిలో సాగిపోతూ ఉంటాం. ఇట్లా రాష్ట్రేతర ప్రాంతాలలో నివసించేవారు తమ మాతృభాషా సంస్కృతులను విస్మరించకుండా ఉండడానికి సదా వారిలో ఆ భావనను సజీవంగా నిలబెట్టడానికి కృషి చేసే ఒక వేదిక అనివార్యం అని భావించడం వల్లనే ఆనాడు అంతర్జాతీయ తెలుగు సంస్థ ఆవిర్భవించింది.

గతంలోని అకాడమీలు, సంస్థలు సాహితీ సంస్కృతి రంగాలలో చేస్తున్న కృషిని ఏకోన్ముఖం చేసి, మరింత పటిష్ఠంగా రూపొందింప జేయడానికి వీలుగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ తెలుగు విశ్వవిద్యాలయాన్ని స్థాపించి, ఆయా అకాడమీలు, సంస్థలను విశ్వవిద్యాలయమనే ఏకచ్ఛత్రం కిందకు తీసుకొని వచ్చింది. ఆ రకంగా గతంలోని అంతర్జాతీయ తెలుగు సంస్థ తెలుగు విశ్వవిద్యాలయానికి బదిలీ కావడంతో అంతర్జాతీయ తెలుగు కేంద్రం పేరిట తన సేవాకార్యక్రమాలను ఇబ్బడిముబ్బడిగా నిర్వహించ సాగింది. అందులో భాగంగా ప్రచురణ కార్యక్రమాన్ని కూడా చేపట్టింది. తత్ఫలితమే ఈ సంకలనం ముద్రణ. ఇది తెలుగు అభిమాన పాఠకులందరినీ అలరిస్తుందని ఆశిస్తున్నాం.

హైదరాబాదు-500 007, అంతర్జాతీయ తెలుగు కేంద్రం

తేది : 1-4-1989.

# మల్లె పూదండ

'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ' - అని రామాయ ణంలో వినపడుతున్నా మానవజాతి ఏర్పడ్డప్పటినించీ చిరంజీవిగా ఉన్న భావం. తల్లిని గౌరవించటం సంస్కృతిలో మొదటి సూత్రం 'మాతృదేవోభవ' అనే భావం దైవభావానికే శ్రీకారం. కన్నతల్లి పెంచినతల్లి, పుడమితల్లి అనే వాడుక మన నిత్యజీవితంలో ఉన్నవి మనకు పాంచభౌతికమైన ఆకృతి నిచ్చింది కన్న తల్లి. చిన్నప్పుడే కన్నతల్లి కనుమరుగైపోతే కంటికి రెప్పలాకాపాడి పెంచిన తల్లిని పెంచినతల్లి అని కానీ, పెంపుడు తల్లి అని కానీ అంటారు. ఇదికన్న తల్లి భావానికి అనుబంధమే 'పెంపుడుతల్లి' భౌతికమే కానవసరంలేదు. స్త్రీయే కానవసరం లేదు. కన్నతల్లి ఉన్నా పెంపుడుతల్లి ఉండవచ్చు. ఆ పెంపుడు తల్లి గురువుకావచ్చు, తండికావచ్చు, మిత్రుడుకావచ్చు. ఒక్కొక్కసారి లోకంకూడా కావచ్చు. పెంపుడుతల్లి జీవనధాత్రియైన కన్నతల్లికంటె విశిష్టంగా భాసించే తత్వం. ఆమె జ్ఞానప్రదాయిని. ఇంతకంటె గొప్ప భావనం 'పుడమితల్లి'. దీనినే 'జన్మభూమి' 'మాతృభూమి' 'దేశమాత' అనే పేర్లతో కూడా పిలుస్తాం. 'పుడమితల్లి' ఎంత భౌతికమో అంత తాత్త్వికమైనది పృథ్వీతత్వంతో పుడతాం పృథ్వీలో చివరకు కలిసిపోతాం. ఆ విధంగా పుట్టుపగిట్టటాల సంబంధమే కాకుండా జీవించినంతకాలం సంస్కృతిగా జాతిజీవనసంస్కారంగా మనలో ప్రవహించేది పుడమితల్లిభావం. పుడమితల్లి భావం ఒక గ్రామం నుండి ఒక దేశందాకా వ్యాపించి ఉండవచ్చు చివరకది వసుధైకకుటుంబ భావం దాకా వ్యాపించవచ్చు ఏమైనా దేహం నుండి దేశంవరకూ మాతృ భావంతో ముడివడి ఉన్నది 'తల్లి'

నేలను తల్లిగా భావించిన మానవుడు భాషను కూడా తల్లిగా భావించాడు; తెలుగువారు పూజించే తెలుగుతల్లి' దేశపరంగానూ, భాషా

పరంగానూ, సాహిత్యపరంగానూ అన్వయించుకోవటానికి వీలున్నపదం. దేశం జాతిస్పృహను పోషించేది; భాష నాగరికతను వ్యక్తం చేసేది; సాహిత్యం సంస్కృతి సౌందర్యాల సంస్కారాన్ని గుబాళింప చేసేది. ఈ మూడర్థాలూ ఈ వరుసలోనే క్రమంగా స్ఫురిస్తాయి తెలుగుతల్లి అంటే ముందు స్ఫురించేది నేలతల్లిభావమే. శంకరంబాడి సుందరాచారిగారి "మా తెలుగుతల్లికి మల్లెపూదండ" పాటలో కన్నతల్లిగా భావింపబడే తెలుగుతల్లిని కీర్తించే సందర్భంలో గలగలా గోదారి, బిరబిరా కృష్ణమ్మ, బంగారు పంటలూ మొదట స్మరింపబడటం గమనింప దగిన అంశం. అంటే జననీ భావంలో నుంచి పుట్టిన జన్మభూమి భావనం మొదట దేశపరంగా సమన్వయిస్తుందన్నమాట ఆ తరువాత కళల పరంగా సాహిత్యపరంగా, భాషాపరంగా, చరిత్రపరంగా, సంస్కృతి పరంగా అన్వయిస్తుందని ఆ పాటలోని "అమరావతీగుహల అపురూప శిల్పాలు" అనేచరణం నుండి చివరివరకూ ఉన్నభాగం ధ్వనింపచేస్తోంది తెలుగుతల్లి అనే భావనలోని అన్ని అంచులనూ తాకింది శంకరంబాడి సుందరాచారిగారి గేయం. అందుకే మనం దాన్ని తెలుగుజాతి మధుర గీతంగా తెలుగుతల్లి భక్తిగీతంగా పాడుకుంటున్నాం, పరవశిస్తున్నాం. ఈ సంకలనంలో అందుకే అది మొదటి గీతం.

తెలుగుతల్లి అనే దర్శనంలో ఉండే అన్ని అంచులనూ స్పృశిస్తూ తెలుగుకవులు పాడిన పాటలనూ, అల్లిన గీతాలనూ, వ్రాసిన పద్యాలనూ అన్నింటిని సేకరించి ఒక సంపుటిగా వెలువరిస్తే 'ఆంధ్రప్రశస్తి' అవుతుందని తెలుగువిశ్వవిద్యాలయం భావించింది. సంపుటి సంపాదక మండలిని నిర్ణయించింది. ఆ మండలి చేసిన సూచనల మేరకు శ్రీ డి. మునిరత్నం నాయుడుగారు ఈ సంకలనం తయారు చేశారు. శుక్ల ఉగాది నాడు ఇది ఆవిష్కరింపబడటం విశేషం. శుక్ల సంవత్సరం చదువులతల్లికి ప్రీతిపాత్రమైనది. అందువలన "తెలుగుతల్లి' ని గురించిన

దేశభక్తి కవితా సంకలనంగా ఇది తెలుగువారి మన్ననల నందు కొంటుందని ఆశిస్తున్నాం.

ఈ సంపుటికి 'ఆంధ్ర ప్రశస్తి' అని పేరుంచబడింది. తెలుగుతల్లి భావనకూ, ఆంధ్రజాతి భావనకూ అభేదభావాన్ని వ్యక్తం చేయటమే ఈ పేరులోని సొగసు. ఆంధ్రవైభవాన్ని గురించి ఐతరేయ బ్రాహ్మణం నుండి ఆధునికాంధ్ర కవి వరకు చేసిన వివిధ ప్రశంసలు వాఙ్మయంలో వెలసి ఉన్నాయి. వాటినన్నింటినీ, కనీసం ముఖ్యమైన వాటిని, ఒకచోట చేర్చి వర్గీకరించి ప్రచురిస్తే తెలుగువారు తమ వైభవాన్ని ఒక చిత్రపట దర్శనంలా చూచుకోగలరని, కవితాసంపుటిగా చదువుకోగలరనీ తెలుగు విశ్వవిద్యాలయం భావించి ఈ సంపుటిని వెలువరిస్తున్నది. ఇది ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు మొదటి ప్రపంచ తెలుగు మహా సభల సందర్భంగా డా॥ జి. వి. సుబ్రహ్మణ్యంగారి సంపాదకత్వంలో వెలువరించిన 'తెలుగుతల్లి' అనే సంకలనానికి విస్తృతరూపం. దానికంటె ఇది ఎన్నో విధాలుగా సమగ్రం కూడా.

చరిత్రలో వినవచ్చే ఆంధ్రప్రశస్తి వేరు, కవితలో ప్రతిఫలించే ఆంధ్రప్రశస్తి వేరు. ఒకటి వాస్తవ కథనం; మరొకటి కవితావేశ కథనం. ఈ సంపుటి చరిత్రకోసం చదివేదికాదు. చరిత్రకు కవులెలా స్పందించారనీ, ప్రజలెలా చరిత్రను గురించి పాడుకొన్నారనీ తెలుసు కోవటానికి చదివేది. ప్రాచీనాంధ్రకవులకంటె ఆధునికాంధ్రకవుల కవితలే ఇందులో విరివిగా ఉన్నవి. క్రీస్తుకు పూర్వంనుంచీ ఆంధ్రులకు జాతిభావం, భారతజాతీయభావం ఉన్నట్లు మనకు దాఖలాలు ఉన్నా, రాష్ట్రభావనం ఆధునికం. ఇది భాషాసాహిత్య రాజకీయస్పృహతో కూడా పెంపొందిన దర్శనం. అందువలన ఈ ఆంధ్రప్రశస్తి ఆధునిక యుగానికే ఎక్కువగా అంకితమై ఉంటుంది.

ఆంధ్ర ప్రశస్తిని ప్రపంచించే ఆంధ్రకవిత ఆరు పాయలలో ప్రవహించింది. అవియేవంటే — 1. తెలుగుతల్లిని గురించి పాడిన పాటలూ, పద్యాలూ, తెలుగుతల్లిని కవులు ఆంధ్రజనయిత్రి 'ఆంధ్రజననీ, ఆంధ్రమాతా, తెలుగమ్మా' అని ఎన్నో పేర్లతో ఆప్యాయంగా పిలిచారు. ఆమె రూపగుణవైభవాలను వేనోళ్ల కీర్తించారు. 2. తెలుగుజాతి లేదా ఆంధ్రజాతి పుట్టుపూర్వోత్తరాలను గురించీ జాతిపౌరుషాన్ని గురించీ, అది సాధించిన విజయాలను గురించీ, ప్రదర్శించిన ప్రజ్ఞావైదుష్యాలను గురించీ, సాగించిన ఉద్యమాలను గురించీ, వెలయించిన విజ్ఞతను గురించీ ప్రశంసిస్తూ చేసిన రచనలు కొన్ని విలువైనవి వెలువడాయి. 3. తెలుగుభాషాసాహిత్యాల ప్రశంస ఒక ప్రత్యేకశాఖగా పేర్కొనదగింది. 'ఆంధ్రత్వం ఆంధ్రభాషాచ నాల్పస్య తపసః ఫలమ్' అని అప్పయ్య దీక్షితులు చెప్పిన వాక్యం ఆంధ్రుల అభిమానసూత్రం. దీని భావాన్ని, అనువాదాన్ని అనేకవిధాలుగా అభివ్యక్తీకరించారు. ఆధునిక కవులు. భాషలోని తియ్యందనాన్ని, సాహిత్యంలోని శిల్పవైభవాన్ని వేనోళ్ల కీర్తించారు తెలుగుకవులు. 4. ఆంధ్రరాష్ట్రభావం చారిత్రకంగా ఎంతో ప్రాముఖ్యాన్ని వహించింది. భాషా ప్రయుక్త రాష్ట్రభావనాన్ని తొలిసారిగా రూపుకట్టించి అవతరించింది ఆంధ్రరాష్ట్రం. స్వాతంత్ర్య సమర గీతాలతో పాటు శ్రుతి కలిపిపాడారు ఆంధ్రరాష్ట్రంకోసం అభిమానగీతాలు ఆంధ్రకవులు. రాష్ట్రసిద్ధి వరకూ రణగీతాల్లా సాగించారు. రాష్ట్రసిద్ధి తరువాత మహాంధ్రోదయంకోసం శంఖారావం పూరించారు. ఆంధ్రరాష్ట్రంగా ఆంధ్రప్రదేశ్‌గా రాష్ట్రం ప్రత్యక్షమైనప్పుడు హర్షగీతాలనూ, భవిష్యత్తుకై ప్రబోధ గీతాలనూ కవులు ఆలపించారు. తెలుగుతల్లి నేలతల్లిగా, పలుకుతల్లిగా రాష్ట్రగానంలో ప్రత్యక్షమౌతుంది. ఈ రచనలు ఆంధ్రుల ఆత్మీయతకు ఆదర్శాలు. 5. తెలుగువారి కళాసాహిత్య వైభవాలను గురించీ, నాగరికతా వికాస విధానాలగురించి తెలుగుకవులు స్పందించి రచించారు. తెలుగునాట వెలసిన

పుణ్యక్షేత్రాలు, చారిత్రక నగరాల శిథిలాలు, శిల్పకేంద్రాలు, పర్వతాలు, స్తూపాలు, మహాపురుషులు, మహానదులు, పండుగలు, వర్షాలు, ఆధునిక అభివృద్ధి ప్రణాళికలు - ఇలా ఎన్నో అంశాలు ఆంధ్రకవులచేత ప్రశంసింపబడినాయి. వీటిని రెండుభాగాలుగా ఇందులో విభజించి కూర్చటం జరిగింది.

మొత్తం ఆరుభాగాలలో ఆంధ్రప్రశస్తి ఇందులో ప్రత్యక్షమౌతుంది. ఈ సంకలనంలో ఖండకావ్యాలున్నాయి, కావ్యాలలోని భాగాలున్నాయి, పద్యాలున్నాయి, గేయాలున్నాయి, వచనకవితలున్నాయి. ఆధునికాంధ్ర సాహిత్యంలో వెలువడిన సాహిత్యరూపాలన్నింటిలో ఆంధ్రప్రశస్తి జాలువారింది. దానినంతా ప్రోగుచేసే ప్రయత్నం ఇది. ఈ సంకలనం సమగ్రం కాకపోవచ్చు; ఇందులోచేరని మరికొన్ని కవితలు ఇంకా ఉండి ఉండవచ్చు మా దృష్టికి రానివి. అయినా సమగ్రతవైపు సాగించిన సాహసయాత్ర ఇది. సంపాదక మండలికి ఈ అవకాశం ఇచ్చిన తెలుగు విశ్వవిద్యాలయం వారికి, విశేషించి కులపతులు ఆచార్య తూమాటి దొణప్పగారికి మా కృతజ్ఞతలు. ఈ 'ఆంధ్ర ప్రశస్తి' తెలుగు తల్లికి సమర్పిస్తున్న మల్లెపూదండ - ఆంధ్రుల హృదయాలను ఆమోదింప చేస్తుందని ఆశిసున్నాం.

హైదరాబాదు, సంపాదక మండలి

శుక్ల ఉగాది,

6-4-1989.

—: 0 :—

# తెలుఁగుతల్లి

## తెలుగుజాతి

## తెలుఁగుభాష

## రాష్ట్రగానం





## ఆంధ్ర సంస్కృతి

### నాగరికతా వైభవము

## ఆంధ్రసంస్కృతి

### కళాసాహిత్య వైభవం

ii

# మా తెలుగు తల్లికి మల్లెపూదండ

శంకరంబాడి సుందరాచారి

మా తెలుగు తల్లికి మల్లెపూదండ
మా కన్న తల్లికి మంగళారతులు
కడుపులో బంగారు కనుచూపులో కరుణ
చిరునవ్వులో సిరులు దొరలించు మా తల్లి

గలగలా గోదారి కదలి పోతుంటేను
బిరబిరా కృష్ణమ్మ పరుగులిడుతుంటేను
బంగారు పంటలే పండుతాయి
మురిపేల ముత్యాలు దొర్లుతాయి

అమరావతీ గుహల అపురూప శిల్పాలు
త్యాగయ్య గొంతులో తారాడు నాదాలు
తిక్కయ్య కలములో తియ్యందనాలు
నిత్యమై నిఖిలమై నిలచి యుండేదాక
రుద్రమ్మ భుజశక్తి మల్లమ్మ పతిభక్తి
తిమ్మరుసు ధీయుక్తి కృష్ణరాయని కీర్తి
మా చెవుల రింగుమని మారుమ్రోగేదాక
నీ ఆటలే ఆడుతాం నీ పాటలే పాడుతాం
జై తెలుగు తల్లీ! జై తెలుగు తల్లీ!!

# మల్లెదండ

రాయప్రోలు సుబ్బారావు

పాలక్రొమ్మీగడల్ పచ్చి వెన్నయి విచ్చి
తీయని నునుపూన లాయెనేమొ।
కమ్మని మకరంద కణములు స్నేహించి
చిన్నారి పలుకులై చిక్కెనేమొ।
పూల లావణ్యంబు పొంగి చక్కదనాల
పిందెలై రుచులెక్కి పెరిగెనేమొ।
సెలయేటి యుయ్యాల కులుకు టొయ్యారముల్
ముద్దు ముచ్చటలయి ముదిరెనేమొ।
పాటకును పద్యమునకు సత్రముగ నొదిగి
చవికి చాతుర్యమునకు, సాజముగ సాగి
పోతునకు పొత్తునకు చాలి పొందిపొసగు
మా తెనుగు తల్లిమెడ కిదె మల్లెదండ।

'తెలుగుతల్లి' (సంకలనం) 1975

# తెలుఁగుతల్లి

## ఆంధ్రమాత

రాయప్రోలు సుబ్బారావు

శ్రీలింపొందగ యావదాంధ్ర జనమాతృక్ష్మాతలీనూత్న తే
జోలీనామృతమాని, తద్బలవ దౌత్సుక్యంబునన్ తావకో
ద్వేల ప్రాక్తన కీర్తి గీతముల నర్థిన్ పాడు నీ పుత్రపు
త్రీలోకమ్మున కేమి దెల్పెదవు సందేశంబు నాంధ్రావనీ!

ఆశల్ కౌతుక పూర్ణచంద్రికలు పూయన్, దుర్దినాబ్దద మా
కాశమ్మున్ విడిపోవ నూతన కళోత్కర్షాప్తియై మాతృ భూ
జా శోభల్ దయివారు నీ శుభదినోత్సాహంబు వీక్షించి, నీ
యాశీర్వాదములిమ్ము పుత్రకుల కంబా! యాంధ్ర దేవీమణీ!

తేటల్ దేరెడు కాంతి పూరముల, నుద్దీపించు ముత్యాల ము
ప్పేటల్ వోలె త్వదీయ కంఠమున శోభింపల్ నిగారించు, చే
నాటన్ జీవన శోషణల్ గనని కృష్ణా గౌతమీ భద్రలన్.
గాటంపుందమి త్రావువారలిదె కాంక్షాక్షీర మాంధ్రావనీ!

ఆచాళుక్య నృపాల రత్నముల వియ్యమ్మంది, శ్రీ కాకతి
క్ష్మాచక్రేశుల లాలనల్ పడసి, కృష్ణప్రాజ్య సామ్రాజ్య పీ
ఠీ చంచజ్జయకన్యతో సరస గోష్ఠిన్ ప్రొద్దువో బుచ్చు నీ
ప్రాచీనాభ్యుదయమ్ము నెన్నెదరు గర్వస్ఫూర్తి తల్లీ! సుతుల్.

సంతోషింపగదమ్మ! ఆంధ్రజననీ! సారస్వతస్నానవి
శ్రాంతి ప్రీతుల, నీదు పుత్రకుల, దీక్షాబద్ధులం జూచి ని
శ్చింతన్ సోదరులార! ఈ జనని పూజింపుండు బ్రహ్మార్పణో
దంత వ్యక్తపునో బలమ్మున తథా స్తంచున్ ఋషుల్ పల్కగన్.

నన్నపార్య వచోమృణాల మాంసల కవి
హంసలార్చెను ఱెక్క లాంధ్ర సరసి
రాయల ఖడ్గ ధారల లొంగిన పొలాలు
తెలివెన్నెలల్ ప్రసాదించుకొనియె.

తిమ్మరుసూల్లోకశీలతా పరివృత
స్థలములు వికచపుష్పముల నిండె
త్యాగరాయన్న గీత ప్రవాహము ముంచు
కొనిన చోట్ల మృతంపుగొలకులయ్యె.

మహిత మహిత కళానిత్య మాన్యులైన
ఆ కుమారులు నిజ కౌశలానుకార
దారులకు మార్గముల్ చూపినారు వారి
గన్న కడుపున కిదె నమస్కార శతము.

అమ్మా! నీచనుబాలు గ్రోలి అతి లోకానంద పీయూష పా
త్రమ్ముల్ ప్రాతర పావృతారుణ విభాతారుణ్య లావణ్యముల్
గ్రమ్మంగా, బయికెత్తి యాడు సుకలోకమ్మందు నాడింప జే
చిమ్మంజీకటి కోన గట్టితివె యిస్సీ! నాకు నాదోలికన్.

('ఆంధ్రావళి' అనే సంపుటం లోనిది. నం.ప్ర. తేది. 1944)

# జయ మహాంధ్ర జనయిత్రి !

దేవులపల్లి కృష్ణశాస్త్రి

జయ మహాంధ్ర జనయిత్రీ
జయ ప్రియాంధ్ర జనయిత్రీ
జయజయ ప్రియతమ భారత
ధాత్రీ పుత్రీ శుభధాత్రీ!

శ్యామల నవసస్యాంచల
కోమల సుమవల్లీ చికురా
కదళీ రసాల లాంగలీచల
చ్ఛద మృదులానిలచామర!

నీ పూర్వ చరిత స్మరియించీ
నీ భావి ఘనత దర్శించీ
ఇటు మంజీర అటు వంశధార
ఎలుగెత్తి నిన్ను కీర్తించు.

కబరీకాశ కదంబము లూగి
శబరీ పెన్నలు నర్తించు
మరిమరి కృష్ణాగోదావరీ
ఝరులు తలలూపి హర్షించు.

ఎల్లర కోర్కెలు పండునని
ఎల్లర స్వప్నాల్ పండునని
ఇటు తెలంగాణ అటు కళింగాన
అటనట కోస్తా రాయల సీమల
ప్రత్యాంధ్ర మందిర గేహళి
సదా మ్రోగు నీ మంగళ కాహళి.

శ్రీ విశాల మానవతా సమతా
సాధనమే మా మనోరథం
భావిలోక కల్యాణ సుస్థిర
స్థాపనమే మాధృఢ శపథం.
ఒక అడుగేనీ చెదరనీము చెదరనీము
ఒక క్షణమేనీ వృధాపోనీము - వృథాపోనీము
శ్రీరస్తు శుభమస్తు శాంతి రస్తనీ దీవించు

'తెలుగుతల్లి' (సంకలనం) 1975

# ఆంధ్ర జనని

మల్లంపల్లి సోమశేఖర శర్మ

శ్రీ మించునీమూర్తి చిత్తమందెంచి
చేతులు జోడించి శీర్షంబు వంచి
వినుతించి నీ ఖ్యాతి
ప్రణుతింతు మోమాత!

మమ్ము దీవింపుమా మముగన్న తల్లి! 1
పాడి పంటలతోడ భాగ్యాలు తూఁగి
విరియు పైరుల తీవి విభవానఁ దోఁగి
చెలువారు నీ రూపు
తల పోతుమే మాపు
మమ్ము దీవింపుమా మముగన్న తల్లి! 2
పెక్కు తీర్థాలఁ బవిత్రతం బొరసి
బహుక్షేత్రములతోడ భవ్యమై మెఱసి
పొదలునిన్ బాడుదు
యెదఁ గొనియాడుదు
మమ్ము దీవించి మమ్మరయు మీతల్లి! 3

తెలుఁగు జోదుల కత్తి మలని నర్తించె
తెలుఁగు రౌతుల తేజి లలి ఛౌకళించె
తెలుఁగు దొరల సేన దెస లాక్రమించె
తెలుఁగు రాచరికంబు దెసల రాణించె
పర దుర్గములు కూలె
పర రాజ్యములు వ్రీలె
తెలుఁగు వారల ధాటి వెలుఁగొందు నపుడు
తెలుఁగు వారిని నీవు దీవించు నపుడు 4

వారి వంశమునందె ప్రభవించినాము
వేడి నీ కరుణకు వేచి యున్నాము
విన్నాము నీ కీర్తి
గన్నాము నీ మూర్తి
మమ్ము దీవింపుమా మముగన్న తల్లి! 5

ఏ దేశమున కన్న ఏ గంగ కన్న
మా దేశమే మిన్న మా గంగ మిన్న
అనుచు నిన్ భావించి
ఘనత నిన్ సేవించి
నీలోన మేమయ్యె మాలోన నీవయ్యె
పరిఢవిల్లు పథమ్ముఁ బడయంగనెంతు
మమ్ము దీవింపుమా మా ఆంధ్రజనని! 6

('మణిమకుటము' అనే సంకలనంలోనిది. సం.ప్ర. తేది 1931)

# జోహారు

తుమ్మల సీతారామ మూర్తి చౌదరి

తెనుఁగుతల్లీ! నీకు జోహారు
దేశామాతా! నీకు జేజేలు.

నినుఁజూచి నినుఁబాడి నినుగొల్చు వేళ నా
కను లాణిముత్యాల గనులుగా నగు నహో!

తెనుఁగుతల్లీ! నీకు జోహారు
దేశమాతా! నీకు జేజేలు

నీపాలు జుంటి తేనియల తేటలో గోస్త
నీ పక్వారసమో సుధా పూరమో యాట
నా పల్కు లీ తీయనకు నోఁచి విశ్వ శా
లీ ప్రపంచ ప్రశంసాపూరితము లాయె. ॥తెనుఁగు॥

కుటిలశాత్రవ కోటిగుండెలో నిదురించి
యిటు సేతు వటు గంగ యెల్లగా జగమేలె
నటగాజ కంధగా నైల్యమ్ము నడఁగించు
పటుకీర్తి పెంచె పట్టి యెంతటి వాఁడో ॥తెనుఁగు॥

ఎల్లోర కొండ నీ యల్లారుగిమచె
కొల్లూరి కోహినూరు కొప్పులోఁ బూవదే
కొల్లారు గనులు నీ కోశంబటే పండ్లు
పుల్లనై పోవు భోగమ్ము కన్నచో ॥తెనుఁగు॥

గౌతమీ కృష్ణానదీ తుంగభద్రాది
పూత స్రవంతికా పుంజమ్ము నీ ముద్దుఁ
గూఁతులై నీ చేను నీ తోట పండింప
నీ తనూజులు పైఁడి పాఁతఱల్ కప్పిరే। ॥తెనుఁగు॥

ఏ పుణ్య లేశమ్ము నాపాలి దాయెనో
నా పూజ కేలోకనాధుండు పొంగెనో
నీ పావనోత్తర శ్రీపరంపరలలో
నీ పదార్చకులలో నేను నొక్కఁడనైతి ॥తెనుఁగు॥

('తెలుగుతల్లి' అనే సంకలసంలోనిది. సం.ప్ర. తేది 1975)

## తెలుఁగు గడ్డ

గుఱ్ఱం జాషువ

ఆంధ్రాశీ మోదంబు నాశించి పోయిన
  తిక్కనార్యుని వాణి తృప్తినంద
గజ్జెలందెల కాలు గదలించి మన్నె బొ
  బ్బిలి కోటఁ దొలికోడి పలికి కులుక
నడువీథులందు రత్నము లమ్ముకొన్నట్టి
  తెలుగుల సంపత్తి తలపుకెక్క
ఖండాంతరముల బంగారు పూజలు గొన్న
  కలికి పోగరమేను పులకరింప

మూడు కొండల శివలింగములు రహింప
నాలపింపక రాష్ట్ర సింహాసనమున
నధివసింపుము జయము నీయందుగలదు
దివ్యదాశయసుమవల్లి! తెలుఁగు తల్లి!

ఘన గాంగేయ శర ప్రవాహముల నింగన్ సోఁక కత్యంత ప్రా
క్తనపుంగీకగి నిందులాడెడు విముగ్ధ ప్రాంతముల్ నిద్ర మే
ల్కొన శంఖారవ మాచరింపు మిక సుగ్రంథాలతో ఘంటమం
దిన విద్వాంసులగన్న వీర జనయిత్రీ! ఆంధ్రరత్నక్షితీ!

కులముల్ కొమ్ములతోడ గుమ్ముకొని చిక్కుల్ పెక్కు సృష్టించు పె
ద్దల కాలాలు గతించి పోయినవి స్వాతంత్ర్యంబు సిద్ధించె రా
జుల సింహాసన మెక్కినారు ప్రజ లెచ్చుందగ్గులం బాపుజీ
హలిక శ్రేష్ఠుడు దున్నినా డిపుడు లేవంతస్థు లాంధ్రక్షితీ!

పెను స్వార్థంబు మహా పిశాచమువలెన్ బీడింప దేశంబు చి
క్కిన శల్యంబయి తూలిపోయినది యీ కీడుం దొలంగించు చ
క్కని మార్గం బుపదేశ మిచ్చుకొని ముక్తాస్వచ్ఛ భావంబు నీ
యనుగుం బిడ్డలలో సృజింపుము త్రిలింగాద్రిక్షమాభూషణీ!

ఆలాపించిన సత్కవీశ్వరుల దివ్యాశీర్వచశ్శక్తిచే
నాలంబించిరి భారతీయులు స్వరాజ్య స్వర్ణ దండంబులే
దాలంబంబు కవి ప్రపంచమున కమ్మా! వాఙ్మయోద్యానమున్
బాలింపంగల దాతలం గని రసజ్ఞత్వంబు చాటింపుమీ!

('ఖండ కావ్యము' అనే సంపుటిలోనిది సం.ప్ర. తేది–1956)

# తెనుఁగు తల్లి

నాయని సుబ్బారావు

తఱుగని వాత్సల్యము పా
తర త్రివ్వినగతి దయార్ద్ర తరళ దృగంత
స్ఫురణమ్మున మాహృదయాం
తరములు గుత్తగొను తెన్గు తల్లికి జేజేః

కృష్ణాపవిత్రవార్ ధృత సారసస్యసం
భరిత భూభాగమ్ము భద్రపీఠి
పాద పీఠము దక్షిణోదధి ప్రాచీన
మావృతాగ్రమ్ము కన్యాకుమారి
గంగా తరంగాగ్రగళిత శీకరసిక్త
మహితధాత్రికిరీట మండనమ్ము
ఆజాను దీర్ఘబాహో పద్మనాళ ద్వ
యమ్ము ప్రాక్పశ్చిమాహార్య పంక్తి

ఇరుగడలనుండి సాగి మిన్నెగసి పొంగు
జలధిలోలోర్మికా ఫేన చంక్రమణము
లేసరియులేని కీర్తిహల్లీసకములు
గాగ వెలుగొందె నొకనాడు కన్నతల్లి.

ప్రథిత సామ్రాజ్య నిర్మాణ క్రియా ప్రౌఢి
తెనుఁగు జెండా సర్వ దిశలనాటి
వాణిజ్య శక్తి సప్త మహాంబు నిధులందు
తెనుఁగు సంద్రమ్ములు దిద్దితీర్చి
వేదమ్ము సుస్వరాన్విత పటిష్ఠమ్ముగా
తెనుఁగు పాండిత్యమ్ము తేజుకొల్పి
దివ్య సౌందర్య వర్ధిత భావనా శక్తి
తెనుఁగు శిల్పము పరార్థిత మొనర్చి

ఆరు ఋతువుల భూరి సంభారమెల్ల
పేర్చి నాగేటి కఱ్ఱున పెళ్ళగించి
నేల బంగరు పంట పండించి మెరసె
సునిశిత ప్రతిభాశాలి తెనుగు బిడ్డ.

ఆబాల గోప చిత్తానంద సంధాయ
కముగా మహాపురాణములు సెప్పి
అతి పురాతన చరిత్రౌన్నత్య సందీప
కముగా ఘనేతి హాసములు విప్పి
నందనారామ సుందర పారిజాత గం
ధముగా రసప్రబంధములు కూర్చి
నవనవాద్భుత కల్పనా సమున్నత కళా
వధిగా బృహత్కథావళులు తీర్చి

భీష్మకభిమన్యుడాదిగా విదిత శౌర్యు
లైన భారత యోధులకచ్చమైన
తెనుఁగు వీరులమూర్తి కల్పన మొనర్చి
దివిజకవిసన్నుతుండయ్యె తెనుగుసుకవి.

నీవు పురాణ దేవతవు నీ చరితమ్ము సమస్త విశ్వసం
భావితకీర్తి మన్మధుర మంగళ గీతములబ్దరాష్ట్ర సం
జీవి ననంతసత్త్వలయినీ వరదాభయహస్తలాలన
శ్రీవిభవుల్ తెనుంగులు వరింతురు సర్వశుభ ప్రపంచమున్.

('నాయని సుబ్బారావు కృతులు' అనే సంపుటి లోనిది. ప్ర. తేది. 1958)

## తెలుఁగు తల్లి

వేదుల సత్యనారాయణ శాస్త్రి

యుద్ధముల వెన్నునీయని యోధులకును
చేతికెముకలేకిచ్చెడి దాతలకును
శిలకు ప్రాణమ్ము వోసెడి శిల్పులకును
జననియై వన్నెకెక్కె నా తెనుఁగు తల్లి!

పంట పొలములకును పాడి పశువులకును
జీవనదులకు పర్వత శ్రేణులకును
దివ్యక్షేత్రములకు పుణ్యతీర్థములకు
ఉనికిపట్టయి వెలసె నా తెనుఁగు తల్లి!

తెనుఁగు శిల్పుల హస్త కౌశలము దాటు
గుళ్ళతో గోపురాలతో గుహలతోడ
కాలిడినతావు చిత్రాలశాలగాగ
నను పరవశునిజేయు నా తెనుఁగు తల్లి!

తెలుగు నేలపైన తిరుగాడునప్పుడు
తెలుగుమాట నోటఁ బలికినపుడు
తెలుగువారి కథలు తలపోసినప్పుడు
పొంగిపోదు గర్వమునను నేను!

సిరి బంగారు పండెడు తెలుగునేల
తేట నీటితో ప్రవహించు తెలుగు నదులు
తెలుగు వాసిని ప్రకటించు తెలుగు గిరులు
తలచుకొన్నంత నామేను పులకరించు!

('ముక్తసురి' అనే సంపుటిలోనిది. సం. ప్ర. తేది 1962)

# తెలుఁగు తల్లి

పైడిపాటి సుబ్బరామ శాస్త్రి

తెలుగు తల్లి!
వెలుగు వల్లి!
తీయంద
నాలవెల్లి

అందుకొనుము
వందనమ్ము
లాచరింతు
మందరమూ

తుంగభద్ర గౌతమీ
కృష్ణాపినాకినీ
తోయమ్ముల కడిగి అద్దు
కొందుము నీ పాదమ్ముల

దాక్షారామ శ్రీకాళే
శ్వర శ్రీశైలమ్ముల
అక్షయమ్మైన వెలుగు
అంతయు నీవేనమ్మ

ఆడెను సిద్ధేంద్రుడు - మఱి
పాడెను త్యాగయ్యయు - పలు
కాడెను నన్నయ్య ఓ
యమ్మ నీ కోసమూ

తెలుగు తల్లి!
వెలుగు వల్లి
తీయంద
నాలవెల్లి!

అందుకొనుము
వందనమ్ము
లాచరింతు
మందరము.

('విజయభారతి' అనే సంపుటిలోనిది. సం. ప్ర, తేది 1959)

## తెలుగు తల్లికి ముత్యాలు

పిల్లల మఱ్ఱి వేంకట హనుమంత రావు

తెలుగుల్ల తల్లికీ — తెల్లనీ ముత్యాలు !
మాపాలి తల్లికీ — మా మంచి ముత్యాలు !
ముత్యాల వరుసలో — ముద్దైన ముగ్గులూ !
ముగ్గులా మధ్యాన — వెలుగుల్ల గద్దియా !
ముత్యాలు కావాలి — ముక్కోటి మూర్తులూ
ముగ్గులే కావాలి — మవ్వపూ ప్రేమలూ !
గద్దెనూ ఏలాలి — గరువంపు బుద్ధులూ
తెలుగుల్ల తల్లికీ — తెల్లనీ ముత్యాలు.

('తెలుగుతల్లి' అనే సంకలనంలోనిది. సం.ప్ర. తేది 1975)

# తెలుఁగు తల్లి

పిల్లలమఱ్ఱి వేంకట హనుమంతరావు

తేనె పలుకుల తెలుఁగు తల్లీ ।
రవల వెలుఁగుల తెలుఁగు తల్లీ ।
తేజ నెరపిన తెలుఁగు తల్లీ ।
ఆశిషమ్ములనిమ్మ తల్లీ ॥
ఆదరింపఁగ రమ్మ తల్లీ ॥ ॥తేనె పలుకుల॥

శాతవాహన శకములోపల
శాంతి పాఠము నేర్పితమ్మా । ॥తేనె పలుకుల॥

పూర్వ వేంగీ యుగములోపల
పుణ్య కవితలఁ జెప్పితమ్మా ॥తేనె పలుకుల॥

కాకతీయుల కాలమందూ
ఖడ్గపాండితిగఱపితమ్మా । ॥తేనె పలుకుల॥

రెడ్డిరాయల రాజ్యమందూ
లలిత కళలను దేల్చితమ్మా । ॥తేనె పలుకుల॥

గాంధి దేవుని యుగములోపల
సదయ హృదయులఁగాంచితమ్మా । ॥తేనె పలుకుల॥

సర్వమానవ సమత గూర్పఁగ
భారతాంబకు యశమునింపఁగ
కదలిరమ్మా తెలుఁగు తల్లీ ।
ప్రోవరమ్మా తెలుఁగు తల్లీ । ॥తేనె పలుకుల॥

('కొనము కొట్టిన గంటలు' అనే గేయ సంపుటిలోనిది. నం.ప్ర. తేది 1967)

## మహాంధ్ర!

బులుసు వేంకటేశ్వరులు

తన్ను సేవించినఁ దాపత్రయము బాపి
    ధన్యులఁ జేసెడి తల్లి యెవరు?
చలనంబు లేని విజ్ఞానంబు వెదజల్లు
    ధన్యాత్మురాలగు తల్లి యెవరు?
ఇహపర సుఖముల నెసలారఁగాఁ గల్ప
    వల్లిపోలెను బ్రోచు తల్లి యెవరు?
బహువిధాలంకార భావోన్నతత్వ సౌం
    దర్య మూలంబగు తల్లి యెవరు?

దిగ్గజ శ్రేష్ఠులను బోలు దివ్య కవుల
విజ్ఞులను లోక వీరాధి వీరవరులఁ
గన్న మనతల్లిఁ దెలుఁగుతల్లిని సువర్ణ
రత్నపీఠంబుసన్ నిల్పరా! మహాంధ్ర!

('తెలుగుతల్లి' అనే సంకలనంలోనిది. సం.ప్ర. తేది 1975)

# రథోత్సవము

తుమ్మల సీతారామ మూర్తి చౌదరి

అదిగో తెల్గులతల్లి దివ్య రథము ద్యుత్కాంతి పుంజంబులన్
పది దిక్కుల్ వెలిఁగించుచున్ గదలెడిన్ ప్రస్ఫార భేరీధ్వనిన్
బధిరంబయ్యె జగంబు మీకుఁగల కాన్కల్ తల్లి కర్పించి తద్
రథమున్ లాగుఁడు మాతృభక్తిదయి వారన్ దెల్గువీరాగ్రణుల్.

అరతనేమి ఘట్టనల కగ్గములై మన హేయకాయముల్
తేలినఁ డీఱుఁగాకఁ చనుదెంచు విచారము లేలఁ మాతృ సే
వారమణీయ వృత్తమున వందురిసచ్చినవారి జాహ్నవీ
తీరమునందు భోగములఁ దేల్తురు వెన్నెలరేలనచ్చరల్

చల్లుంఢుల్లుల శౌర్య వీర్యములతో సామ్రాజ్య నిర్మాతలై
యెల్లన్ దేశములేలునాఁడు మనయందే గర్వసంరంభము
ద్వల్లీలన్ నటియించె నిప్పుడు తదీయాటోపమున్ గోరుచున్
మల్లెల్ మొల్లలు జాజులాంధ్ర జగదంబా పాదపీఠమ్మునన్

('రాష్ట్రగానం' లోనిది సం ప్ర. తేది 1939)



# తెనుఁగు తల్లి

నందూరి రామకృష్ణమాచార్యులు

కవులకంటే తుహిన కర్పూరనిభకీర్తి
తెచ్చిరెవరునీకు తెనుఁగుతల్లి!
సాహితీరంగ సంగీత రసధుని!!
దేశభాషలందు తెనుఁగులెస్స!

జయము జయము తెనుఁగు తల్లి!
పేశలభాషాపులకిత
పుణ్యధరిత్రీమ తల్లి!!
జయము జయము.... .... ....

ఉదయభానునవకోమల కిరణోజ్జ్వల పూర్వదిశా
ముఖముక్తారాగ రచితరంగవల్లి! తెలుఁగు తల్లి!!
తరళ చంద్రికాస్నాపిత కృష్ణాగౌతమీ నదీ
తారహార నర్వదిశా ప్రతిబింబిత సుందరగళ!
మలయ పవనమందచలిత ఝళం ఝళత్ పినాకినీ
సువర్ణ ముఖరీనూపురమధురనాద పాదయుగళ

పౌరాణిక దివ్యశిల్ప కళాచిహ్న పరంపరా
మహిత పర్వత శిఖర విలసిత త్రిలింగ విహారిణీ!
నీలనీరద పరిపుష్ట సస్యశ్యామల సువర్ణ
నుందర నుకుమార చలత్చేలాంచల ప్రచారిణీ!

జగదేక పరాక్రమాద్యమహారాజ రాజమంత్రి
సేనాపతి మహావీర భటసేవిత జనయిత్రీ
నిత్యనూత్న ప్రతిభాంచిత కవిగాయక తత్త్వవేది
శిల్ప కళాజ్యోత్స్న విలసిత దివ్యామృతధాత్రీ!!

('తారాతోరణము' అనే నంకళనంలోనిది.)

## బంగారు తల్లి !

యస్. టి. జ్ఞానానందకవి

ఈ శుభ పుణ్యకాలమున నీ సుముహూర్త మహోత్సవ ప్రభా
తాళయవేళ నీ మధురతా రసబంధురతా మనోజ్ఞదీ
ప్తాళయ పర్వకాలమున నక్షయమైన తెలుంగుకీర్తి ది
గ్దేశములన్ రహించెడిని దివ్వటి నెత్తుము తెల్గు కామినీ !

గుంజుకొంటివి తల్లి కుటిల మానసవైరి
దోశ్శక్తి నణచి నవశ్శ్రుతమ్ము
పుంజుకొంటివి తల్లి భువనభాండము గుమా
యింప కీరితి పూలసంపుజల్లు
రుంజుకొంటివి పూర్వమంజసాభాగావ
హారులౌ యొరుల దురాగతాల
నంజుకొంటివి మున్ను నవ మాధురీ ఝరీ
సంకాశ సుకవితాశస్త్ర రుచుల

ధరణిచక్రమునకు మిరుమిట్లు గొలుపంగ
తెనుగు పదము తీయదనము బంచి
నిఖిల జగతి పూజనీయత గణియించు
తెలుగు రాజ్యలక్ష్మి వెలయుమమ్మ !

బంగారమ్ము ఫలించు పంటపొలముల్ పావిత్ర్య సుక్షేత్ర రా
జిం గళ్యాణ ప్రదంబులౌ రసధునుల్ జీవాల కుజ్జీవమై
సింగారింప శిలోచ్చయాలు పహరా సేయంగ సౌభాగ్య శ
క్తిం గీర్తించెద నాంధ్రరాజ్య జనయిత్రీ ! యెంత ధన్యాత్మవో !

చవులూరించిన యట్టి నీదు సుషమా సౌభాగ్య సంపత్తికిన్
భువనంబుల్ గొనియాడ సాగినవి కాపుల్ గాచె నీ సేవ రా
జవిభాశ్రీ ఫలవృక్ష సంతతులు సాజంబైన దాక్షిణ్య మూ
ర్తివి నీ కీర్తి చంద్రికల్ దెసలు తల్లీ! పత్రై పోషింపుమీ!

హాయింపుమీ ముగ్ధ మోహన రాగ సూ
నాలు సందరుల స్వాంతాలలోన
కాయింపుమీ క్రమగాఢోజ్జ్వల
కాంతిరేఖా చంద్రికలు జగాన
వ్రాయింపుమీ మధుర మహాంధ్ర ప్రధమాన
పౌరుషాకృతులు విశ్వఫలకాన
మోయింపుమీ పొట్టి మునిత్యాగ సహితమౌ
ఆత్మార్పణం బైన యమృతవీణ

పూర్ణ విజ్ఞాన ప్రభూత చైతన్యమ్ము
నిండనిమ్ము నీ యఖండభూమి
గంపెడు బలగమ్ముగల దానలోకాన
కడిమి బలముగలుగు తెలుగుదాన!

ప్రహస్వంబైన సహోదరత్వములు స్వీయక్షేమ వాంఛా తప
శ్శీ స్వేచ్ఛా పరికల్పితాశయము రాశీభూతమై యొప్పగా
నిస్స్వార్థమ్మును గోలుపోయిన సుతానీకానకు న్నేడు దీ
క్షా స్వర్ణాంచిత కంకణమ్ము విధిగా గట్టింపు మాంధ్రావనీ!

('తెలుగుతల్లి' అనే సంకలనంలోనిది. నం.ప్ర. తేది 1976)

# తెలుఁగుతల్లి

డా॥ యస్. జ్ఞానానందకవి

ధర్మధ్వజమ్ము మాధవవర్మ కాలాన
గగనాంగణములోన నెగురునాడు
తెలుఁగు యోద్ధల శౌర్యములకమల్లారెడ్డి
అతుల సేనలను చెండాడునాడు
కులములంటని దా కూటి సిద్ధాంతమ్ము
బ్రహ్మనాయండేరుపరుచునాడు
పరిమళద్రవ్య సంపాదనా కాండాతి
అవచి తిప్పయ కీర్తినందునాడు

విపులత క్కెమెఱయ వీరకన్నమనీడు
స్వామి వాక్పథాన సాగునాడు
సురులలోన గలుగు శూరత్వమునకెంత
పులకించినావో తెలుగు తల్లి!

కొలపు దాపదు తొట్టతొలికవి నన్నయ్య
తెలుఁగులో కవనమ్ముగిలుకునాడు
దిష్టి తగులకుండ తెనిగింప తిక్కన్న
జన్మమ్ము నిష్టమై నలుపునాడు
మదుర శబ్దపిదుండు మహుడు శ్రీనాథుండు
కంచుఢంకను తన్నగలుగునాడు
మనుదు రాయలచేత గగ్గెరన్ పెద్దన్న
కొలువులో తొడిగించుకొన్ననాడు

శాక పాకములను చక్కగా పోతన్న
వంటయింటిలోన వాణిచేత
నిండురుచులు దోప వండించుకొనునాడు
తేప్పినావుగదవె! తెలుగుతల్లి!

పతికి సాయముసేయ బవరాన మాంచాల
పంతాన ఖడ్గమ్ముపట్టునాడు
మగనిలో శౌర్యమ్ము రగిలించి దానమ్మ
అనితలానకు సాగనంపునాడు
కలహభూమిని విరోధుల జీల్చి రుద్రమ్మ
తండ్రి పేరును నిల్పి తనరునాడు
పతి మృతి చెవిలోన బడినంత మల్లమ్మ
తమకాన నగ్నిలో దుముకునాడు

పౌరుషమున బ్రతుకు వీరాంగనలగన్న
భాగ్యశాలినివి ప్రపంచ చరిత
కలిగినట్టి నీవు గర్వింపగా జాలు.
వెలది మిన్నలమ్మ ! తెలుగు తల్లి.

అభిరామ హృదయుడౌ యిబరాము కుతుబుషా
తెలుగు గొప్పదనమ్ము నిలుపునాడు
ప్రముఖ భాషావేత్త బ్రౌను విద్వాంసుండు
తెలుగు వాణికి గీర్తి దెచ్చునాడు
మురిసి రాజారామ మోహనరాయలు
తెలుగు వైదికుల స్తుతించునాడు
ఎనలేని హర్షాబ్ధి మునిగి మెగస్తసీన్
తెలుగుల యున్నతిన్ దెలుపునాడు

మెప్పుకొఱకుగాక యప్పయ్య దీక్షితు
లిజముతేని కంఠమెత్తి తెలుగు
బాస కేదికోళ్ళ పలికిన యానాడు
కులికిపోతివెగదె ! తెలుగుతల్లి !

కాలశరాంగ చక్రగతిరగమనమ్ము
      నల వీరబ్రహ్మమ్ము దెలుపునాడు
వర్ణకుడ్యాలను పడదన్న వేమన్న
      కవితాయుధముతోడ కదలునాడు
విధవలౌవారికి వీరేశలింగమ్ము
      తిరిగి వివాహమ్ము జరుపునాడు
కడుదీనమనుజాలన్ గాపాడ బ్రహ్మర్షి
      చిత్తశుద్ధిగ కృషి జేయునాడు

సంఘ సంస్కరణము సాధింప గురుజాడ
శంఖమెత్తి దెసల జాటునాడు
అంతరమున నెంత హర్షంబునందితో
దివ్యభావవల్లి! తెలుగు తల్లి.

('రాజధాని' అనే సంపుటిలోనిది సం.ప్ర. తేది–1987)

# పూజా ప్రసూనాలు

ఉత్పల సత్యనారాయణాచార్య

హాలుడు ప్రాకృత గాథా
లోలుడమ్మ నీ బిడ్డడు,
శక పహ్లవ యవనరిపుల
చక్కడిన యోధాగ్రణి
యజ్ఞశ్రీ శాత కర్ణి
అతడు నీ వీరసుతుడు,
పొలాలిచ్చి వేలకొలది
హలాలిచ్చి తెలుగునేల
సస్యశ్యామల చేసిన
శాంతిమూల మహారాజు,
తన ధార్మిక వర్తనముగ
దైవము మెప్పించి కనక
వర్షమునే కురియించిన
వాడు విష్ణుకుండినపతి,
హర్ష చక్రవర్తి గర్వ
మణచినట్టి సత్యాశ్రయ
పులకేశి మహిపాలుడు
తెలుగుతల్లి కన్నకొడుకు,
భారతకథ నన్నయచే
పలికించిన రాజరాజు
వైదికధర్మమును మరల
పాదుకొల్పినట్టి జోదు
తిక్కన తోడ్పాటుతోడ
తెలుగునేల నొక్కగొడుగు
క్రిందికితెచ్చిన వీరా

్రగిము డా కాకతిభూపతి,
భద్రకాళి యవతారము
రుద్రమాంబ వీరనారి.
ఎఱనగారికి ఆశ్రయ
మిచ్చిన అద్దంకి రెడ్డి,
అనవేముడు దానకర్ణు
డచ్చమైన తెలుగురేడు,
కొలువులోన కవిరాజును
నిలుపుకొన్న పెదవేముడు,
రాచకొండ వెలమ నృపులు
రేచెర్ల మహాయోధులు
సారస్వత సమరాంగణ
సార్వభౌముడౌ రాయలు
తెలుగుబావుటా యెత్తిన
ధీరలోక మూర్ధన్యుడు
దేశభాషలన్నిటిలో
తెలుగే లెస్సని చాటిన
సరసకావ్య నిచయభర్త
స్వర్ణయుగారంభకర్త.
గోలకొండ సుల్తానులు
కూడను నీవారె తల్లి!
ఇబ్రాహీం తెలుగునోట
ఇభరాముం డైనవాడు,
వీరమల్లను సొంతుర
సేవలోననే గడిపిన
కందుకూరి అనిసాంత్ర
గగనమ్మున వెలుగుచుక్క!
ఆంగ్లేయుల నెదిరించిన

అల్లూరి టంగుటూరి
భాషా రాష్ట్రాల నాంది
పలికించిన శ్రీరాములు,
వీరుడు అమలాపుర స
ద్దారుడు ఆంధ్రయుగంధర
మంత్రివర్యుడగు బూర్గుల
మాదపాటి పితామహుడు
తల్లీ! వీ రెల్లరు నీ
తనయులు పరమపవిత్రులు
నీకీర్తిని నలుదిక్కుల
నిల్పిన ధన్యచరిత్రులు.
ఇవిగో! దోసిళ్ళనిండ
నిన్నిపూలు నీ పూజకు
తెచ్చితి మముగూడ నేడు
దీవింపుము తెలుగు తల్లి!

('తెలుగు తల్లి అనే సంకలనంలోనిది. నం.ప్ర. తేది 1978)

# తెలుగు తల్లి

వింజమూరి శివరామారావు

ఏనాడో భోగాల తేలిందిలే॥ తల్లి
ఈ నాల్గుదిక్కులూ యేలిందిలే॥

దాసిగా నీనాడు తల యొగ్గనేలెమ్మ
నిమపేదయై నేడు దురపిల్ల గానిమ్మ

ఏనాడొ సంపదల కురిసిందిలే॥ తల్లి
ఈ నాల్గు దిక్కులా విరిసిందిలే॥

చిరునవ్వు నవ్వెనా వరములనిపించేది.
ఎరుపు చూపొరసె నాధరణి వణకించేది.

ఏనాడొ గరువాన తిరిగిందిలే॥ తల్లి
ఈ నాల్గు దిక్కులా పెరిగిందిలే ॥

తనమాట తనపాట తన తపసు తన మహసు
ఇరుగు పొరుగమ్మలకు నెరువుగానిచ్చింది

ఏనాడొ అందాల పండిందిలే॥ తల్లి
ఈ నాల్గుదిక్కులా నిండిందిలే॥

పేరు పెంపులులేక దారితెన్నులు కాన
రాక యీనాడిట్లు శోకింమ తెలుగమ్మ

ఏనాడొ భోగాల తేలిందిలే॥ తల్లి
ఈనాల్గుదిక్కులూ యేలిందిలే.

# ఆంధ్రమాత

కూచిబొట్ల ప్రభాకర శాస్త్రి
ఘట్టి లక్ష్మీ న సింహ శాస్త్రి

గౌతమీ విమల కంకణ గణస్ఫురదరు
　　ణాంశు నీరాజిత ఆంధ్రమాత
కృష్ణవేణీ పరిస్పృష్టఘనజఘనా
　　త్యంత గౌరవయుత ఆంధ్రమాత
తుంగభద్రా సరిత్తుంగ తరంగ భం
　　గా ప్తమహఃపూత ఆంధ్రమాత
వరక వేరాత్మ జావాఃప్రవర్ధితసున
　　న్యాలంకృతిస్ఫీత ఆంధ్రమాత

తతపినాకినీ మధురామృత ప్రసేచ
నాతి మంగళ కేదార ఆంధ్రమాత
పరమ పంపాప్రవాహ ప్రవర్ధమాన
యతి జనావాసవనతత ఆంధ్రమాత.

('ఆంధ్రపత్రిక' ప్రథమ భాగంలోనిది. ప్ర. తేది 1989)

## ఆంధ్ర జననీ

కూచిబొట్ల ప్రభాకర శాస్త్రి
ఘట్టి లక్ష్మీ నరసింహ శాస్త్రి

త్రెంప శతాబ్దాన్య శృంఖలమ్ములనున్న
దేశభక్తుఁడు నీకుఁ దిన్ననంత,
శాశ్వత హైందవ స్వాతంత్ర్య సంపాద
నపరుండు సరదారు న్యాయవాది,
లాల ముత్తాతల తతిప్రాంత భూతాల
టకటొంకు లెఱుఁగు పట్టాభి సాక్షి
పరవాది జనవృక ప్రకర కేసరి, ఆంధ్ర
కేసరి కుడిభుజ మోసరిలక,

అన్నిటం బట్టుకొమ్మ మహర్షి, పరులు
గొనిన స్వాతంత్ర్య సంజ్ఞము ధనము నీవు
వారయుటలియోగమున గెల్చి యరుదె యింక
ననుపమాన వైభవశ్రీ, ఆంధ్రజనని!

('ఆంధ్రప్రతిభ' ప్రథమ భాగంలోనిది. ప్ర. తేది 1939)

# తెలుఁగు తల్లి

కొవ్విడి వేంకటరత్న శర్మ

ఆరాధింపుము 'తెల్గుతల్లి' నెపుఁడుద్యద్భక్తి పెంపారఁగా
ఘోరాభ్రంబునఁ గారుమబ్బు లలమన్ గోలాహలధ్వానమై
దారా పుత్రరమల్ శిరంబెఁ ఖిలమౌ వర్ణాల భేదంబుచేఁ
వీరవ్రాతము పోపుదారిఁ జనుమా వీరాగ్రణీ! ఆంధ్రుడా!!

ద్విజులున్, గాపులు కమ్మ, రెడ్డి, వెలమల్ వీర్యంబు రేకెత్త, మా
ధ్వజినీకాండ పురాతనాంధ్ర విభవప్రౌఢిన్ విడంబింపగన్
గజవాజుల్ భటరాజిముందుఁ జన నాకం బక్షతల్ సల్ల, వే
భుజమున్ భారత పంచవర్ణపటసమ్భూషావళల్ గప్పగా
విజయాశీస్సులనంది శోభమనుమా! వేంగీమహీమాతరో!

భవభూత్యాంధ్రుడు మల్లినాథ బుధుఁడున్ భద్రాంబ, శాకల్యుడున్
కవినారాయణ తీర్థ, శ్రీధరుడు, నన్నంభట్టు నాగార్జునుల్
ధ్రువతారల్ బలెప్రాకృతాంబరపు వీధుల్ నిండి దీపింతురా
నవదీప్తుల్ గురిపించు చంద్రుడు జగన్నాథుండె కాఁబోలు న
ల్లవిగో చూడుము! కేలుమోడ్చి మనుమా! హంకారతన్నాంధ్రుడా!

విద్యారణ్య, కపర్ది భాస్కరకవుల్ విశ్వేశ, గంగాధరుల్
విద్యానాథుఁడగస్త్యుఁడున్ హరిహరుల్ శ్రీసింగ భూపాలుఁడున్
హృద్యంబైన నృసింహ భల్లట, కుమారిల్ భట్టు, కృష్ణాధ్వరుల్
విద్యత్కీర్తులు దివ్యులాంధ్రులుగదా యున్నారు తారాళియై.

ఆనందాంబుధినోలలాడి మనుమమ్మా నీవు సృష్ట్యంతమున్
వాణీసేవ పరాయణుల్, గుణఖనుల్ పాండిత్యతేజోనిధుల్
నానాపుణ్య పురాణ పూరుషులు విన్నాణంబుగా నీదుగ
ర్భానన్ జన్మముగాంచి దివ్యయశతన్ వర్ధిల్లి రాంధ్రావనీ!

('ఆంధ్రస్మృతి' (తెలుగువీదులు) అనే సంపుటిలోనిది. నం.ప్ర. తేది 1948)

# తెలుఁగు తల్లి

ఒద్దిప్రోలు కృష్ణమూర్తి

తిక్కన్న తెలిసి దివ్య విశేషాను
గతిని శారదనాల్క గదులునాఁడు
వేమన్న విజ్ఞాన వితతమ్మునకు వేద
వేదాంగములు ప్రకంపించునాఁడు
త్యాగయ్య గానామృతంబు లుప్పొంగి తుం
బురనారదుల నట్టె ముంచునాఁడు
కంచెర్ల గోపన్న కన్ను సన్నలలోన
రామస్వామి తారాడునాఁడు

రాలియుండిన యాణిముత్యాలు కనులఁ
గాంతులీనఁగ మానసమ్మున నేఁడు
ప్రేమ దీపింప సాక్షాత్కరింపుమమ్మ!
తెలుఁగు వెలుఁగులవెల్లి! ఓ తెలుఁగుతల్లి!!

మల్లినాదుని మకోమంకలమ్మున వాణి
యిలు గట్టుకొని వసియించునాఁడు
బ్రహ్మన్న యొడిలోన బంచముం దొకకూన
చిరునవ్వు వెన్నెలల్ చిందునాడు
అప్పాజి యూహా మహాపథమ్ముల రాజ
నీతి కుభ్యాసముల్ నిండునాఁడు
పాపరాయని ఖడ్గబంధ మాలంబించి
వీర విక్రమలక్ష్మి వెలుఁగునాఁడు

హరువుసూపిన మందహాసాంకురములు
పెదవులం గందళింప మాయెదుట నేఁడు
ప్రేమ దీపింప సాక్షాత్కరింపుమమ్మ!
తెలుఁగు వెలుఁగుల వెల్లి! ఓ తెలుఁగుతల్లి!!

నాగార్జునాచలనాయకమ్మున శిలా
దేవతల్ ముసుగులు దీయునాడు
విజయవాటికలోన వినువీధినుండి బం
గరుపూల జల్లులు గురియునాఁడు
ఓరుగల్ కోటపై నాలసియాడు పతాక
ఫటపటలకు రిపుల్ వణఁకునాఁడు
విద్యానగర రాజవీధుల వైదేశి
కులు స్తోత్రపాఠముల్ సలుపునాఁడు

నివ్వటిల్లిన పండువెన్నెలలు వదన
గోళమున నుల్లసిల్ల మాప్రోల నేఁడు
ప్రేమ దీపింప సాక్షాత్కరింపుమమ్మ!
జిలుఁగు వెలుఁగులవెల్లి! ఓ తెలుఁగుతల్లి!!

('తరంగిణి' అనే సంపుటిలోనిది సం.ప్ర. తేది–1966)

## తెలుగు తల్లి

కల్యాణం వీరాస్వామి

ఓ తెలుగు తల్లీ!
శ్రీకల్పవల్లీ
వందనము చేకొమ్మ వందనం
హృదయపూర్వక వందనం
మధురకవనాలలో
మహిత శిల్పాలలో
మృదుల గానములలో
లలితలాస్యములలో
ప్రతిపదంబు కళా
రాజ్యాలు సృష్టించు
ప్రతిలేనిరంగారు
బంగారు తల్లీ!

నీ చిన్ని నవ్వులో
నుప్పొంగు నదులన్ని
నీ పలుకరింపుతో
పులకించు మాగాణి
నీ కంటి చలువకై
దివినుండి దేవతలె
నిండు వేడుకలతో
వేంచేసినారు
వీరమాతల ధాత్రి
త్యాగయోగులనేత్రి!
దివ్య జనయిత్రి!

('కుసుమాంజలి' అనే సంపుటిలోనిది. సం. ప్ర. తేది 1970)

## తెలుగు తల్లి

సముద్రపు శ్రీమహావిష్ణు

తెలుగుతల్లీ! నీకు జోహారు జోహారు
కల్పవల్లీ నీకు సాటిలేరెవ్వారు

గోదావరీ కృష్ణ
తుంగభద్రా పెన్న
మధురతోయము లిచ్చి
మమ్ముబ్రోచు మాతల్లి. ॥తెలుగు॥

సకల గుణగణధాత్రి
సస్యశ్యామలగాత్రి
ఎనలేని ఘనకీర్తి
గన్న పావనమూర్తి. ॥తెలుగు॥

తెలుగు పలుకులు మిన్న
తేనెసోనలకన్న
తీయ మామిడికన్న
తెలుగుదనమే మిన్న. ॥తెలుగు॥

తెలుగు సంతతికెల్ల
వెలుగుచూపితల్లి
వందనము లివె నీకు
అందుకొనుమా తల్లి.

తెలుగుతల్లీ! నీకు జోహారు జోహారు
కల్పవల్లీ నీకు సాటిలేరెవ్వారు.

('తెలుగు రేఖలు' అనే సంపుటి లోనిది. సం ప్ర. తేది 1975)

# ఆంధ్రమాత

గురజాడ రాఘవశర్మ

గౌతమీ కృష్ణవేణీ తుంగభద్ర పె
న్నా నదుల్ పాఱు మాగాణిగడ్డ
త్రిపురాంబ. కనకదుర్గాదేవి, వెంకన్న
తొత్తిళ్ళ బెంచిన ముద్దుబిడ్డ
నాగార్జున, విజయనగర, వినూత్న క
ళా సరస్వతుల విలాస భూమి
నన్నయ్య, యఱ్ఱ తిక్కన్న, పోతన్నాది
కవుల వాగ్వల్లి బంగారు తల్లి

కృష్ణరాయ మహీజాని, పద్మవర్ధ
నాది నృపశాతవాహనాంతంబులందు నలరి
మఱల స్వేచ్ఛాప్రపూర్ణయై మాన్యయైన
ఆంధ్రమాతకు భక్తితో హారతులిడుదు.

కట్టిన దాంధ్రమాతయిదు, కమ్మని ఖద్దరుబట్ట, వెన్నతో
బెట్టిన విత్యరే, సహజ వీరపరాక్రమ శౌర్యసంపదల్
పుట్టిన దాంధ్రదేశమని, పొంగని యాంధ్రుఁ డొకండు కల్గునే
పుట్టిన దేశమాత ఋణమున్ సరిదీర్చననాడె, యాంధ్రుడౌన్.

ఏ నాంధ్రుండను. పుట్టి పెర్గితి కదోయీ! ఆంధ్రదేశాననే
నానోటన్ వినుడెల్ల, కాంచునది యాంధ్రమ్మోయి, యీదేశమం
తా నాదేశమె, స్వీయరక్తమది, ఆంధ్రంబే కదా యిందులో
నానందింపని వారెవండు కలడే? ఆంధ్రేతరుండున్ వినా.

తెలుగుదేశమె నాయది, తెనుఁగువాఁడ
తెనుగుతల్లి యనుంగు చేతులను బెరిగి
తెలివిగొంటిని, మంటిని, తెనుఁగుతల్లి
పేరునిలుపఁ జేయాశ, యూపిరిఁ జెలంగ.

"'శ్రీరాములు' దయచేతను
ఆరూఢిగ సకల జనము లౌరాయనఁగా
భారతమునఁ ఆంధ్రశకం
బారంభం బాయెను విజయారంభముతో"

వేదాంత విజ్ఞానవేది 'సర్వేపల్లి'
ఖండఖండాంతర పండితుండు
పాశాణాంధ్ర విద్యాప్రవీణుండు, కార్య ద
క్షత గల విజ్ఞాని 'కట్టమంచి'
స్వీయ రాష్ట్ర స్థాపనాయత్న దుర్య ధీ
మ్మంతగు 'న్యాపతి సుబ్బరావు'
రమ్యరాయలసీమరత్నం బనంతశ
యనుడు మేధా సువిఖ్యాతయశుడు

కలరు, కల రెందరెందరో, మనపవిత్ర
భామణులు, వీరవనితలు, ధన్యయశులు
ఇట్టివారిని గన్న నీవెంత ధన్య
వాంధ్రమాతా! నమస్కారమమ్మ! నీకు.

('స్వాతంత్ర్యపథం' అనే సంపుటిలోనిది. ప్ర. తేది 1978)

## తెలుగుతల్లి

కప్పిశెట్టి వెంకటేశ్వరరావు

సిరులనిచ్చే కన్నతల్లి!
సుఖముగూర్చే కల్పవల్లి!
దీవెనల దయచేయవే మా
దేవి మాకిక తెనుగుతల్లి!

కల్లకపటము లేమొ తెలియని
పిల్లలాదరి ప్రేమజూపి!
ఎల్లవేళల నీదుకృప వెద
జల్లి ప్రోవవె, పాలవెల్లి!

విద్యలొసగవె మాకు జననీ
బుద్ధిగరపవె ఆంధ్రవాణీ!
పాడిపంటల నిచ్చి యందరి
కడుపునింపవె కృష్ణవేణీ!

బాలచంద్రుని పాపరాయుని
మల్లమాంబను గన్నవమ్మా,
పౌరుషముతో తెలుగు వీరుల
తీర్చిదిద్దితరలి నివమ్మా!

అనవరతమును తెలుగు బాలల
మందరము నిను గొల్తుమమ్మా!
మోక్షపథ మిల జూపవే! వన
జాక్షి మా అపరంజిబొమ్మ!

ఆంధ్రతేజ విరాజితా న
వ్యాంధ్ర జ్యోత్స్నకృపామయీ
అందుకో నీరాజనా లివె
ఆంధ్రదేశ కళామయీ! ||ని||

('గుజ్జనగూళ్ళు' అనే సంపుటిలోనిది. ప్ర. తేది 1957)

# తెలుఁగుఁదల్లి

వడ్డి వేంకటశివరావు

పౌషకృష్ణ పంచమి సోమవారమాది
గముల భక్తిసంయుక్తి సప్తాహదీక్ష
సోదరీ సోదరుల మేము సుధలుగురియు
తెలుఁగుదల్లికిఁ బూజలు సలిపినాము.

కవులు పండితవరుల్ గాయకులును
చిత్రకారులు జ్ఞాతచరిత్రు లఖిల
శాస్త్రపరిశోధనాత్త విజ్ఞాన ధనులు
రాజనీతి కళావిశారదులు ప్రాజ్ఞు
లాంధ్రమాతకు నల్వంక నదివసించి
పిన్న పెద్దలఁగూడి సంప్రీతితోడఁ

తద్యశః కీర్తనము వేవిధాలఁ బాడఁ
బాడినా మేము వారితో స్వరము గలిపి
పాడినా మేము లోకమ్ము ప్రతివచింపఁ
బాడినా మేము గొంతెత్తి పరవశతను
దానె పాటయై యెదుటఁ బ్రత్యక్షమయ్యె.
దీవన లొసంగె, నవ్వ మా తెనుఁగుఁదల్లి.

చిన్ని యన్నలార బుజుబుచ్చికము సేసి
తెలుఁగు సంపదఁ దెలుఁగులు తెల్లవోవ
దోచుకొని పోవుచున్నారు దొంగ లరుగొ
మంటగల్పుడు తచ్చౌర్య మలిన మతుల
నణచు బల్కిన దపుడు మా యాంధ్రవాణి.

భక్తితైలాన మాగుండె ప్రమిదలందు
వెలుగ జేసితి మానాడు తెలుగుజ్యోతి
నదియె మాతెన్గుఁదల్లికి హారతి యయి
మా మనంబుల జేరి కశ్మల మొనర్చు
మలిన విష కీటకాదులు మాడి చావ
నారి పోకింక వెల్గెడునచలితముగ.

తెలుఁగు జెండాలు మాచేత మెలగినపుడె
తెలుఁగుఁ గేతనం బదె మింట వెలిగినపుడె
తెలుఁగుఁదల్లికి జేజేలు పలికినపుడె
యగు తమ కభ్యుదయమంచు నాంధ్రవాణి
రంగుపూవుల మాపైని రాల్చెనెన్నొ.

నిండు జాబిల్లి మాగుండె నిండిపోయె
గండుగోయిల మాలోన గలసిపోయె
మన్మనఃకుహర మమృతమయమయ్యె!
దెనుఁగుఁదియ్యము లొలయు గీతికలు వెలసెఁ
బాడికొనుచు సుఖాబ్ధి సప్తకమునందు
నోలలాడితి మాపూజ నొదలు మఱచి.

('కలువకొలను' అనే సంపుటిలోనిది.. సం.ప్ర తేది 1959)

# తెలుగమ్మ

పుట్టపర్తి శరణాచార్య

ఇంతంత పెరిగింది। మా అమ్మ।
అంతంత వెలిగింది। తెలుగమ్మ।

వేదకాలపునాటి పెద్ద పేరంటాలు।
ముద్దారుతీరితో మురిసిపోయి నాడు
పెద్దపీటెక్కింది తెలుగమ్మ।
పేరు మార్మ్రోగింది। మా అమ్మ। ॥ఇం॥

జన్నాలనెదుటి అన్న సంతర్పణల్।
కులవాదకంటక స్మృతులు మూసిననాడు।
పెద్ద పీటెక్కింది తెలుగమ్మ।
పేరు మార్మ్రోగింది మా అమ్మ। ॥ఇం॥

నాగార్జునుండు దిగ్నాగుండు విప్లవ
బౌద్ధ శంఖంబొత్తి పర్యటించిననాడు।
పెద్దపీటెక్కింది తెలుగమ్మ।
పేరు మార్మ్రోగింది మా అమ్మ। ॥ఇం॥

అల్ల బ్రహ్మంగారు అలమందల గాచి
కమ్మరై తనకుండ కరగిపోసినాడు।
పెద్దపీటెక్కింది తెలుగమ్మ।
పేరు మార్మ్రోగింది మా అమ్మ। ॥ఇం॥

వృత్తిలోన నివృత్తి విజ్ఞానకళ హత్తి
ఫలల తత్వాల పాలుపంచినాడు।
పెద్దపీటెక్కింది తెలుగమ్మ।
పేరు మార్మ్రోగింది మా అమ్మ। ॥ఇం॥

చదువు ప్రౌఢువుల చవులు చూడనివేళ
మల్లెపువ్వొడికెత్త మొల్ల చల్లినవాడు
పెద్దపీటెక్కింది తెలుగమ్మా!
పేరు మారుమ్రోగింది మా అమ్మా! ॥ఆం॥

పూర్ణ సహాయ ధీమంతుండు గుండయ్య
గుండెలో గాలమై కోర్టకెక్కినవాడు!
పెద్దపీటెక్కింది తెలుగమ్మా!
పేరు మారుమ్రోగింది మా అమ్మా! ॥ఆం॥

వేమన్నకవి యోగి వెలలేని నీతుల
తరివెన్నముద్ద లందరికి పంచినవాడు
పెద్దపీటెక్కింది తెలుగమ్మా!
పేరు మారుమ్రోగింది మా అమ్మా! ॥ఆం॥

వీరేశలింగమ్ము విగతభర్తృకలకు
పసుపు కుంకుమ పంచ ప్రతిజ్ఞ చాటినవాడు
పెద్దపీటెక్కింది తెలుగమ్మా
పేరుమారుమ్రోగింది మాయమ్మా. ॥ఆం॥

ఆంధ్రకేసరి మహాహంకార దుర్వార
రిపులపెన్‌గుండ్లకు గుండె విప్పినవాడు
పెద్దపీటెక్కింది తెలుగమ్మా
పేరు మారుమ్రోగింది మాయమ్మా ॥ఆం॥

తెలుగు మాగాణమ్ము లల తెలంగాణమ్ము
లాంధ్రప్రదేశమై ఐక్యమందినవాడు!
పెద్దపీటెక్కింది తెలుగమ్మా
పేరు మారుమ్రోగింది మాయమ్మా ॥ఆం॥

(వికాసం అనే సంకలనంలోనిది. సం॥ప్ర తేదీ. 1976)

# తెలుఁగుతల్లి

కొర్నెపాటి శేషగిరిరావు

దక్షిణగంగ గోదావరీ తీరాన
　　రాజరాజగృహాంతరమునఁ బుట్టి
హరిహరావాసమై యలరారు నెల్లూర
　　నెర జాణ తనమున నిగ్గుదేఱి
కొండవీడ్పురమునఁ గొమరైన సర్వజ్ఞ
　　చక్రవర్తిత్వంబు సంగ్రహించి
విద్యాపురంబున విద్యలగడిదేఱి
　　గండపెండేరంబు గాలఁదొడిగి

ఓరుగంటిని సారస్యమొలకఁబోసి
తంజనగరిని తెయ్యని తాండవించి
మధుర మధురప్రభావంబు మధురఁ గాంచి
దివ్యతరమయ్యె సుకుమారి తెలుఁగుతల్లి.

ఓరుగంటిని ప్రతాపోగ్రత నటియించు
　　కాకతీరుద్రులఁ గన్నతల్లి
కొండవీటఁ బ్రతాప తాండవం బొనరించు
　　రెడ్డివీరులఁ గన్న తొడ్డతల్లి
పలనాట శౌర్యాగ్ని పరవళ్ళు ద్రొక్కిన
　　బాలచంద్రములను బడయుతల్లి
అబ్బురంబు రహింప బొబ్బిలి తీరంపు
　　బెబ్బులులం గన్న పెద్దతల్లి

రాజధాని విజయనగరంబు చేసి
మూరురాయరగండలై ముదముగూర్చు
వీరనరపతులను బ్రేమ వెలయఁగన్న
దివ్యమూర్తివి మాతల్లి తెలుఁగుతల్లి.

భద్రాద్రి రఘురాము పాదసేవఁదరించు
రామదాసుండు గారాపు బిడ్డ
కృతిరామునకు నిచ్చి కృతకృత్యుడైనట్టి
పోతన్న నీముద్దు పుత్రకుండు
రామ సంకీర్తనా రక్తిముక్తుండైన
త్యాగయ్య నీప్రియ తనయుఁడమ్మ
కాళహస్తీశ్వరు కరుణా విశేషంబు
కన్నకన్నప్ప నీకన్న కొడుకు
కాంచికాక్షేత్రమందు శంకరుని కరుణ
నవ్యయపదంబు గైకొన్న యసదృశుండు
వాఁడు చిరుతొండనంబి నీ పాపఁడమ్మ
తెలియ నీకెవ్వరీడమ్మ తెలుఁగు తల్లి!
ఘటనాఘటన శక్తిగల కవిపుంగవుల్
బ్రహ్మరథంబులు పట్టుప్రభులు
అఖిలార్థ వేదులైనట్టి సత్పండితు
లర్ధాసనము లచ్చునట్టి ప్రభులు
కంఠతక్కలు ప్రక్కలించు బుధాగ్రణుల్
స్వర్ణాభిషేకంబు సలుపు ప్రభులు
కల్పనా చాతురిగల కవిబ్రహ్మలు
రాజ్యంబులిచ్చిన రాజవరులు
తల్లి నీగర్భశుక్తి ముక్తామణులుగ
నుదయమంది ప్రకాశించి యున్నవారు
రాజరాజులు సత్కవిరాజమణులు
తెలియనీభాగ్యమల్పమే తెలుఁగుతల్లి.

('తెలుఁగు వెలుగు' అనే సంపుటి లోనిది. సం.ప్ర. తేది 1949)

## తెలుగుతల్లి

బి. రజనీకాంతరావు

పసిడి మెఱుంగుల తళతళలు
పసిమి వెలుంగుల మిలమిలలు
గౌతమి కృష్ణల గలగలలు
గుడి జేగంటల గణగణలు
మెఱసి మొఱసి మించిన శుభసమయము
తల్లీ! తరళ యశోవతి! అనుపమితతాగ
వల్లీ! నీవరసంతతి చేమోడ్పు లివే
తెలుఁగు తల్లీ!

కవి పికముల సల్లాపములు
గాయం బర్హ్యాలాపములు
లాస్యత్వగ విన్న్యాసములు
హాస్య తృటహ నినాదములు
విరిసి మ్రోసి పరచిన శుభసమయము
తల్లీ! సరళోక్తి మద రనవతీ! శోభావతీ!
నీవరసంతతి చేమోడ్పులివే! తెలుగుతల్లీ!

హాలిక జన కల హానము
శ్రామిక జన మృదు హాసము
దాస్య విముక్త నివాసములు
స్వతంత్ర ప్రజా వికాసములు

కలసి మెలసి చెలఁగిన శుభసమయము
తల్లీ! చరణార్పిత కోట త్రయ హృత్సుమము
నీ వరసంతతి చేమోడ్పు లివే తెలుఁగుతల్లీ!

('తెలుగుతల్లి' అనే సంకలనంలోనిది. నం.ప్ర. తేది 1976)

# మంగళం

బి. రజనీకాంతరావు

మంగళమమ్మ ఆంధ్రావనీ !
మహితస్వర్లోక గోరూపిణీ !
మంగళమమ్మ ఆంధ్రావనీ ! ॥మంగళ॥

గౌతమీ తుంగభద్రా కృష్ణవేణీ త
రంగ మధుర స్తన్య వాహినీ !
తిరుమల శ్రీ సింహాచల శైలశృంగిణీ
స్నిగ్ధరత్న విభూషితాంగినీ ॥మంగళ॥

విహరింపవమ్మ స్వేచ్ఛా విహంగగాథల
కటిగతస్వర్ణమేఖలవై
నికటవర్తి కోటిత్రయాత్మ శాశ్వత
విశృంఖలనుమాంజలివై విలోలనస్యావళీ
శ్యామలాంబవై విహరింపవమ్మ ॥మంగళ॥

మార్మోగనీ అనారతము నానాజాతి
జనసభాంగణములన్
పక్షిపండితవ్యత్సురావళిగళమ్ములన్
ధర్మసద్గుణములన్ మార్మోగనిమ్మా ! ॥మంగళ॥

నర్తింపనీ సగర్వమ్ముగా దేశదే
శాల సువిశాల కేతనములన్
నీదు కేతనములన్
మా గొప్పతనములన్ నర్తింపనిమ్మా ! ॥మంగళ॥

('తెలుగుతల్లి' అనే సంకలనం...)


A C. No. 65439

## ఆంధ్రుడు (అ)

శ్రీమద్భాగవతము

అంగవంగ కళింగాద్యాః సుహ్మపుండ్రాంధ్ర సంజ్ఞికాః
జజ్ఞిరే దీర్ఘతమసో బలేః క్షేత్రే మహీక్షితః॥
చక్రు స్స్వనామ్నా విషయాన్ షడిమాన్ ప్రాచ్యకాంశ్చతే —

(వ్యాసభాగవతంలోనిది)

## ఆంధ్రుడు (ఆ)

బమ్మెర పోతన

"తితిక్షునకు రుశద్రథుండును, రుశద్రథునకు హేము డును హేమునకు సుతపుండును, సుతపునకు బలియు పుట్టిరి, ఆ బలివలన అంగ, వంగ, సుంహ్మ, పుండ్రాంధ్రులను పేర్లుగల సార్వురు కుమారులు పుట్టిరి వారు పూర్వదేశంబునకు రాజులై దేశంబులకు తమ తమ నామధేయ బులిడి యేలిరి".

## ఆంధ్రులు

ఉద్యోతనుడు

"పియమహిళా సంగామే సు దరగత్తేయ భోయణీరొద్దే
అటుపుటురటుం భణంతే ఆంధ్రేకుమారో సలోయేతి"

"ఈ ప్రాకృతాన్ని శ్రీ పంద్యాల ఆదినారాయణ శాస్త్రిగారు ఇలా తెలుగు మాటలలోనికి తర్జుమా చేసినారు. "అందగత్తెలన్నా, అదవా యుద్ధ రంగమన్ననూ సమానంగా ప్రేమించే వాళ్ళున్నూ, అందమైన శరీరాలుగల వాళ్ళున్నూ, తిండిలో దిట్టలున్నూ, అయిన ఆంధ్రులు అటూ, పుటూ (పెట్టుకాబోలు) రటూ (రట్టుఏమో, అనుకొంటూ వస్తూండగా చూచాడు". అది ఉద్యోతనుని ప్రాకృతభాషలో రచింపబడిన కువలయమాల కథలోనిది. ఇతడు చెప్పిన సుగుణాలు నేటికిమనలో ఉన్నాయి.

రాయలేలిన సీమ
రతనాల సీమరా
దాయగట్టి పరులు
దార తీస్తుండారు
నోరెత్తి అడగరా దానోడా
వారసుడ వీవెరా, తెలుగోడా।

కల్లోల గౌతమీ
వెల్లువల కృష్ణమ్మ
తుంగ భద్రా తల్లి
పొంగి పారిన చాలు
ధాన్యరాసులై పండు దేశాన
కూడు గుడ్డకు కొదవ లేదోయ్.

పసిడి పాతరసీతి
పతుల నోరూరెనోయ్
సీతా సీతె పెట్టి
నెత్తి చే యెట్టారు
దేశాన్ని దిగమింగి పోయినారోయ్
మోసాన్ని గుర్తెరిగి కాపాడోయ్.

ఉత్తరాదీ మొదలు
దత్త మండల మంత
తెలగాణ ప్రాంతముతో
చెలిమి గలిగిందాలె
కలిసి మెలిసే నేడు పోవాలోయ్
కలిమి బలిమి గూర్చుకోవాలోయ్.

ఆరుకోట్ల తెలుగయోయ్
ఒక్కటై మనముంటె
యిరుగుపొరుగులోన
వూరు పేరుంటాది

తల్లి ఒక్కతె నీకు తెలుగోడా!
సవతి బిడ్డల పోరు మనకేలా.

పెనుగాలి వీచింది
అణగారి పోయింది
నట్ట నడి సంద్రాన
నావ నిలుచుండాది

చుక్కాని బట్టరా తెలుగోడా!
నావ దరి జేర్చరా మొనగాడా!

('తెలుగు తల్లి, అనే సంకలనంలోనిది. సం.ప్ర. తేది 1975)

# జై కొట్టు తెలుగోడా!

వేములపల్లి శ్రీకృష్ణ

చేయెత్తి జైకొట్టు తెలుగోడా
గతమెంతొ ఘనకీర్తి కలవాడా

సాటిలేని జాతి
ఓటమెరుగని కోట
నివురు గప్పి నేడు
నిదుర పోతుంటాది

జైకొట్టి మేల్కొలుపు తెలుగోడా!
గతమెంతొ ఘనకీర్తి కలవాడా!

వీర రక్తపు ధార
వారపోసిన సీమ
పలనాడు నీదెరా
వెలనాడు నీదెరా

బాలచంద్రుడు చూడ ఎవరోడోయ్
తాండ్ర పాపయ కూడ నీవోడూ.

నాయకీ నాగమ్మ
మల్లమాంబా మొల్ల
మగువ మాంచాల నీ
తోడ బుట్టిన వాళ్లె

వీర వనితల గన్న తల్లేరా
ధీర మాతల జన్మ భూమిరా

గతములో నీ కీర్తి
కథలల్లి చెప్పారు
వసయేద కాదావు
వునిలేక పోయెరా
బ్రదుకే బరువై యుండి ఏనాడు
కళపోరి సాధించు తాళి పేరూ,

నాగార్జునునికొండ
అమరావతీ స్తూప
రావాల పట్టలో
జీవకళ పొదిగారు

అల్పులను కానంచు తెల్పారు
శిల్పవంతిరి దేశదేశాలు.
రాజ్యమంటే వీర
భోజ్య మన్నాడు, మన
తిక్కనార్యునిమాట
ధీరులకు బాటరా

పూర్వ పౌరుష మెరిగి బ్రతకాలి
కార్యశూరులు నేడు కావాలోయ్.

దేశమంటే వట్టి
మట్టి కాదన్నాడు
మనుషు లన్నా మాట
మరువబోకన్నాడు.

అమర కవి గురజాడ నీవోయూ
ప్రజల కవితను పాడి చూపేవోయ్,

# ఆంధ్రి

రాయప్రోలు సుబ్బారావు

విఱిగి వచ్చిన ప్రాణవిభునకు పసుపిచ్చి
వేడి నీళ్ళను తోడె కోడలొకతె,
కత్తుల తిరునాళ్ళ గవయ వచ్చిన నాథు
గొంతు కచ్చు నుడిదోలె కూతురొకతె.
కుల కక్షల కృశించి కూలనున్న విశాల
రాజ్య చక్రము త్రిప్పె రాణియొర్తు,
కవికోకిల మృదూక్తి సవదరించెను తేనె
నుడికారమున ఆడుపడుచొకర్తు,

విమల సాహస సౌకుమార్యములు వెలయ
దిక్తటంబులందు చిత్రించినారు
తమ చరిత్ర విచిత్ర పత్రముల నాడు;
తలప వెట్టు లాజాతి చైతన్య మాంధ్రి!

గడ్డపారలు గోగు కాడల వలె ముళ్ళు
వేసినారట కొండవీటి రెడ్లు,
తెలి వెన్న రాసుల తీరున నల్లకొం
డలు చీల్చినారు పల్నాటి గండ్లు.
శివుడు గంగను బోలె చెరువు గండి ప్రవాహ
మాపినా రద్దంకి వాస మగలు,
వాటిదేసి శిలాకవాటముల్ ప్రద్దుట
గదిపినారట తెలంగాణ భటులు.

అట్టి బలభద్రు లీభూమి బుట్టినారు
విజయ కన్యక వీరగోరజము బూయ,
పులకతుపు చలిచీమలపట్టుపయెత్త
చూడవోయి ప్రాల్మాలికల్ విడి తంత్రి!

('తెలుగు తల్లి' అనే సంకలనంలోనిది. సం.ప్ర. తేది 1978)

# తెనుగు తల్లి

రాయప్రోలు సుబ్బారావు

శ్రీకాకుళస్వామి సిగపై సువాసించె
తెల్లని ఆంధ్రుల మల్లెపూలు,
ఒడ్డరాజుల జీవగడ్డ గ్రక్కదలంగ
కోరాడె మత్తాంధ్ర కుంజరములు,
చీకటిమన్నెముల్ ఛేదించి నవధాన్య
ముల నెత్తె ఆంధ్రున పోపుటెడ్లు,
చిలుకసరస్సుతో శృంగార నౌకల
నడిపె ఆంధ్రులయింటి పడుచుజతలు

ఉత్కలాళా నితంబమ్ము లొత్తి హత్తె
ఆంధ్రుల యశోదుకూల సితాంచలములు;
తమ్ముడా! మాయనిత్తువే తల్లివన్నె?
చెల్లెలా! చిన్నబుత్తువే తల్లిచిన్నె?

నాగార్జునాద్రి కందముల గండూషించె
పలుభాష్య బంధమై తెలుగుశిక్ష,
ప్రాకృతాశ్రమ వాటికాకులమ్ముల నాటె
తీయమామిడియంట్లు తెనుగుకవిత.
బౌద్ధధర్మరహస్యభావముల్ పరమతా
త్రిపిటకవృష్టి విడదీసె తెనుగుప్రతిభ,
కొండలోయలలోన కోమలలావణ్య
మలరార చిత్రించె తెనుగుకుంచె,

గంగతలనుండి కావేరి కాళ్ళదాక
వెలగె దిఙ్మోహనమ్ముగా తెలుగుదీవి
తమ్ముడా! మాయనిత్తువే తల్లివన్నె?
చెల్లెలా! చిన్నబుత్తువే తల్లిచిన్నె?

పంజాబునుండి కప్రపు మొక్కలను దెచ్చి
పెరటితోటలలోన పెంచినారు
పచ్చిజవ్వాజి గోవానుండి రప్పించి
దంతంపుజాడీల దాచినారు
కొండవీటిగులాబి గుత్తులఅత్తర్లు
కీలుతిత్తులలో బిగించినారు
అనలైన పారశీకాశ్వాల నలవార్చి
విజయయాత్రలసవారి వెడలినారు,

సొంగజీవిత కల్యాణ శాఖక్రింద
నిలిచి ఆనందదేవతన్ గొలిచినారు
తమ్ముడా! మాయనిత్తువే తల్లివన్నె?
చెల్లెలా! చిన్నబుత్తువే తల్లిచిన్నె?

మోటుపల్లితీరమున లంగరేసి ఓ
డలుసుంక మర్పింప నిలుచునాడు
రాయలసీమ రా రాయబార్లు వసించి
చిత్రచరిత్రల్ రచించునాడు,
పాకాలచెరువుచెంపల పండుధాన్యముల్
అన్యదేశాదీశు లడుగునాడు,
అద్దంకికోడెల నాబోతులకునయి
దూరాగతులు కొని త్రోలునాడు

ఖండఖండాంతరములన్ ప్రకాశమయ్యె
తెనుగుతల్లి లాలాటికాతిలకదీప్తి
తమ్ముడా! మాయనిత్తువే తల్లివన్నె?
చెల్లెలా! చిన్నబుత్తువే తల్లిచిన్నె?

నందనోద్యాన సౌందర్యమ్ము నెగబోయు
గోదావరిముఖాన కోనసీమ,
సువలనంపత్సస్య సురభియై మెరయు
కృష్ణారసశ్యామ గుంటూరుసీమ,
దవుని పోరి కదల్చి కవిని నేరిమి గెల్చి
పీరినణాణ నెల్లూరిసీమ,
ఆంధ్రదిగ్జయ పతాకాలంకృతమ్మైన
రతనాలయంగడి రాయలసీమ,

నేల నాలుగు చెరగుల నిగ్గుదేలె
రాణసూయాణమై తెలంగాణరేఖ
తమ్ముడా! మాయనిత్తువే తల్లివన్నె?
చెల్లెలా! చిన్నఋత్తువే తల్లిచిన్నె?

('తెలుగుతల్లి' అనే సంకలనంలోనిది. నం.ప్ర. తేది 1975)

# ప్రబోధము

రాయప్రోలు సుబ్బారావు

అమరావతీ పట్టణమున బౌద్ధులు విశ్వ
      విద్యాలయములు స్థాపించునాఁడు,
ఓరుగల్లున రాజ వీర లాంఛనముగాఁ
      బలు శస్త్రశాలలు నిలుపునాఁడు,
విద్యానగర రాజవీధులఁ గవితకు
      పెండ్లి పందిళ్ళు కప్పించునాఁడు,
పొట్నూరికి సమీపమున నాంధ్ర సామ్రాజ్య
      దిగ్జయ స్తంభ మెత్తించు నాఁడు,

ఆంధ్ర సంతతి కే మహితాభిమాన
దివ్య దీక్షా సుఖ స్ఫూర్తి తీవరించె
నా మహావేశ మర్థించి యాంధ్రులార!
చల్లుడాంధ్రలోకమున నక్షతలు నేఁడు!

('తెలుగుతల్లి' అనే సంకలనంలోనిది. సం ప్ర. తేది 1975)

# ఆంధ్రజాతి

విశ్వనాథ సత్యనారాయణ

భాగవతార్థమ్ము భారతార్థము జీవ
కోణమ్ములన్ కూర్చుకొన్న జాతి
మొనసి శిష్టాచారమునకు యావద్భార
తావనీ గురుపదంబైన జాతి
ప్రౌఢ విమర్శనా పద్ధతి సహజమై
యాత్మ జీర్ణించుకొన్నట్టి జాతి
సర్వావయవముల సవరణ తూచి చే
సిన యట్లు మానవుల్ మెరెడి జాతి

అట్టి మూరెడు పెరిగెడు నదియు లేదు
అట్టి బారెడు దిగజారు నదియు లేదు
స్వప్రమాణముగానైన జాతి తెలుఁగు
జాతి బ్రహ్మకు మిగుల నిష్టమగు జాతి.

ఒక్క తిమ్మరుసు నింకొక్క యుగంధరుఁ
డిట్టి మంత్రులు పుట్టరెచటఁ గాని
ఒక కృష్ణరాయలు నొక తెనాలి కవీంద్రుఁ
డిట్టి కవుల్ పుట్టరెచటఁ గాని
ఒక్క ధర్మప్పరా వొకవాసిరెడ్డియు
నిట్టి దాతలు పుట్టరెచటఁగాని
ఒక కూచిపూడియు నొక వీథినాటక
మిట్టి సంస్థలు పుట్ట వెచటఁగాని

రాజనీతియు క్లిష్టాక్షర ప్రలీన
ప్రౌఢగాన మర్మజ్ఞత ప్రభు వితరణ
భరతముని గుండెలో చొచ్చి పట్టుకొన్న
ఇట్టి రసభావములు లేవ యెచటఁగాని.

వేదముల్ సంస్కృత వాదముల్ చేసిన
తెలుఁగువాఁడే చేయవలయు ననఁగ
సంస్కృతచ్ఛందస్సు చక్కఁగా సాగింప
తెలుఁగులోనే సాగవలయు ననఁగ
ఋతువులపద్ధతి ఋజువుగా నుండఁగా
నొకతెల్గునాటనే యుండు ననఁగ
నిఖిలసస్యములు పండింపఁగా దగినట్టి
ధాత్రిలక్షణ మిందె తనరు ననఁగ

సర్వవేదాంతములకును జన్మభూమి
యాచిమనుజుఁడు తాల్చు దుస్తులకుఁ దగిన
దనుప్రమాణమ్ము చూపించి నట్టి నేల
తెలుఁగుధాత్రికి ధాత్రిలో దీటుఁగలదె?

జిహ్వకు తర్పాత్రి గూర్చు మామిడిపం
డ్లిన్ని రకములు పండ నెచట,
తొలిసారి లింగమై మొలచెను శివుఁ డిందె
అన్న శ్రీశైలమ్ము నఘరు నిచట,
శిల్పమ్ము నకు రసికులు గోపురాల్
గిరిమప శ్రేణులు వరలు నిచట
దండెత్తివచ్చిన దుంద్రగీంద్రను మున్ను
హద్దులో నిల్పినయట్టి దిచట

సర్వమైన జీవసంస్కారములకును
బీజభూత మైన వేల్పుబాస
బీజనాదులందు జీర్ణించుకొన్నట్టి
తెలుఁగుబాస యొక్క వెలుఁగె వెలుఁగు.

మరియు ఆఆ లోం నమశ్శివాయ యటంచు
ప్రారంభమును జేయు భద్రజాతి
వ్రాసినవగు నక్షరాలెల్ల శివలింగ
ప్రథమాకృతుల్ పేయు భక్తజాతి
ఇతరు లెరుంగని శతకాలలో విద్య
మొదలు పెట్టించెదు ముక్తజాతి
ఒక పాపమో దుఃఖమో సంఘటించిన
దైవస్మరణచేయు తద్జ్ఞజాతి

ఈయనంత మహాసృష్టి నెచటో పుట్టి
పుట్టుటయు చచ్చుటయు తప్పఁ బోవనపుడు
మొగి నిరంత మహాజ్ఞాన బుద్ధిబ్రతుకు
తెనుఁగువా రొక్కరే ధాత్రి మనుజులన్న।

బహుజన్మ కృతపుణ్య పరిపాకమునఁజేసి
ఆంధ్రుఁడై ధాత్రిలో నవతరించు
బహుజన్మ కృతపుణ్య పరిపాకమునఁజేసి
ఆంధ్రభాషను మాటలాడుచుండు
బహుజన్మ కృతపుణ్య పరిపాకమునఁజేసి
ఆంధ్రత్వ మన నిద్ది యని యెఱుంగు
బహుజన్మ కృతపుణ్య పరిపాకమునఁజేసి
ఆంధ్రీమహామూర్తి నైక్యమొందు

వట్టి నదమంతరపుసిరి పట్టినట్టి
జాసలం గని మది భ్రాంతి పడకుమోయి
ఆంధ్రుడా। యాంధ్రుఁ డనినంత నాత్మతత్త్వ
మఖిలము నెరుంగుటన్నది యని తెలియు

('తెలుగుతల్లి' అనే సంకలనంలోనిది. సం ప్ర. తేది. 1976)

# ఆంధ్ర పౌరుషము

విశ్వనాథసత్యనారాయణ

గోదావరీ పావనోదార వాఃపూర
మఖిలభారతము మాదన్ననాఁడు,
తుంగభద్రా సముత్తుంగ రావముతోడ
కవులగానము శ్రుతిఁ గలయు నాఁడు,
పెన్నానదీ సముత్పన్న కైరవదళ
శ్రేణిలో తెన్గు వాసించునాఁడు.
కృష్ణా తరంగ నిర్నిద్రగానము తోడ
శిల్పమ్ము తొలిపూజ సేయునాఁడు,

అక్షరజ్ఞాన మెఱుఁగదో యాంధ్రజాతి!
విమల కృష్ణానదీ సైకతములయందు
కోకిలపుఁబాట పిచ్చుకగూండ్లు కట్టి
నేర్చుకొన్నది పూర్ణిమా నిశలయందు.

('తెలుగుతల్లి' అనే సంకలనంలోనిది. ఆం.ప్ర.. తేది 1975)

# ప్రశస్తి

తుమ్మల సీతారామమూర్తి చౌదరి

తనకత్తి నీడలోఁ బెనిచె ధైర్యము నెప్పి
    దక్షిణక్షోణి హైందవమతమ్ము
తనబుద్ధిసాగరత్వము తేటతెల్లగా
    వేదభాష్యమ్ములు వెల్లడించె
తనతంత్రశక్తికిఁ దార్కాణగాఁ గాదు
    పాలకే కుచ్చుటోపీలు పెట్టె :
తనకళాలిప్స కర్ణమువోలె రాణింప
    గల్పించె భువనైక శిల్పవీధి

తనరసజ్ఞత కదినిదర్శనముగాఁగ
మోసెఁ గవిరాజుపల్లకి ముందుకొమ్ము
కొమ్ముదిరిగినవారలె కొలువు సేయు
దిక్కులొత్తిన మొనగాడు తెలుగువాడు.

కాకుళమందు ధాన్యకటకంబున హంపిని తంజపూరిలో
నేకశిలాపురిన్ మెఱయు దేమివిచిత్రము పాటలీపుర
శ్రీకబరీభరమ్మున విచిత్రసుమస్తబకంబు నిర్ఝరీ
లోక మనోహరంబయి తెలుంగుల చెక్కడము నాట్యమాడగన్.

ఒకనాడు శాక్యమౌనికి జయధ్వన లిచ్చి
    కరుణా సుధావృష్టి కురిపినాడు
ఒకనాడు శంకరార్యున కండయైనిల్చి
    జ్ఞానచంద్రిక వెదజల్లినాడు
ఒకనాడు రామానుజోపదేశము మెచ్చి
    భక్తిప్రపత్తులు పంచినాడు
ఒకనాడు మోహనోక్తికి నంజలిఘటించి
    కులగర్వములు వంగగొట్టినాడు

నేడు గాంధిమహర్షి వాణికి శిరంబు
వంచి నల్పెడు గాఢసేవావ్రతంబు
ఉత్తమోత్తమధర్మ మెందున్న దాని
కొలువు మరుగెడి వాడు మా తెల్గువాడు,

జలధులేడింటి కవ్వలి మిట్టపై నల్లు
కొనె రామవేంద్రుని గుణలతాళి
కర్ణాటనరపతిగ్రామ కర్షకజాతి
కింటి వేల్పయ్యె విశ్వేశ్వరుండు
అతివేల రాజకీయ జ్ఞాన దాతయై
చింతామణి జగత్ ప్రసిద్ధి వడసె
సింధురాష్ట్రప్రజాసేవ కోత్తంసమై
రాజించెఁ గోటమరాజకులుఁడు

నాగపూరు, ధర్మపరిషత్తునకు వినూత్న
రామణీయక మిడె మాధితాణ్ణియోగి
తారకావర్తి కుముదబాంధవుని యట్లు
వెలుగు నెచ్చోట నున్న మా తెలుగువాడు

పాలిచ్చి జోలఁ బాడు తల్లులు పుణ్య
వేదికల్ గలవు కృష్ణాదినదులు
క్షేత్రముల్ గలవిహాముత్ర భోగమ్ముల
కాధారములు తిర్మలాదికములు
కలవు బూదికి జీవముల నిచ్చు నోషధుల్
కృపసేయుగిరులు తూరుపు కనుమలు
తారాజాల కిరీట రంగమ్ము లెక్కి ని
క్కునవజ్రములఁ గన్నగనులు గలవు

కలదు నౌకాప్రయాణ సౌకర్యమునకుఁ
జాలినట్టిది గంభీరసాగరంబు
ఎల్ల సంపదలకుఁ బుట్టిని ల్లనంగఁ
దేజరిల్లెడి వాఁడు మా తెల్గువాఁడు.

అకలఙ్క శార్యమూర్తికి శివాజికి రాజ్య
తంత్రంబు నాంధ్రుఁడే దాన మిచ్చె
పేష్వాల యేల్బడి పెంచె మంత్రిత్వంబు
మోని పింగళివారి మోరావంతు
దైత్యుసకు శక్తిలోతు లన్నియు మప్పి
శూహిమ గూల్చెను బిల్వమంగళుండు
కర్ణాట కవితా వికాస నిర్మాతలై
ప్రథితి కెక్కి రి పూజ్యపాదముఖులు

కూర్చి హిందీ కవిత్వంబు క్రొత్త క్రొత్త
పాకములతోడ భట్టపద్మాకరుండు
పుక్కిటి పురాణములు గావు పూర్వచరిత
తలఁది కన్గొనుఁ డాంధ్ర సోదర్యులార!

ఆంధ్ర రాజ్య స్థాపనాదార్యుడై తెల్గు
వేలుపైనాఁ డాంధ్ర విష్ణువిభుఁడు
రణకళానిధి సుశర్మను జంపి మగధోర్వి
శాసించె శ్రీముఖ చక్రవర్తి
ఔత్తరాహుల నెల్ల నదలించె హాలుండు
శాలివాహన శకస్థాపకుండు
నిజ జయస్తంభముల్ నిఖిలదిక్కులఁ బాఁతె
గౌతమి పుత్రుండు శాతకర్ణి

క్షాత్రపుల గెల్చి మాళవధాత్రికెల్ల
నాథుఁ డయ్యెను వాసిష్ఠి నందనుండు
పాఁత వడినట్టి యాంధ్ర భూపతుల కథలు
చదువుఁ డోశసారి కండలు కదలియాడ,

భారతావని కొజ్జబంతుల పల్కు నా
హస్తంబబుషి నీడుపాలు గుడిచె
ఖండ ఖండాంతర ఖ్యాతుఁడౌ సిద్ధుఁడు
నాగార్జునుండు నీ నందనుండు
కైవల్య కల్యాణ ఘంటాపథము గన్న
యోగి వేమన్న నీ యొడిని గులికె
బొందితో నపవర్గ మందిన భక్తుండు
గోపన్న నీ ముద్దుఁగొడుకుఁగుఱ్ఱ

పారతంత్ర్య పిశాచంబు పైకొనంగ
నయనములు విప్పలేక యున్నావు గాని
సుతులు నీదార లతిలోకమతులు గారె
అఖిల సద్గుణ సముపేత! ఆంధ్రమాత!

తన విద్యచే లోకమున కొజ్జయైనట్టి
యన్నమభట్టు నాయన్న యనుచు
తన దానధారచే దెనుగుగడ్డను ముంచు
భాస్కరమంత్రి నాబంధు వనుచు
తన ప్రజ్ఞచే మన్ను మిన్ను గుప్పిటం బట్టు
ప్రగడ తిమ్మరసు నాతాత యనుచు
తన గీతిచే జగమ్మునకు జీవము పోయు
త్యాగయ్య నాదు సోదరుఁ డటంచు

విశ్వరంగమ్ముపై బొమ్మ విధిచి నిలిచి
లీలయై బల్కు హక్కు నాకే లభించె
ధన్యతాభాజనంబు గదా మదీయ
జీవితం బని సమ్మదశ్రీ వహింతు.

పసిడి ముద్దలు దోనపండ్లుగా సద్దల
        జడ్డ మాన్పిన వానిరెడ్డి విభుఁడు
పలుకు పలుకునఁ గావ్యకళలు పెంపెసలార
        సుకృతిఁ గూర్చిన నన్నెచోడనృపుడు
నిఖిల ప్రజకు సౌవనిషదపీయూషంబు
        కురియు వీరబ్రహ్మ గురువరుండు
అభినవ భోజరాజాఖ్యానముం జెందు
        దానంద గజపతిక్ష్మానియంత

భగవదవతారుఁ డాసూరి పావనాబ్ధి
జనుఁడు రామానుజాచార్యుఁ డనఘుఁ డన్య
ధీయుఁ డనఁ గంటి నిట్టి జాతీయ గరిమ
నాకుఁగా కెవ్వనికి దక్కు లోకమందు.

లాలిత్య లక్ష్మి విలాస రంగమ్ము ని
        ర్వృతి వజంతా చిత్రలేఖనమ్ము
నవరించితివి శైవ భువనంబు నెల్లొరా
        కొండను మైనంపుటుండఁ జేసి
విఠలప్రభుని కోవెల కంబములచేతఁ
        బలికింపఁ గంటి సప్తస్వరాలు
ఒలికించి తౌర! తిర్మలనాధు నగరులో
        వెలలేని సభ్యతా విలసనములు

భగవదన్వేషణార్థమై పాటుపడిన
యుత్తమ తపస్వివై కళాయోగివైన
నీకు ఋణపడి రసలుబ్ధలోకమెల్ల
నాంధ్ర శిల్పీ! చిరంజీవి వయ్య! నీవు.

కలము ఖడ్గము పట్టగల నేర్పు వడసిన
  రెడ్డినాగమ్మ నీబిడ్డ యటవె
జగమగంటిమి నాంధ్రజగతిఁ బాలించిన
  గరిత రుద్రమ్మ నీకన్నెయటవె
గండికోటను మల్కాదండుపై దూకిన
  గోవిందమాంబ నీకూతు రటవె
మానంబుకై నిజప్రాణంబు బలియిచ్చు
  మల్లాంబ నీదు కొమార్త యటవె

పీగి పచ్చిన హృదయేశు వెక్కిరించి
పోరి కంపిన దాన నీపుత్రి యటవె
ఎంతతేజస్వినివి తల్లి! యుక్తిలేక
నీ మహత్త్వంబు తెలిసికోలేము గాని.

('తెలుగు తల్లి' అనే సంకలనం లోనిది. సం.ప్ర. తేది 1976)

## నిజం

శ్రీశ్రీ

అంతమంది తెలుగువాళ్ళం
ఐకమత్యంగా ఉంటే
యావద్భారతంలోను రాణించగలం

('తెలుగుతల్లి' అనే సంకలనంలోనిది. సం.ప్ర. తేది 1975)

## తెలుగు పతాకం

దాశరధి

తెలుగుపతాకం యెగురని దిశయే లేదు
తెలుగుదివ్వె వెలుగనట్టి నిశయేలేదు

తెలుగు పులుగు చేరలేని దేశం లేదు
తెలుగు వెలుగు దూరలేని కోశం లేదు

వేయిస్తంభములగుడిని వెలయించిన చేతులు
వేయియేండ్ల మనగాథలు వినిపించే గీతలు

కాకతి రుద్రమను మరువగలుగు నెవరు? సోదరీ!
రాయల పౌరుషము మరువరాదెన్నడు సోదరా!

నాగార్జునాచార్య నవబోధనలలోన
నరుల నాగరికతయే నాట్యమాడేనులే.

నందికొండ శిల్పాలకు సతు లొనరించాలి
సుందరమగు రామప్పకు వందే అనాలి.

గోదావరి తీరంలో 'కో' అంటే చాలును
నాదేశం వైభవము నాదాలై వినవచ్చును.
కృష్ణానది తరంగాలు తృష్ణతీర్చు సుధాఝరులు
నాగార్జున సాగరాన నాట్యమాడు కురంగాలు.

తిరుపతి కొండకు పోయి తిరుమలేశు పూజిస్తే
పరమభాగవతుల కిహముపరము కరతలామలకము.
శ్రీశైలం మల్లన్నను సేవిస్తే చాలును
చింతలన్ని తొలగిపోయి జీవితమే విరబూయును.

నన్నయ పద్యమ్మొక్కటి నాల్కమీద ఉన్నచాలు
అన్ని విద్య లొకసారే ఆకళించినట్లౌను
తిక్కన పద్యమ్మొక్కటి చక్కగ చదివినచాలు
తెలుగుజాతి సుడికారము తెలిసికొన్న యట్లౌను.

పోతన పద్యమ్మొక్కటి ప్రీతిగ చదివినచాలును
అమృతమునే రుచిచూచిన ఆనందము కలుగును.
విశ్వదాభిరాముడైన వేమన ఆటవెలదిలో
విశ్వమెల్ల ఇమిడిపోయి వేదాంతం విరియును.

త్యాగరాజ కీర్తనలో తాదాత్మ్యం పొందితే
సంగీతం హృదయంలో జడివానై కురియును
కలకాలం మన ఐక్యత కాపాడాలి
తెలుగుజాతి గౌరవాన్ని నిలబెట్టాలి.

['తెలుగుతల్లి' అనే సంకలనంలోనిది ప్ర. తేది 1978]

## తెలుగుజాతి మనదీ

సి. నారాయణరెడ్డి

తెలుగుజాతి మనది-నిండుగ వెలుగుజాతి మనది
తెలంగాణా మనది-రాయలసీమ మనది
సర్కారు మనది-నెల్లూరు మనది
అన్నీ కలసిన తెలుగునాడు—మనదే-మనదే—మనదేరా ! ॥తెలుగు॥

ప్రాంతాలు వేరైనా—మన అంతరంగ మొకటేనన్నా
యాసలు వేరుగవున్నా-మనభాష తెలుగుభాషన్నా
వచ్చిందన్నా వచ్చాడన్నా-వరాలతెలుగు ఒకటేనన్నా ! ॥తెలుగు॥

మహాభారతం పుట్టింది రాజమహేంద్రవరంలో
భాగవతం వెలిసింది ఏకశిలానగరంలో
ఈ రెంటిలోన ఏదికాదన్నా-ఇన్నాళ్ళ సంస్కృతి నిండుసున్న ॥తెలుగు॥

పోచంపాడు ఎవరిది ? నాగార్జునసాగర మెవరిది ?
మూడుకోండ్రలూ కలిసిదున్నిన-ముక్కారుపంటలు బండ్లకెత్తిన
అన్నపూర్ణమ్మ కన్నబిడ్డలౌ అయిదుకోట్ల తెలుగువారిది. ॥తెలుగు॥

('తెలుగుతల్లి' అనే సంకలనంలోనిది. సం.ప్ర. తేది 1975)

# తెలుగుజాతి ఐక్యగీతి

సి. నారాయణరెడ్డి

తెలుగు దీప్తి సహస్ర కళలతో సాగినది
తెలుగుగీతి సమస్త దిశలందు మ్రోగినది.
గోదావరి నదీ స్వాదూర్మికల తోడ
కృష్ణవేణీ తరంగిణి గొంతు కలిపినది.
తుంగభద్రా జల తరంగ రంగముపైన
మంజీర గంభీర మధునాద మొలికినది
తెలుగు నదులన్ని చేతులు కలిపి ఆడినవి
తెలుగు నిధులన్ని గుండెలు పొంగిపాడినవి.
ఆ మూల ఈ మూల ఆ నేల ఈ నేల
అన్ని ఎల్లలుదాటి ఐక్యమై పోయినవి
ఇతిహాస మృతహాస మిగురెత్తి చూసినది
వర్తమానము భావివైపు చెయి సాచినది.
ఇది వేలయేళ్ళ కథ; ఇది నిత్య నవచరిత
ఆంధ్ర సంస్కృతి ఒడ్డులంటి పారిన సరిత
ఇది జిలుగు తెలుగు కోయిలల గానము సుమా
ఇది నిఖిల విశ్వాంధ్రహృదయబంధము సుమా.

('తెలుగుతల్లి' అనే సంకలనంలోనిది సం.ప్ర. తేది 1975)

## తెలుగుబిడ్డా!

త్రిపురనేని వేంకటేశ్వరరావు

దివ్య దీప్తుల-దిక్తటంబుల
క్రమ్మజేసిన-ఖ్యాతి గాంచిన
తెలుగు దేశపు సర్వశోభల
తెలియ జెప్పర తెలుగు బిడ్డా!

తెలుగు దేశపు పేరు పెంపుల
తెలుగు దేశపు వన్నె చిన్నెల
తెలుగు దేశపు - ఇంపు సొంపుల
తెలియ జెప్పర - తెలుగు బిడ్డా!

విశ్వ కళలను వెల్లివిరిసెడి
చిత్ర శోభల - జిమ్మవైచెడి
తెలుగు కలమును — తెలుగు హలమును
తెలియ జెప్పర — తెలుగు బిడ్డా!

తెలుగు వారల — తేట మాటల
తెలుగు వారల — తేనె పాటల
తెలుగు వారల — మధుర గీతల
తెలియ జెప్పర — తెలుగు బిడ్డా!

తెలుగు వారల వీరరసమును
తెలుగు వారల పౌరుషంబును
తెలుగు వారల శౌర్య రసమును
తెలియ జెప్పర — తెలుగు బిడ్డా!

ఛండతరమగు ఖండనంబుల
పగతు సేనల – పట్టి చీల్చిన
తెలుగు వీరుల – తెగువ తెంపులు
తెలియజెప్పర – తెలుగు బిడ్డా!

తెలుగు గడ్డను గాచి యుంచిన
తెలుగు వీరుల కత్తి వ్రేటుల

తెలుగు జోదుల ఈటె పోటుల
తెలియ జెప్పర తెలుగు బిడ్డా!
కదన భూమిని కత్తి దెబ్బల
అరుల వీరుల అరల గొట్టిన
తెలుగు వరుచుల దివ్య చరితము
తెలియ జెప్పర తెలుగు బిడ్డా!
తెలుగు ధాకను తెలుగు ధాటిని
తెలుగు ద్రఢిమను తెలుగు ఠీవిని
తెలుగు బలిమిని – తెలుగు కలిమిని
తెలియ జెప్పర – తెలుగు బిడ్డా!

('తెలుగుతల్లి' అనే సంకలనంలోనిది సం.ప్ర. తేది 1975)

## ప్రశస్తి : (ఆంధ్రజాతి)

శ్రీ కొవ్విడి వేంకటరత్నశర్మ

ఆదికాలము నుండి యవన, బాహ్లీక దాటి
నరికట్టెనీషురాజాంధ్రజాతి
పాలపాశము విచ్చి పాలించు బౌద్ధంబు
నన్యభూముల కన్పెనాంధ్రజాతి
తనశేముషీ దురంధరత సంరక్షించె
నార్య ధర్మముఁ దొల్లినాంధ్రజాతి
అర్వీటి, కాకతి, దోర్వీరసాళ్వ, తు
ళ్వాన్వయంబులఁగన్నదాంధ్రజాతి

భారతమ్మకు ముత్యాల పట్టుగొడుగు
ప్రళయనటరాజు ఆటనాడు నెలవెలుఁగు
సిద్ధనాగార్జునిం గన్న చిర విభూతి
అమృతసిద్ధిని గన్నదీ "ఆంధ్రజాతి".

('ఆంధ్రస్మృతి' అ సంకలనంలోనిది సం. ప్ర. తేది 1946)

# తెలుగోడా !

మురళీధర్

తెలుగోడివిర నువ్వు, తెలివి జాతిర నీది
తెలుసుకుని మసలుకోరా, తెలుగోడ
పేరుమరి నిలపెట్టరా !

నన్నయ్య అన్నయ్య కన్న బాసర నీది
తిక్కన్న వేమన్న తీర్చిదిద్దిన కోవ
పెద్దన్న పోతన్న అణిముత్తేలతో
మొల్లపలుకుల జిలుగు మోసులెత్తిన బాస

తెలుసుకొని మసలుకోరా, తెలుగోడ
పేరు మరి నిలబెట్టరా !

శాతవాహన ప్రతిభ చెరగ దిక ఏనాడు
కాకతీయుల ఘనత మ రుగువడదేనాడు
అలనాటి పలనాటి వీర గాథలు విని
బొబ్బిలి బెబ్బులిని త ంచుకుంటూ నువ్వు

ఎలుగెత్తి చాట లిరా, తెలుగోడ
పేరు మరి నిలబెట్టరా !

గతము నీ కీనాడు కనువిప్పు కావాలి
నివురు గప్పిన నిప్పు కణలనె రాల్చాలి
తెలుగువెలు గీనాడు దశదిశలు చిమ్మాలి
తెలుగు తత్వమె నేడు విజయాన్ని చాటాలి

కులతత్వమే చంపరా, తెలుగన్న
గురజాడ నీవాదరా !

దూరదూరాలలో తీరతీరాలలో
తెలుగుతమ్ముడు నేడు చేతులే కలపాలి
తెలుగోడు తెలివిగా ముందుకే సాగాలి
తెలుగునాడులా నేడు ఏకతే విరియాలి

తెలుసుకొని మనలుకోరా, తెలుగోడ
పేరు మరి నిలబెట్టరా.

('తెలుగుతల్లి' అనే సంకలనంలోనిది సం.ప్ర. తేది 1975)

## తెనుగు వారము

ఎ. రమేష్

తెనుగు తేజము తెలియవలెనోయ్
తెనుగు జోదుగ తీరవలెనోయ్
చెక్కు చెదరని పెక్కు సిరులకు
నిక్కమై తల నిక్క బెట్టుచు
దిక్కుదిక్కుల వెక్కసంబయి
క్రిక్కిరిసి పెంపెక్కు తొల్లిటి

తెనుగు తేజము తెలియవలెనోయ్
తెనుగు జోదుగ తీరవలెనోయ్ !

శాతవాహన సార్వభౌములు
సాటిలేని చాళుక్యరాజులు
కాకతీయులు ఘన ప్రకాశులు
దొడ్డగొనముల రెడ్డిరాజులు
విశదకీర్తుల వెలసినారోయ్

తెనుగు పౌరుడు
దిక్కుమాలిన దేబె కాదోయ్

తెనుగు తేజము తెలియవలెనోయ్
తెనుగు జోదుగ తిరవలెనోయ్ ।

అల యుగంధరు నధిక ప్రజ్ఞకు
మహితుడౌ తిమ్మరుసు నీతికి
మిన్నయగు బ్రహ్మన్న తెలివికి
ఆటపట్టయి అరితేరన
తెనుగు తేజము తెలియవలెనోయ్
తెనుగు జోదుగ తిరవలెనోయ్ ।

నన్నయార్యుని నన్నెచోడుని
తిక్కనాదుల దివ్యవాణుల
పోతనార్యుని భ క్తిరసముల
పెద్దనాదుల పేర్మిసొగసుల
కవిత పొంగుల వెల్లివింసిన

తెనుగు తేజము తెలియవలెనోయ్
తెనుగు జోదుగ తిరవలెనోయ్

('తెనుగుతల్లి' అనే సంకలనంలోనిది సం ప్ర. తేది 1975)

## తెలుగు వెలుగు

శంకర శ్రీరామారావు

మలయా. జావ, సుమత్ర, సింహళము సామ్రాజ్యాధిపత్యమ్మునన్
తులదూగన్ పరిపాలనంబు సలిపెన్ తోరంపు గర్వోన్నతిన్
తొలినా డాంధ్రుల శక్తిసాహసము; లోతుంబాతులన్ ద్రవ్వినన్
కలలై పోయిన తత్ప్రభావ గరిమల్ గన్పట్టు నీనాటికిన్.

('తెలుగుతల్లి' అనే సంకలనంలోనిది సం.ప్ర. తేది 1975)

# ఆంధ్రత్వం-ఆంధ్రభాష

అప్పయ దీక్షితులు

ఆంధ్రత్వ మాంధ్రభాషా చా
ప్యాంధ్రదేశ స్వజన్మభూః
తత్రాపి యాజుషీశాఖా
నాల్పస్య తపసఃఫలమ్.

('తెలుగుతల్లి' అనే సంకలనంలోనిది. సం.ప్ర. తేది 1975)

## దేశికవిత

నన్నెచోడకవి

మునుమార్గ కవిత లోకం
బున వెలయగ దేశి కవితఁ బుట్టించి తెనుం
గును నిల్పి రంధ్రవిషయం
బున జన చాళుక్యరాజు మొదలగు పలువుర్.

('తెలుగుతల్లి' అనే సంకలనంలోనిది. సం.ప్ర. తేది 1975)

## తెలుగు మాటలు

పాల్కురికి సోమనాథకవి

ఉరుతర గద్య పద్యోక్తుల కంటె – సరసమై పరగిన జానుదెనుంగు
చర్చింపగా సర్వసామాన్య మగుట – గూర్చెద ద్విపదలు గోర్కి దైవార
దెలుగు మాట లనంగ వలదు వేదముల – కొలదియకా జూడు డిల నెట్లనిన
బాటి తూమునకును బాటియౌనేని – బాటింప సోలయు బాటియుకాదె
అల్పాక్షరముల ననల్పార్థ రచన – కల్పించుటయ కాదె కవివివేకంబు.

('తెలుగుతల్లి' అనే సంకలనంలోని . సం.ప్ర. తేది 1975)

## తెలుగు కవిత్వము

తిక్కన సోమయాజి

తెలుగు కవిత్వము చెప్పం
దలచిన కవి యర్థమునకు దగి యుండెడు మా
టలు గొని పలుకం ద్రాసం
బులు నిలుపక యొగిని బిరిమి పుచ్చుట చదురే:

('తెలుగు తల్లి' అనే సంకలనంలోనిది. సం.ప్ర. తేది 1975)

## గానట భీనటల్

ఎఱ్ఱాప్రెగ్గడ

కానుర భారతార్థముల తంగులు నిక్క మెరుంగ నేరమిన్
గానట భీనటే చదివి గాతలు ద్రవ్వ తెనుంగువారికిన్
వ్యాసముని ప్రణీత పరమార్థము తెల్లగ జేసినట్టి య
జ్ఞానకల్పులం దలతు నార్యుల నన్నయ తిక్కనార్యులన్.

('తెలుగు తల్లి' అనే సంకలనంలోనిది సం.ప్ర. తేది 1975)

## దేశభాషలందు తెలుగు లెస్స

శ్రీనాథమహాకవి

జనని సంస్కృతంబు సకల భాషలకును
దేశభాషలందు తెలుగు లెస్స
జగతి తల్లికంటె సౌభాగ్యసంపద
మెచ్చు టాడుబిడ్డ మేలుగాదె?

('క్రీడాభిరామము'లోనిది)

## దేశభాషలందు తెలుగు లెస్స

శ్రీకృష్ణదేవరాయలు

తెలుఁ గదేల యన్న, దేశంబు దెలుఁ, గేను
దెలుఁగు వల్లభుండఁ, దెలుఁగొకండ,
యెల్ల నృపులు గొలువ నెఱుఁగవే బాసాడి
దేశభాషలందుఁ దెలుఁగు లెస్స.

('ఆముక్తమాల్యద'లోనిది)

## ఆంధ్రోక్తిమయ ప్రపంచము

రామరాజభూషణుఁడు

మహిమున్ వాగనుశాసనుండు సృజియింపం గుండలీంద్రుండు త
న్మహనీయ స్థితి మూలమై నిలువ శ్రీనాథుండు ప్రోవన్ మహా
మహులై సోముఁడు భాస్కరుండు వెలయింపన్ సొంపు వాటిల్లు నీ
బహుళాంధ్రోక్తి మయ ప్రపంచమున దత్ప్రాగల్భ్య మూహించెదన్.

('వసుచరిత్ర' లోనిది)

## నమోవాకమ్

రాయప్రోలు సుబ్బారావు

తెల్ల తామర పూలు దేవి సరస్వతికి
మల్లెపూవులదండ మా తెనుగు చిన్నమకు
వాల్మీకి శోకంబు పాదుకొనె శ్లోకమై
నన్నయ్య వాకిండ్ల నడిచె మా భారతము
కాళిదాసుని భణితి కళలు సమర్తాడె
తిక్కన్న పలుకుబడి తిరునాళ్ళ సాగింది
దండి చరణాల చిందాడె లాలిత్యంబు
శ్రీనాథు నడవళ్ళ చిందె శృంగారంబు
శూద్రకుని భావాల సుడిసె కోమలికములు
అలసాని వీణె బ్రహ్మానందము ధ్వనించె
హాలుపదాలలో తేలె ననురాగంబు
చేమకూర పొలాల చినికె కమ్మదనాలు

('మిశ్రమంజరి' లోనిది సం.ప్ర తేది 1963)

## తెనుగు మాస్యము

రాయప్రోలు సుబ్బారావు

వంశీగా వంచి, మృణాళముగ మెలిచి, పక్వద్రాక్ష నెండించి వా
గ్గంశల్ సుస్వర మాధురీ సురభిళ ప్రాణంబు జిల్కన్, దశ
త్రింశల్లక్ష జన ప్రసన్నరసనా దేవాలయాభ్యంతర
ప్రాంతు ప్రార్థనగీతమైన తెనుగుం బల్కుం బ్రశంసించెదన్,

నన్నయభట్టు భారతమునఁ జతియించెను సంస్కృతంబుతో
గొన్ని తెనుంగు లేరి తన కూర్పున కొప్పినయంత; కానియా
వన్నె బిడాంధ్రలోక ముఖభాషితమై, శ్రుతిసేవ్యమాఁజీ
వన్నవసీతమౌ తెనుగు పాలసముద్రము బుక్కిలించెనే'

ఊనిన ఆలమందిగతి, నింపులిగిర్చి పలించినట్టి యు
ద్యానము పోల్కి, సస్వరమ యాడెడి వేదికబోలు నీ తెలం
గాణమునం దనంత సుముఖస్వర జీవనమైన శబ్దసం
తానము నేలె, తిక్కన విధాత, తెనుంగుల జాతులేర్పడఁ.

సందికి వచ్చి, పంపకపుసంగతి సంతయు గట్టిపెట్టి, యా
యందుని వార్ధకంబె పరిహారము అన్నిటి కంచుజూపి శాం
తిం దరియించు టొప్పని ధ్వనించెడి పట్టులగూడ, వైఖరీ
గంధము మోసె తెన్గునుడికారమె తిక్కన సిద్ధవాక్కునఁ.

తలకొను రాణ్మహేంద్రవరతార్కికులఁ వడదిట్ట, సర్మనూ
క్తుల నునికొట్టుజాణల వెదుర్కొన. హర్షుని ప్రౌఢకన్యకుఁ
తనకు పసిండికంచ మురణంబిడగా, కవిరాజుపాలిటన్
మెలగదె కామధేనువయి నిండుతెలుం గఖిలార్థసాధనఁ.

భ్రమర పదంబులందు భగవత్ప్రకృతి ప్రణయానురాగ త
త్త్వమును సమన్వయించి, పసివచ్చిక మేయుచు తప్పిపోవు వ
త్సములకు కృష్ణగానమయిన దారులుచూపి, సుధాధునీతరం
గ మృదు మృదంగ భంగి కవికాంతుడు పోతన విన్చె తెన్గునఁ.

మొగ్గలు నవ్వి పువ్వులగు పోల్కి, ప్రబంధకవాటపంక్తులఁ
నిగ్గుతెనుంగుతోరణపు నిండుకళల్ వయసార, రంగులఁ
మ్రగ్గిన చిత్రసౌష్ఠవము, రాగములఁ రవళించుహాయియుఁ
బిగ్గగవుంగలింప దొకొ పెద్దన భవ్యశిరీష భారతిఁ.

త్రిభువనసుందరీకులకిరీటము సత్య తదీయ; గర్వ సౌ
రభము, బరాభవ జ్వరభరంబును, వాసెనకట్టుచీర, కో
పభవసవాసముఁ, దిటికి పానుపు, గృష్ణునిరాక దూస్తు వా
గభినయ లక్షణంబు లలరారవె తిమ్మన ముద్దు తెన్గులన్.

పొలమును సాగదున్ని, పసిమొక్కలునాటి. ఋతీపయస్సులఁ
మెలపుగ ద్రిప్పి పెంపు గమనించి, సుపర్వవిపాకమందు గో
సి, లలితపుం బరంజముల చిక్కసి పాలనుకాచి, శర్కరో
పలముల దీర్చె నీ తెనుగువాకిట సూరన కావ్యపుత్రికల్.

తంబుర తీవెలఁ దొణకుతానము- వల్లికి బల్లవించురా
గంబులు, పిల్లవేణువుముఖంబున గుల్కు సుఖస్వరాళి, యే
కంబయిన ట్లొయారి నడకఁ బహుళాభరణాళియాడి పా
దంబయ కాశి తెన్గురపలఁ జవకట్టదె భట్టుమూర్తియుఁ.

సరళపదాల భావమయసాహితి నేలిరి సత్కవీశ్వరుల్;
స్వరమయరాగ కీర్తనల స్థాయినుఖం బెలయించె నాద త
త్త్వరుచయి త్యాగరాజు; భగవత్కళ దిద్దిరి రంగురేకలఁ
నిరుపమ సిద్ధహస్తులగు నేర్పరిశిల్పు లజంత లోయలఁ.

పరిణత వాక్కు, లస్మదనవద్యకలాకవితాపితామహుల్
స్థిరముగ నిచ్చిరీ తెలుగు దీయని మాన్యము, నింటు నూత్నవ
ల్లరులను, క్రొత్తయంట్లను, పల్రద్రుమజాతుల నాటి పెంతు సం
బరమున, నే వనప్రియులు మంచెలపై నెలుగెత్తి పాడగాఁ.

అందరు నిర్వికారము నిరంజనమౌ పరత త్త్వరేఖ; ఆ
నంరమె నిర్గుణాన నగుణానను పావ్యము యౌట, మాతృమూ
ర్తిం దరిశింతు నీ ప్రకృతిదివ్యశుభావరణాన, తత్పయో
బిందువు లాను బిడ్డవలె వింతస్వతంత్రముతో నహర్నిశల్.

('అంధ్రావళి' అనే సంపుటిలోనిది సం.ప్ర. తేది 1944)

# తెనుగు భాషామతల్లి

సురవరం ప్రతాపరెడ్డి

పరిపూర్ణ పావనాంబ స్తరంగోద్వేగ
గౌతమీ గంభీర గమనమునకు
అలంపురీ నందనారామ పిక్రాజి
మల్లోల పలరాజ మధుర రుచికి
ఆంధ్రీకుమారీ సమాయుక్త పరిపూత
తుంగా పయస్సుమాధుర్యమునకు
ఖండ శర్కర, జాతి, ఖర్జూర గోక్షీర
ద్రాక్షాదియుత రామ రసమునకును

అమృత నిష్యంది వల్లకీహ్లాదమునకు
రాగిణీ దివ్య సమ్మోహ రాగమునకు
తేనెతేటల నవకంపు సోనలకును
సాటియగును మా తెనుగు భాషామతల్లి

('తెలుగు తల్లి' అనే సంకలనంలోనిది. సం.ప్ర. తేదీ 1975)

# గురుస్థానములు

విశ్వనాథ సత్యనారాయణ

ఋషివంటి నన్నయ రెండవ వాల్మీకి,
        తిక్కన శిల్పపుఁ దెనుఁగు తోట,
యెఱ్ఱాప్రెగ్గడ సర్వమార్గేద్భు విధాత్రుండు,
        పోతన్న తెలుఁగుల పుణ్యపేటి,
శ్రీనాథుఁడు రసప్రసిద్ధ ధారాధుని,
        కృష్ణరాయఁ డసస్య కృతి ప్రబంధ,
పెద్దన్న వడబోత పెట్టి నిక్షురసంబు,
        రామకృష్ణుఁడు సురారామగజము,

ఒకఁడు నాచన సోమన్న, యొక్కవుండు
చెఱిపి పదిసార్లు తిరుగ వ్రాసినను గాని
మొక్కవోని యీ కవిలోకమూర్ధమణుల
మద్గురుస్థానములుగ నమస్కరించి

('తెలుగు తల్లి' అనే సంకలనంలోనిది. నం.ప్ర. తేది 1976)

# ఆంధ్రవాణీ ప్రశస్తి

విశ్వనాథ సత్యనారాయణ

ఓంకారస్వర జన్యమై. ప్రథిత వేదోక్త స్వధర్మక్రియా
హుంకారాశయ ధన్యమై, సుకవితాహోమాగ్ని శబ్దార్థమా
మాంకూరోద్గత భావసౌరభముతోద్యచ్చిత్కళా మాన్యయై
శంకాపంకిల శూన్యమౌ తెనుఁగుబాసం గొల్తుఁ బత్తిరులన్.

శ్రీనీహారధరాధరాగ్ర ఘనితాద్రిస్వర్ణ సింహాసనా
సీనుం, డర్ధ సతీయుక్తై తమరుసం జెన్నారు సృష్ట్యాది యు
ద్యానంబుం బలె దుష్టశీకరమునై, తత్ప్రమోదప్రదం
బై, నిత్యాద్భుతమైన మా సురచిరార్యాంధ్రోక్తిఁగీర్తించెదన్.

నలుమోముం దెలిదమ్ములన్ సుమధురామ్నాయ స్వరస్వాదుమం
జుల మాధ్వీరసధారలం గురియు సుశ్లోక ప్రభావాఢ్య, ము
ద్దుల పట్టిన్ నిజనాభి పద్మగృహమందున్నిల్పి, సృష్టిస్థితుల్
దొలఁకం జేయుముకుందు మంత్ర మహిమోక్తుల్గల్గు మాతెల్గునన్.

గీర్వాణాంధ్ర మనోజ్ఞ శబ్దమయమై, గీర్మాతృవీణాక్వణా
పూర్వ శ్రావ్యలయ స్వరానుసయమై పూర్వార్ష, వేదాంత సూ
క్తోర్వీజాగమశాఖికాగత సుధర్మోదార గంధానిలా
ఖర్వోర్మీరమమై తెలుంగునుండి దిగ్దంతి శ్రవఃపేయమా.

మురళీమోహన రాగకల్పలతికామోద ప్రసూనాళితోఁ
గరుణాపూర్ణ కటాక్ష వీక్షణ కళాకల్యాణ గౌరీశ్వరీ
దరహాసద్యుతి చంద్రికావితతితోఁ దారుణ్య తారళ్యతన్
సరితూఁగంగల సుందరాంధ్ర కవితా సౌభాగ్య మగ్గించెదన్.

చిరదారిద్ర్య మహాంధకారపటలీచింతానిశాకష్ట ని
ష్ఠుర దుస్స్వప్న దురంతదాస్యదశ గట్టుల్ ద్రెంచి, స్వాతంత్ర్య భా
స్కర రమ్యోదయ సౌమ్యకాంతికళికా సంపన్మహానంద సుం
దరశోభాదశయై వెలుంగు తెలుఁగుంగావ్యంబు భావ్యంబిలన్.

చెంగల్వ, ల్తెలి దామర ల్పొగడలుం జేమంతులు, న్మొగ్గ సం
పెంగ, ల్మల్లెలు మొల్లలు, న్ననుగులాబీ, ల్పొన్న గన్నేరుగే
దంగుల్ వావిలి పన్నజాజి గురువెంద, ల్ముద్దక్రొంబంతి పూల్
సింగారించిన మేలిబొండ్లు గగుబాళించుం దెలుంగుం గృతుల్.

పొంగుల్వాఱు వసంత సాంధ్యపవనోర్మిల్వా(టుచుం గోర్కులు
ప్పొంగంగా నెదురీ(త యీది, వలపుంబూబోటి యిల్లెల్ల( గౌ
ల్లిం గొట్టంబని, తేనెపుప్పొడి సిరుల్గా( జేయుషట్పాది బు
ల్పంగీత స్వరమాధురిం జిలుకు మా శ్రవ్యాంధ్ర కావ్యశ్రుతుల్.

స్తుతి పాత్రప్రియ మిత్రశైతన్ బ్రతుకు పూదో(ట న్విహారించుచున్
ధృతి నిష్టార్థ ఫలావళి న్మెసవుచున్ శ్రీశారికాకీరదం
పతు లింపార నొనర్చు నుప్రణయ భావస్ఫూర్తి సంభాషణ
ప్రతతుల్ జ్ఞప్తికి వచ్చుచుండు మధుర త్రైలింగ భాషాకృతిన్.

మధువీధిన్ సహకారసౌధమణిసీమన్ మాధవీ మంటపం
బధిరోహించి, రసాలపల్లవ కషాయం బాని, రాగైక నే
వధియౌ కంఠ వివంచి( బంచమరుతిన్ వర్షించి, హర్షైక వా
ర్నిధిలో శాపళి( దేల్చుకోకిలగతిన్ బ్రీణించు నాంధ్రీకృతుల్.

విలసద్వేద పురాణపుణ్యచరితోర్వీ సాహితీజీవ ధా
రల నూరించుచు, నారికేళ కదళీద్రాక్షాఖ్యపాకత్రయా
కలనన్ గోఘృత శర్కరారుచిరభక్ష్యక్షీర శాల్యన్నముం
బలె సంతుష్టి ఘటించునట్టి తెనుగుంగబ్బంబు ప్రబ్బందగున్

మందార ప్రసవాచ్ఛగుచ్ఛ విగళన్మార్ద్వీక ధారాస్ఫుర
న్మందాకిన్యమరావగా తటసటన్మాయూరలాస్యాప్సరో
బృందాంఘ్రిక్రమరత్న నూపురఝణత్కీడాస్వన శ్రావ్యతా
సౌందర్యోక్తి విచిత్రి తాంధ్ర కవితా స్వారస్య మీస్వాద్య మౌ.

(ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక 1967_68 సంపుటము_56
ఆశ్వయుజ కార్తికములు)

# ఆంధ్రభాష

విశ్వనాథ సత్యనారాయణ

ఒక్క సంగీత మేదో పాడునట్లు భా
షించునప్డు విన్పించు భాష
విస్పష్టముగ నెల్ల విన్పించునట్లు స్ప
ష్టోచ్చారణంబున నొనరు భాష
రసభావముల సమర్పణ శక్తియందున
నమరభాషకును దీటైన భాష
జీవులలో నున్న చేవయంతయు చమ
త్కృతి పల్కులన్ సమర్పించు భాష

భాష లోకవది తెలిసిన ప్రభువు చూచి
భాష యన నిద్ది యని చెప్పఁబడిన భాష
తనర ఛందస్సులోని యందమ్ము నతక
తీర్చి చూపించినట్టిది తెలుగు భాష.

ఇటలీ మొదల్ చోట్ల కేగి రత్నమ్ములు
విలిపించినట్టిది తెలుగు భాష
ఒకనాడు సేతుశీతోర్వీనగాంత వీ
ధిని పడగెత్తిన తెనుఁగు భాష
త్యాగరాజ మహర్షి యాత్మలో రసభావ
ముల యైక్య మరసిన తెలుఁగు భాష
ఆసేతు శీతనగావధి నొకనాడు
తనకైత వ్రాయించె తెనుఁగు భాష

అఖిల పశ్చిమ రాజ్యభాషాళి యందు
తన తెలుఁగు మాటలను నిల్పుకొనెను తల్లి
ఖండ శర్కరలోపల కణుపుకొట్టి
కదగి యాబానలోన పీగదలు తేర్చి.

అంతగా నోటితో నందము గ్రాయుదు
మంతగా నం తంద మైన భాష
భాషించువారి యుచ్ఛ్వాస నిశ్వాసముల్
వెలయించి యాయువు పెంచు భాష
పలుమాటలయు నవ్వరిచేత జనముల
శీలమ్ము నవరించు మేలిభాష
చెట్టు యెంతగ పాడుచేయ నెంచిన నైన
నావంత మొక్కవో నట్టి భాష

అణువు మొదలు బ్రహ్మాండ పర్యంత మొప్పు
బ్రదుకు. భానయు నంతపర్యంత ముండు
అంత వ్యాపించి వెలిగెడునట్టి భాష
దివ్యమై దావు లేనిది తెలుఁగుభాష.

పలుకులన్నియు పరమతత్వార్థ బో
ధకములై యొప్పు నందాలభాస
అదారములు సర్వ మర్థవంతమ్ము లై
ఆత్మతీర్చెడి గూఢ మైనభాష
లోకోక్తులన్నియు లోనంటుకట్టిన
పనఁబరుల్ నేర్చుకో నైనభాస
కృష్ణానదీ పినాకినులు గోదావరి
నీళ్ళకమ్మదనమ్ము నిలుచుభాస

రామచంద్రుఁడు వచ్చి యరణ్యవాస
మాచరింపఁగఁ గోరిన యట్టినేల
ఆతనివ్రతదీక్ష దుఃఖమ్ము నాచికొనిన
కొలతయను గాలిలో నూసికొనిన భాష.

వృత్తులు పాకముల్ రీతులు శైలులు
లావణ్య మొప్పెడు లలితభాష
ఎద్ది సంభవమౌనొ అద్ది సంధానించి
ఉచితత్వమున్ గూర్చ నొడుగుభాష
ఎన్ని యొయ్యారంబులేని పోవఁగఁజేసి
నడిపింపఁగలయట్టి గడుసుభాష
పాలించి దక్షిణాపథమెల్ల నొకనాడు
ప్రభుత నిరూపించు రాజభాష

అల్లభాషయొక్క సధికత్వమంతయు
శక్తి నెరపఁగలుగు జనులమీఁద
అన్ని కాలములను నాధారపడియుండు
తెలుఁగుభాషయన్న దివ్యభాష.

('తెలుగుతల్లి' అనే సంకలనంలోనిది సం.ప్ర. తేది 1975)

## ఆంధ్ర తేజస్సు

బిరుదు వేంకటశేషయ్య

సరసాంధ్రావనిఁ బుట్టుచుం గనుట, ద్రాక్షామాధురీ ధుర్యమై
పరి యాంధ్రోక్తిని బల్కరించుకొను, టొక్కండొక్కఁడే పుణ్య ని
ర్భరతం గాక లభింప వంద్రెపుడు.; బెల్చన్ రెండు నాసొమ్ముగా
న్మరి నే నెట్టి తపమ్ము చేసితినొ సామాన్యంబె వర్ణింపఁగన్ ?

కృష్ణాది నదులెల్ల క్షీరముల్ పాఱింప
స్వర్ణంబు పండు దేశంబు మనది,
అరియోధములకు సింహస్వప్నమయి, వరా
జయ మెఱుంగని వీరజాతి మనది,
కన్నెకిన్నెర జతఁగల్పి భారతి పాడు
పాటలో రాగిల్లు భాష మనది,
నునువెన్న యొకచెంప, పెనువజ్ర మొకచెంప,
బాంధవ్య మగు స్వభావంబు మనది,

ఎన్నియో జన్మములపాటు, నెంతతపము
సలిపిగాని ధరిత్రి నెచ్చుముగ నాంధ్రుఁ
డయి జనింపఁడు, మానవుఁ డయినవాఁడు
ఈరహస్యము మఱవరానిది, తలంప.

ఒకనాఁడు గౌతమీ ప్రకటోర్మిసంఫుల్ల
ఫేనదీధితులతోఁ బేరటించి,
ఒకనాఁడు కాకతీయుల భుజాకౌక్షేయ
కాగ్రజాగ్ర త్ప్రతాపాగ్ని నుమిసి;
ఒకనాఁడు కృష్ణరాయుని యశఃకుసుమైక
సుషమానుభావముల్ చూఱలాడి
ఒకనాఁడు తంజాపురోల్లాసలక్ష్మితో
లీలమైఁ జెట్టి పట్టాలు నెరపి,

ఆంధ్రతేజస్సు దిక్కుల కగ్గలమయి
మింటఁబెట్టిన దీపమై మెఱసిపోయె.
అమ్మహాజ్యోతి నా హృదయమ్మునందు
ప్రజ్వరిలుగాక మఱల శుంభత్ప్రదీప్తి।

('తెలుగుతల్లి' అనే సంకలనంలోనిది. సం.న.ప్ర. తేది 1975)

# మాతృభాష

తుమ్మల సీతారామమూర్తి చౌదరి

కమ్మని తెల్గుటంచు నుడికారము సొంపుల నీ విశాల వి
శ్వమ్మున దీనిఁబోలిన వచస్సు నభస్సుమమంచు వేయి వా
క్యమ్ముల నేను మెచ్చుటయ కాదు రసజ్ఞులు దారులెల్ల ఖం
డమ్ముల మెచ్చిరిచ్చిరి వినమ్రతమైఁ గవురంపుటారతుల్.

ఇద్దరు తెల్గువాండ్రు తమయింటివి కష్టసుఖాలు చెప్పుకో
నద్దిర మాతృభాష తగదా మరి యింకొక పెద్దరోగమే
కద్దు వచింతు నాంగ్లము మొగంబు నెఱుంగని శ్రోతముందు దు
ర్బుద్ధులు కూయుచుండ్రు పలుపోకల నెంగిలిపీసుకూతలన్.

ఎన్నఁడుఁ దల్లిభాష వచియింపని వారికి నందుఁగబ్బముల్
పన్నితమున్నచో ముదుగు పల్కులు గాక మరొండుతోఁచునా
నన్నయ తిక్కనాది కవినాథుల పోఁడుమ లంతుపట్టునా
చిన్నయసూరి లక్షణ మిసీ యనిపించక సొంపునింపునా?

పరరాజ్యంబుల నాక్రమించి కదమిన్ పాలించి యచ్చోటనే
స్థిరమైపోయిరి కోటిమంది తెలుగుల్ దేశాలు పెక్కింటిలో
మఱువం జొచ్చిరి నేఁడు తల్లినుడి తీమార్పాటు లజ్జాకరం
బరరే! పైనము గట్టుఁడంటు రమణీయాంధ్రత్వము న్నాటఁగన్.

నీతీరు తీయముల్ నిగ్గుజగ్గులు సూచి
బ్రౌను బ్రహ్మరథంబు పట్టె నీకు
నీరీతి నీ హొయల్ నీబెడంగులు మెచ్చి
యిబ్రహీం తానుక లిచ్చె నీకు

నీసొంపు నీపెంపు నీ యొయార మెఱింగి
 శాహజీ పరిచర్య సలిపె నీకు
నీతేట నీపాట నీనీటు దిలకించి
 యఱవలెల్లరు దాసులైరి నీకు.

ముజ్జగంబుల నినుఁబోలు ముద్దుగుమ్మ
రసికతావేత్తలకుఁ గానరాదురాదు
ఏపురాపుణ్యలేశమో యిటకుఁదెచ్చి
యర్పకునిఁజేసె నీకు నన్నాంధ్రవాణి।

('రాష్ట్రగానం' లోనిది సం.ప్ర. తేది 1939)

# వీరగంధము

త్రిపురనేని రామస్వామి చౌదరి

వీరగంధముఁ దెచ్చినారము
వీరుఁడెవ్వఁడొ తెల్పుఁడీ ।
పూసిపోదుము మెడనువైతుము
పూలదండలు భక్తితో ।

తెలుఁగు బావుట కన్నుచెదరఁగ
కొండవీఁటను నెగిరినప్పుడు
తెలుఁగు వారల కత్తిదెబ్బలు
గండికోటను కాచినప్పుడు

తెలుఁగు వారల వేఁడినెత్తురు
తుంగభద్రను గలిసినప్పుడు
దూరమందున నున్న సహ్యజ
కత్తినెత్తురు కడిగినప్పుడు

ఇట్టి సందియ మెన్నఁడేనియుఁ
బుట్టలేదు రవంతయున్:
ఇట్టి ప్రశ్నల నడుగువారలు
లేకపోయిరి సుంతయున్.

నడుముగట్టిన తెలుఁగు బాలుఁడు
వెనుక తిరుగండెన్నఁడున్.
బాసయిచ్చిన తెలుఁగు బాలుఁడు
పారిపోవం డెన్నఁడున్

ఓరుగంటిని దండువిడిసిన
దేవగిరి యాదవనృపాలుని
ఓరగంటను గాంచియప్పుడె
దేవగిరి దర్వాజ వఱకున్.

తఱిమి తోల్కొని పోవఁబోవఁగ
పూరిమేయఁగ, నభయమిచ్చిన
తెలుఁగుదొరసానైన రుద్రమ
దేవికీర్తిని లోకమెఱుఁగదె.

తెలుఁగు వారల యాఁడుబిడ్డల
తెగువ బిగువులు తెలుసుకొనుమా!

వీరరసమే వెల్లివిరియఁగ
వెనుక తగ్గని పల్లెనాఁటన్
కాలిబంటుల కాలక్రిందను
నలిగిపోయిన దండుబాటల్

అరులమూఁకను జెఱలఁబెట్టిన
అరిదియగు మాచెఱలకోటన్
పేరుగ్రుచ్చియుఁ బిలిచి యడుగుము
తెలియవచ్చును తెలుఁగు వ్రేటున్.

ప్రాతకతలన్ బాదకుండిన!
దెలుఁగుబిడ్డా: పరువు దక్కునె?
ఢిల్లీ సురతాన్ పౌజుదారులు
ముట్టడింపఁగ మూడుమాఱులు
తురకకత్తులు దాఁకినంతనె

చుంయి చుంయిన గంటునెత్తురు
పొంగి పొరలఁగ పోరుగంటను
ద్రోలివేయవె ఢిల్లిదాఁకను
తెలుఁగు కత్తులు తురకబిడ్డలఁ
దెంపుపెంపున నెల్లదాఁటఁగ

పెద్దవారలఁ బిలిచి యడుగుము
తెలియఁబఱుతురు తెలుఁగుదాక

రెడ్డి దొరలును కమ్మదొరలును
వెలమదొరలును కాపుదొరలును
రాచదొరలును; మొక్కవోవని
పౌరుషంబులఁ బోరు నలిపియు

గౌతమీనది కృష్ణవేణిని
తుంగభద్రను సహ్యజానది
నెత్తురొలికిరి, కాలవశమున
గత్తి గడిగిరి, మూలఁబెట్టిరి.

ఇంతమాత్రనె మఱచి పోకుము
తాతతండ్రుల వన్నె చిన్నెలు।

మఱచిపోకుము మఱచిపోకుము
మన్నెదొరలను తెల్గునాఁటను
మఱవకుండఁగ మూఁడు ప్రొద్దులఁ
బాడుచుండుము వారి పాటను

తేటమాటలఁ దెలియఁ జెప్పుము
దిక్కులన్నియు మాఱుమ్రోగిన
తెలుఁగు వారల పేరుపెంపును
దెలియకుండఁగ నుండఁబోకుము



తెలుఁగు బాలుఁడ యింపునింపుము
తెలుఁగు బాలుఁడ పేరుపెంపుము !!

["శతకాలు, గీతాలు" (సూత్రాశమగీతాలు) అనే సంపుటిలోనిది
సం.ప్ర. తేది 1977]

# తెలుఁగు జోదులు

త్రిపురనేని రామస్వామి చౌదరి

గౌతమీనది కృష్ణవేణియు
తుంగభద్రయు సర్వదా
జీవనదులై యెండిపోవక
యెల్ల కాలము పాఱుచున్

బీళ్ళనన్నిటిఁ బంటపొలములు
పండ్ల తోఁటలు చేయుచున్
దెల్గుదేశం బతి సుభిక్షము
గా నొనర్చును సర్వదా

తెలుఁగు బిడ్డా! మఱచిపోకుర
తెలుఁగు దేశము పుట్టిన గడ్డర
కొక్కొరొకో పాటఁ బాడర
తెలుఁగువారల మేలుకొల్పర॥

రెండుకోట్లకు మించి యుండిన
తెల్గువారల నక్కటా
చీల్చివైచిరి, నాల్గుదెసలకుఁ
జిమ్మివైచిరి నేఁటికిన్.

కొంతమంది నిజాము రాష్ట్రము
నందుఁ జిక్కిరి వేలలై
కొంతమందియు కన్నడంబున
నుండిపోయిరి దీనులై.

తెలుఁగు బిడ్డా! మఱచిపోకుర
తెలుఁగుదేశము పురిటి గడ్డర
కొక్కొరోకో పాటఁ బాడర
తెలుఁగువారల మేలుకొల్పర!!

పూర్వమెప్పుడొ యెదురులేకయె
ద్రవిడదేశము మీఁదికిన్
జైత్రయాత్రలు సల్పియుండిరి
తెల్గు బంటులు జోదులై

తెలుగుదేశం బాక్రమించిరి
యఱవ వారలు నేదికిన్
మెల్లమెల్లఁగఁ బ్రాకులాడుచు
దిద్ది కంతల దూఱుచున్

తెలుఁగు బిడ్డా! మఱచిపోకుర
తెలుఁగు దేశము పురిటిగడ్డర
కొక్కొరోకో పాటఁ బాడర
తెలుఁగువారల మేలు కొల్పర!!

లెమ్ము లెమ్మిఁక నడుము గట్టుము
తెల్గువారలనెల్ల నీ
వొక్క రాష్ట్రమునందుఁ గూర్పఁగ
గట్టి యత్నముఁ జేయుమా!

అన్యులెవ్వరు నడ్డఁబోలరు
నీ మనోరథ సిద్ధినిన్
బడయ నేర్చెద వచిరకాలము
నందె పేరు ప్రతిష్ఠతో

తెలుఁగు బిడ్డా! మఱచిపోకుర
తెలుఁగు దేశము పుట్టిటి గద్దర
కొక్కొరోకో పాటఁ బాదర
తెలుఁగు వారల మేలు కొల్పర!

ఒడ్డె బందెలదొడ్డిఁ ద్రోలిరి
తెల్గువారలఁ గొందఱన్
మిగిలియుండిన వారినెల్లర
నఱవ వారల కాళ్ళపై

గూలఁ ద్రోసిరి, కేరడంబులు
కుచ్ఛితంబులు పల్కుచున్
మఱువరాని పరాభవంబును
గల్గఁ జేసిరి. యెల్లరున్.

తెలుఁగు బిడ్డా! మఱచిపోకుర
తెలుఁగు దేశము పుట్టిటి గద్దర
కొక్కొరోకో పాటఁ బాదర
తెలుఁగు వారల మేలు కొల్పర!!

తెల్గువారల పేరు మాసెను
తెల్గునాఁటను నేఁటితోఁ
తెల్గువారలకెల్ల నుమ్మడి
దేశమొక్కటి లేదహో!

తెల్గువారల ఢాకయెఱిఁగియె
కుచ్ఛితంబుగ నీగతిన్
బిదిమిపైచిరి, యదిమి పెట్టిరి
వాల్గుదెసలకు నెట్టుచున్

తెలుఁగు బిడ్డా! మఱచిపోకుర
తెలుఁగు దేశము పురిటిగడ్డర
కొక్కొరోకో పాటఁ బాడర
తెలుఁగువారల మేలు కొల్పర॥

('శతకాలు గీతాలు', సూత్రాశ్రమ గీతాలు) అనే సంపుటిలోనిది.
సం ప్ర. తేది 1977)

# ఆంధ్రభాష

పైడిపాటి సుబ్బరామశాస్త్రి

అరయ యయాతినుండి పదియాఱవ వంశమువాఁడు నాంధ్రుఁడన్
నరపతి, యాతఁ డేలుటను నామము గల్గెను నాంధ్రమంచు నీ
ధరణికి, శాతవాహను లుదాత్తచరిత్రులు కృష్ణరాయలున్
నరపతు లెందరో తగననాథమొనర్చిరి యాంధ్రదేశమున్.

పరరాజ్యములపాదు పరపర తెగగోసి
యాంధ్రులు స్వాతంత్ర్య హస్తులైరి;
ముక్క చెక్కలనేల నొక్కచోఁ జేరిచి
యాంధ్రప్రదేశ రాజ్యమ్ముఁ గొనిరి;
ఆంధ్ర వాగ్దేవిఁ బట్టాభిషేక మొనర్పఁ
బరిషత్తు గద్దె లేర్పఱచుకొనిరి;
విశ్వాంధ్రమున నొక్క వేదికన్ సమకూర్చి
విశ్వవిఖ్యాతిఁ గల్పించుకొనిరి;

భాషయన పూర్వ జన్మ తపఃఫలమ్ము
అస్మదీయమ్ము నౌ మహదాంధ్ర భాష
ననుదినమ్మును కీర్తింపు డాంధ్రవాణి
పంచశతలక్షప్రజలార! బంధులార!

('తెలుగుతల్లి' అనే సంకలనంలోనిది. నం.ప్ర తేది 1975)

# తెనుగు దేశమా

పైడిపాటి సుబ్బరామశాస్త్రి

తెనుగుదేశమా, నా
అనుగుదేశమా!
ఘనుగు ఆర్యాది తావి
తెనుగు దేశమా

వనరులన్ని
ఒనరినట్టి
ఘనతరప్రవ
దేశమా

అన్నిట ముం
దంజ వేయు
ఆంధ్ర ప్ర
దేశమా

పీఠలు నిన
దించు త్యాగ
రాజకృతి
రాజగీతి

నదులె తరం
గించు తీర్థ
నారాయణ
మధురగీతి

మువ్వల గో
ఫాలుడు

మువ్వ గో
పాలుడు।

సరసుడై
సతులలో
పరిమళించు
దేశమా,

గోచిపెట్టిన
దాడి
కూచిపూడి
సిద్ధేంద్రుడు

తద్ధిమికిట
కిటయందును
తాండవించు
దేశమా।

పున్నమ వెలు
గుల వాకల
అన్నమా
చార్యుడు।

వేంకటేశ
చరణగీతి
వినిపించెడి
దేశమా।

శ్యామశాస్త్రి
సవరించిన
స్వాదుగీతి
పులకించే:

అధ్యాత్మము
కీర్తనమ్ము
లాలపించు
దేశమా!

బ్రదుకే ఒక
పాటగా
పరమమైన
బాటగా

పాట బాట
పరువుల్లో
పయనించే
దేశమా!

గ్రామ గ్రామ
ముందు వెలుగు
రామ మంది
రములలో:

రామదాస
కీర్తనా
లాప మధుర
దేశమా!

తెనుగు దేశ
మా నా
అనుగు దేశ
మా!

('మధుర సంక్రాంతి' అనే సంపుటంలోనిది సంప్రప్ర తేది 1959)

## ఆంధ్రమాత

ఆత్మకూరి గోవిందాచార్య

జాతికి భాష జీవము; యశస్కరులై సుకవీంద్రు లెందరో
ఖ్యాతిగడించినారు మన యాంధ్రికి తెన్గును తీర్చి దిద్ది యెం
తో తమి వారు నీ కిడిన త్రోవఁ జరించి, కవిత్రయమ్ము నం
ప్రీతి స్మరించుచున్ సతము వీడకుమీ మన ఆంధ్రసంస్కృతిన్.

('తెలుగు తల్లి' అనే సంకలనంలోనిది. నం.ప్ర. తేది 1976)

# తెనుఁగుతల్లి

పూతలపట్టు శ్రీరాములురెడ్డి

అక్షరము శబ్దమయమునై యక్షరు రూప
నర్వ దేవతలకు మూల శక్తివగుదు
శ్రేష్ఠ విజ్ఞాన గరిమ కుక్షేత్రభూమి
తేనె సోనలఁ గురియించు తెనుఁగు తల్లి.

కోమల పదములు గురువాక్యమత్కృతి ;
సురుచిరధ్వని యలంకరణ సహిత
లక్షణ లక్షిత లలితావయవములు
వినుత గుణంబులు విమల వృత్తు
లమలరీతులు మనోహర వృత్త చరితమ్ము
లర్థమొసఁగు హర్వ్యు లమరుపలుకు
విశద విజ్ఞానంబు విశ్వ కల్యాణంబు
గలిగింపనెంచు చొక్కపు మనంబు

మహిని ప్రాణికోటులనుండి మనుజ తతిని
వేఱుపఱచి మేల్మి నొసఁగు పెద్దబుద్ధి
యలరి యన్వయరూపిణివైన నిన్ను
మించువేలుపు జగముల నెంచఁగలదె?

కామితార్థముల్ నీ దయఁ గలుగుచుండు
నీ కరుణఁ బురుషార్థముల్ నెగడుచుండు
నీవు కరుణింప దొరకని దేది గలదు?
తరమ నీదయఁ బొగడ ముత్యాల సరము!

నలువురు తోఁబుట్టువులు చతుర్భుజముల
యనువున నెల్లప్పు డనుసరింపఁ
దక్కువారలు ఐదు తతులయి మేల్బావ
శ్రుతులు స్మృతులు పురోహితులుగాఁగ
కావ్యముల్ మిత్రవర్గముగాఁగ శాస్త్ర ప్ర
బంధముల్ సైనిక పతులుగాఁగ
దండక శతకాది దళములు కొలువఁ బు
రాణ మంత్రులు కార్యరాజి నడప

కవి కుమారులు వంది మాగధులు గాఁగ
సరస సంగీత సాహిత్య చర్చ నడప
మహిత విద్యానగరమందు విహితరీతి
చిత్ర సింహాసనమున వసింతువమ్మ!

దక్షిణాపదమను దైవాలయమ్మున
విశద భారత హేమ పీఠమందు
నన్నెచోడాదులు నయహారతుల నెత్త
వేమన సద్విదుల్ విస్తరింప
కృష్ణరాయాదుల కెలన నిల్చి భజింప
రామభూషణుఁడు నీరాజనఁ బెంప
ముద్దుపళని పదములు పాడి నటియింప
గ్రామ్యులు కరదీపికలు ధరింప

బాలకవులు సేవలు సేయఁ బరిఢవిల్లి
కామిత జ్ఞాన మొసఁగుచుఁ గన్నతల్లి
తీరునను మమ్ము గాతువు తెనుఁగు తల్లి!
సరసగుణ కల్పవల్లి! భాషామతల్లి!

('తెనుఁగు సందేశము' అనే సంపుటి లోనిది)

# తెలుగుబాస

నండూరి రామకృష్ణమాచార్య

గోదావరికి కల్కికుల్కుల నాట్య వి
న్యాసములను నేర్పె నన్నయ కవి
గరుపదనమ్ము వాల్గనుల అంచుల నింప
తెనుగు వాణికి నేర్పె తిక్కన కవి
మందార మకరంద మాధుర్యములు తేలు
పొలములు పండించె పోతన కవి
స్వర్గలోకమునుండి పారిజాతము దింపి
తెలుగు సాహితి నాటె తిమ్మన కవి

మువ్వగోపాలు చిన్నారి మురళితోడ
తాండవింపగ జేసె క్షేత్రయ్య గీతి;
తెలుగు హృదయాల తంబురా తీగెమీటి
అమృత రస తరంగిణి జేసె త్యాగరాజు.

కవులకంటె తుహిన కర్పూర నిభకీర్తి
తెచ్చిరెవరు నీకు తెలుగుతల్లి!
సాహితీ తరంగ సంగీత రసధుని
దేశబాషలందు తెలుగు లెస్స.

తెరపి వెన్నెల అణి ముత్యాల సొబగు
పునుగు జవ్వాజి ఆమని పూలవలపు
మురళి రవళులు కస్తూరి పరిమళములు
కలసి యేర్పడె సుమ్ము మా తెలుగుబాస.

('తెలుగు తల్లి' అనే సంకలనంలోనిది. సం.ప్ర. తేది 1975)

# కైవారము

నండూరి రామకృష్ణమాచార్య

వెలమ బెబ్బులుల కత్తుల ఝళిపింపుల
పులకరెత్తించెడి బుఱ్ఱకథలు
పలనాటి బాలురు పగతుర శిరసులు
బొంగరాలుగ త్రిప్పు పూర్వకథలు
పరచివచ్చు పతికి పసుపు కుంకుమ బెట్టు
వీరపత్నులనాటి వింతకథలు
పతితోడ ప్రాణాలు చితిమీద ఆహుతు
లర్పించిన సతుల ఆత్మకథలు

అచ్చ తెనుగు హృదయముల అవతరించి
ఆట పాటలుగా అలనాటినుండి
నేటికినిగూడ తంబురా మీటులందు
బ్రదికియుండె తెలుగునాటి పల్లెటూళ్ల.

ఏ యిక్ష్వాకులనాటి వృత్తములొ యీ కృష్ణానదీవాః కళా
చ్ఛాయా స్వప్న పరంపరా శిథిలముల్ సాక్షాత్కరించున్ మహా
మాయా మేదుర మేఘవాటికల శంపామాలికా జ్యోతులై
మాయాంధ్రావని బౌద్ధ శిల్పముల సమ్యక్ పూర్వ సంభావనల్.

మా నాగార్జున దేవుతత్త్వ కవితా మాధుర్యముల్ కృష్ణవే
ణీ నాట్యామృతగాన వాహినుల ఏ సత్కృత్య దివ్య ప్రభా
పౌనఃపున్యములన్ వెలార్చిన వోయీ ప్రాచీనతా శిల్ప వి
జ్ఞానోపాసన తెల్గునేల మృగతృష్ణారేఖలై తోచెడిన్.

('తారాతోరణము' అనే సంపుటిలోనిది సం [illegible] తేది 1949)

## తెలుగు సరస్వతి

బోయి భీమన్న

ఎంత దివ్యమైనది
ఈ తెలుగు సరస్వతి!

ఏదో ఒక మధువేనా
ఎల్ల ఋతువులును తానై
నా ఆరామము నిండా
నవరుచులతో వికాసించు.

ఆకలికొక దానికేన
ఆకాంక్షల కన్నిటికి
పూల పండ్ల గిన్నెలతో
పురుషార్థము లందించు!

ఒక భౌతిక జగతి సేవ
సకల సౌఖ్య లోకాలను
ఆత్మ దారమున గుచ్చి
అఖిలేశ్వరి కర్పించు.

('తెలుగుతల్లి' అనే సంకలనంలోనిది. సం.ప్ర. తేది 1975)

## తేనెకన్న మధురంగా తెలుగు

ఆత్రేయ

తేనెకన్న మదురం రా, తెలుగు, ఆ
తెలుగుదనం మాకంటి వెలుగు.

తెలుగుగడ్డ పోతుగడ్డ ఎంత వచ్చన, మా
తెలుగు గుండెలో స్నేహము ఎంత వెచ్చన।
మన పొలాల కాంతిపులుగు ఎంత తెల్లన, మన
తరతరాల కథను పాడు గుండె ఝల్లన. ॥తేనె॥

పాటుపడిన వాళ్లకే లోటు లేదని
దాటి చెప్పు తల్లికదా తెలుగుతల్లి
లలితకళలు సంగీతం సాహిత్యం
తెలుగుతల్లి జీవితాన దినకృత్యాలు. ॥తేనె॥

గత చరిత ఘన చరిత్ర ఎంత ఖ్యాతి।
గర్వించదగ్గ జాతి తెలుగుజాతి।
అయినా గతంకన్న భవిష్యత్తు ఆకాంక్షనకం
ఆ కావికొరకు ధరిందాలి దీక్షాతిలకం. ॥తేనె॥

('తెలుగు తల్లి' అనే సంకలనంలోనిది. సం.ప్ర. తేది 1975)

## నీరాజనము

దేవులపల్లి రామానుజరావు

లక్ష్య లక్షణరూప కల్పనలయందు
ఆంధ్రసారస్వతాన నవ్యంపురుచులు
ప్రబల చేసెడి తావక ప్రాభవమున
కంకితంబయ్యె నాహృదయంబు సుకవి!

దేశమే నీ వుపాసించు దేవదేవి
అవనియంతయు ప్రేమమయంబు నీకు
మధుర మధురము తెనుగు నీమాతృభాష
ధన్యుడవు నీవు నీపుట్టు ధన్యమయ్యె.

భారతకవితా ప్రపంచాన భామినులును
మాతృపీఠమునందు సమ్మాన లగుట
నీవు చూపు నుదాత్తమౌ నేర్పుగాన
అందుకొనుమయ్య మత్ప్రీతి వందనంబు.

కళయ సౌందర్య మారాధకంబు నీకు
ప్రకృతి లావణ్యమో నీకు పరమ ప్రియము
కావ్య ఫలముల నాంధ్రుల కాంక్షదీర
కొనియిత్తువు ప్రేమతో కోవిదేంద్ర.

తెనుఁగు నాఁడు నీది తెనుఁగు బిడ్డవునీవు
తెనుఁగటన్న నీకు తీపి మెండు
తెనుఁగు కన్నె జడలఁదీర్చి మక్కువతోడ
తెనుఁగు తోటలందు దిప్పినావు.

('పచ్చతోరణము' లోనిది)

# మాతల్లి

అనుముల కృష్ణమూర్తి

యావద్భారత వీర ధర్మముల కి
యాంధ్రమ్ము కేంద్రమ్ముగా
త్రోవన్ జూపి చరిత్రకెక్కెను: కులో
ద్యోగుల్ గుణుల్ మాతృ భూ
సేవా జీవులు తెన్గువారలనమిం
చేన కీర్తి మిన్నందిర! అ
జీవన్మృత్యువనాథ జన్మలకు
ఇన్ని నీకు లేదెప్పుడున్

నీవొక జీవజాతిని జ
నించిన వాడవు విస్మరించకీ
భావము; నీ చరిత్ర బహు
పౌరుషగాథ స్మరించుకొమ్ము; ని
ర్జీవములైన జాతులు న
శింపక తప్పదు మేలుకొమ్ము; నీ
వే విజయ ధ్వజమ్మెగుర
వేసెడి వాడవు లేచిరమ్మురా!

అదిగో దేశ చరిత్రయందొక నవా
ధ్యాయమ్ము ప్రారంభమై
నది; అందొక్క మహోజ్జ్వలమ్మయినస్వా
నమ్మాక్ర కంపంగను
న్నది నీకతి; పురోగమించుటకు న
న్నద్ధుల్ సహేంద్రోర్వి బు
ట్టిన ముక్కోటి తెనుంగు బిదినము, తం
ద్రీ! త్రవ్వరా! దున్నరా!!

తెనుగుల వేషభాషలొక
తీరువి, వారి పరస్పరార్ద్రభా వ
ర్తనముల పొక్క తీరువి వె
తల్ మురిపెమ్ముల పొక్క తీరులౌ
ర సరసరమ్ములన్ తరత
రమ్ములనుండి అనాది నైజమున్
ఘనముగ దాచుకున్నది, అ
ఖండముగా మహదాంధ్రి రెండునై.

పరిణతమైన సాంస్కృతిక
భారతమందు కళాపురోగతుల్
జరిగెడివేళ మా తెనుగు
చక్కదనాల ఒయారి జాణని
బ్బరపునదల్ గతమ్మునకు భావికి
వన్నెలు దిద్దగావలెన్

గురుతర కార్య భారమున
గ్రుంగెడి తల్లి కెదింగినట్టి కూ
తురువలె, నితనొపనుల
తోడ్పడి మక్కువ నందగావలెన్.

("ఆంధ్రావతరణము" అనే సంపుటిలోనిది. సం. ప్ర. తేది 1966)

## తెలుగుబాస

చెలమచెర్ల రంగాచార్యులు

పలికిన పల్కుపల్కునను పట్టున పిండిన క్రొత్తతేనియల్
కలికి నిగారముల్ వెలయఁ గమ్మని తావులు గుమ్మరించు ఛా
పలహరు లింపు సొంపెసయు, జానలలోఁ గతులన్నయైన మా
తెలుగుపురంధ్రికామణిని దివ్యాని డెందమునన్ భజించదన్.

('తెలుగుతల్లి' అనే సంకలనంలోనిది. సం.ప్ర. తేది 1975)

# నా తెలుగు

చల్లా రాధాకృష్ణశర్మ

ఏమున్నదో తెలుగనుమాటలో
నామది పరవశించు విన్నంతనే

కమ్మతెమ్మెరలు కదలివచ్చినట్లుండు
శరచ్చంద్ర చంద్రికలు విరిసినట్లుండు
ములముల మొల్లలు విచ్చినటుండు
గలగల తేనెసోనలు స్రవించినట్లుండు
ఆనందాబ్ధి నాప్రోల నిలిచినట్లుండు

తేనె లొలుకు తేటతెనుగు
వీనుల రవళించునపుడు
మారుమ్రోగినట్లుండు
వేణువీణానిస్వనములు

ద్వేషభావ మెరుగని భాష నాది
బహు పురాతనమైన భాష నాది
నాల్గుకోట్ల హృత్సీమల నర్తించుచు
పరిణతిచెందే సజీవ భాష నాది

అయినా
నా తెలుగు పలుకులలో
గుబాళించవలె
కన్నడ కస్తూరి ఘుమఘుమలు
కలసిపోవలె
కమ్మని. తమిళపు తేటతేనెలు
[illegible] పోవలె

సుందర క్షైరశి సొగసులు
ప్రతిఫలించవలె
ప్రతిభాషలోని నిగ నిగలు
కనిపించవలె నా తెలుగు
నిత్య నూతనంగా
వినిపించవలె నా తెలుగు
విశ్వవిపంచిమీద.

('కావ్యమాల' అనే సంకలనంలోనిది. సం ప్ర. తేది 1984)

## తెలుగువాణి

రాంపిచెర్ల కృష్ణమాచార్యులు

సీ॥ శబ్దానుశాసను సాహిత్య సృష్టిలో
మించుబోణిని మించు మేనదాల్చి
సోమయాజులచెంత సోమదేవమ్మవై
హోమపీఠిని జేరి హాయరజూపి
కవిసార్వభౌముని కవితాస్రవంతిలో
శృంగార జలకేళి చేసిచేసి
హాలిక కవిరాజు నారామసీమలో
భక్తితోగీతాల పాడిపాడి

తే॥గీ ఒడలు మరిపించి పులకించి యుత్సహించి
జాతి సంస్కృతి నిల్పెడి ఖ్యాతిగాంచి
ముగుదవూబోణి భారత భూమియందు
వెలుగు భాషలరాణి మాతెలుగురాణి.

('మణిహారము' అనే సంపుటిలోనిది- సం.ప్ర తేది 1971)

# ప్రబోధము

కొవ్విడి వేంకటరత్నశర్మ

బొబ్బిలి కథలోను, గొబ్బిసంక్రాంతిలో
భూరిపుష్కరవారిపూరమందు
భరతనాట్యములోన, భాగోతకథలోన
శ్రీనాథకవిరాజుసీసములను
'ఎంకిపాటల'లోను వేంకటశాస్త్రి సు
ధామధురోక్త్యవధానములను
జంగము పాటలో 'శంభో' పదంబులో
కాంభోజరాజ్ఞీగాథలందు

పుణ్యగోదావరీ, కృష్ణవేణ్యఖండ
తుంగభద్రా, పినాకినీ భంగములను
చిందులం ద్రొక్క, త్రుళ్లింతలొందుతెలుఁగు
తల్లి నొకసారి మనసారఁ దలఁచు మాంధ్ర!

పలనాటిసీమలో, పాకాల చెరువులో
బాలనాగమసాధ్విపదములందు
మాంధాలచేతలో, మల్లాంబ పలుకులో
ఖడ్గతిక్కన కత్తికాకలందు
నెల్లూరిపురి, వేంగిపల్లె వీధులయందు
కవితిక్కనామాత్యుఘంటమందు
తిరుమలక్షేత్రంపు దివ్యతీర్థములందు
సింహాచలపుకొండసిగలయందు

మువ్వగోపాలదేవుని ముత్తెములను
ఘనుఁడు పోతన కావ్యంపుఁగళలనిండి
తొంటిశారద కాటుకకంట వెలుఁగు
తల్లి నొకసారి మనసారఁ దలఁచు మాంధ్ర!

చంద్రగుప్తుని భుజస్కంధ మెక్కినప్రౌఢ
చాణక్యుఁడాంధ్రుల ప్రాణ మనుము
మన్మసిద్ధినృపాలమంత్రి తిక్కనకవి
తెలుఁగులబహుతపఃఫలమె యనుము
హైదరాలీ, టిప్పులాస్థానపెగ్గడ
పూర్ణయ్య యాంధ్రులపుణ్య మనుము
గోల్కొండ రాణీష కొలుపునుద్ధతిగన్న
అక్కన్న, మాదన్న లాంధ్రులనుము
నేడుకర్ణాటగద్ది నిర్ణిద్ర కీర్తి
న్యాయపతి మాధవా మాత్యుఁ డాంధ్రుఁ డనుము
తీరవోలేదు మనమాత భూరిగర్వ
మెందరెందరో సచివులఁ బొందగలదు
తల్లి నొకసారి మనసారఁ దలఁచు మాంధ్ర!

(ఆంధ్రస్ఫూర్తి (తెలుగునాదులు) అనే సంపుటిలోనిది నం.ప్ర. తేది 1948)

## ఇంచక్కటి తెలుగు

మిరియాల రామకృష్ణ

ఇంచక్కటి తెలుగు వదలి
      ఇతర భాషలెందుకురా!
బలే తెలుగు! బలే తెలుగు
      బంగారంలాంటి తెలుగు!
ముత్యాలను గ్రుచ్చినట్లు
      ముచ్చటగా వుంది తెలుగు
దేవుడి గుడిగంటలాగ
      తెలుగు పాట మ్రోగుతోంది.

'అమ్మ' అనే మొదటి మాట
      అందించిన భాషయిదే
చెవిలో తేనెలు పోసిన
      చిన్నప్పటి నేస్తమిదే!

('బాలాభిరామం' అనే పిల్లలపాటల పుస్తకంలోనిది. నం.ప్ర. తేది 1968

# దేశభాషలందు తెలుగులెస్స

మిరియాల రామకృష్ణ

ఉగ్గుపాలనుండి ఊయాలలో నుండి
అమ్మపాట పాడినట్టి భాష
తేనెవంటి మందు వీనులకుసువిందు
దేశభాషలందు తెలుగులెస్స!

సంస్కృతంబులోని చక్కెర పాకంబు
అరవభాషలోని అమృతరాశి
కన్నడంబులోని కస్తూరి వాసన
కలసిపోయె తేట తెలుగునందు

వేనవేల కవుల వెలుగులో రూపొంది
దేశములందును వాసిగాంచి
వేయియేండ్లనుండి వెలసిల్లు నా భాష!
దేశభాషలందు తెలుగులెస్స!

('బాలాభిరామం'లోనిది. సం.ప్ర. తేది 1966)

# తెలుఁగు పలుకు

తిరుమల శ్రీనివాసాచార్యులు

మల్లెపూలలోని మధుర సౌరభ్యమ్ము
తేనెపెరలలోని తీయదనము
వెండిపూతఁ బూయు వెన్నెల చలువయు
తెలుఁగు పలుకు నిండి కళవహించు

పూల మెత్తదనమ్ము పాల కమ్మఁదనమ్ము
మొగ్గలోని సిగ్గు మొగలి పొగరు
నందనమ్ములోని యందాలరాసులు
తెలుఁగు పొలుపు నరసి తెల్లవోవు.

ఎగిరి నింగినంటు నెవరెస్టు శిఖరమ్ము
గిరులఁదరుల నొరసి యురుకురులు
నదులఁదీర్చి త్రేన్చి నటియించు సంద్రమ్ము
తెలుగుతీవిని గని తలఁకుచుండు.

వాణిచేతనలరు వీణానినాదమ్ము
వీనులలర మ్రోయువేణునాదము
మధురరాగ కలితమవ తినిక్వాణమ్ము
తెలుఁగు గీతుల విని తెలిచిపోవు.

లలితలలిత రాగరమణీయగానమ్ము
మృదుమృదంగ నాదమేళనమున
జాతిగుండియలకు రాసిక్యమును నేర్పు
బాస యేది? తెల్గుబాస గాక!

సుదల జల్లి దెసల మధురయాత్రలుఁ జేసి
దినదినాభివృద్ధిదీప్తి నిండి
క్రొమ్మెఱుంగుఁ దాల్చి కొంగ్రొత్తసొగసుల
తళుకుఁజిమ్ము భాష, తెలుగుభాష.

దేవభాష నాడు జీవమ్ముఁ బోసెను
బలము పుంజుకొనియె తెలుగు నేడు
తళుకుపలుకు లలరితల్లి దాటునబిడ్డ
నేర్పు వెలయ జగతినేర్చు టరుదె?

పలుకు పల్కునందు పరిమళమ్ములుఁ జల్లి
పదములోన నృత్యభంగి నెఱపి
చూపరులను సొంపు చూపుల నూరించు
తెలుఁగు పొలతినడకతీరు వేరు.

మాతృమూర్తి చరణమందారముల వ్రాలి
అక్కచెల్లియల సమాదరించి
ఇరుగుపొరుఁగు తోడ నింపుగా భాషించి
వన్నెకెక్కె తెలుఁగు వన్నెలాడి.

నరస జీవనమ్ము సాగించి సాగించి
భువిని దివిని ముగ్ధమోహనముగ
మార్చి, తెలుఁగు జాతి మధురానుభూతులఁ
దేల్చి వెలుఁగుగాకఁ తెలుగు పలుకు.

('ఉదయరాగము' అనే ఖండకావ్యంలోనిది. నం.ప్ర. తేది 1970)

# తెలుగు కవిత్వం

సముద్రపు శ్రీమహావిష్ణు

పాలు పంచదారకన్న
పసిపాపల నవ్వుకన్న
చందమామ వెన్నెలకన్న
అందమైన కన్నె కన్న
మల్లెపూల తావికన్న
మాయలేని మనసుకన్న
కోకిలమ్మ పాటకన్న
కోపంలేని మాటకన్న

తేనెకన్న జున్నుకన్న
తెలుగు కవిత ఎంతో మిన్న

ఎడారిలో నీటికన్న
ఎదురు చూడని సిరికన్న
మేలిమి బంగరుకన్న
మేనమామ కూతుకన్న

అత్తరు పన్నీరుకన్న
చిత్రజా బాణానికన్న

తేనెకన్న జున్నుకన్న
తెలుగు కవితయే మిన్న.

("హృదయవీణ" అనే కవితా సంపుటిలోనిది న .ప్ర తేది 1974)

# త్రిలింగము

విద్యానాథకవి

యైర్దేశ స్త్రిభిరేష యాతి మహతీం ఖ్యాతిం త్రిలింగాఖ్యయా
యేషాం కాకతిరాజ కీర్తిభరితైః కైలాసశైలఃకృతః
తే దేవాః ప్రసరత్ప్రసాదమధురాః శ్రీశైల కాళేశ్వర
దాక్షారామ నివాసినః ప్రతిదినం త్వచ్ఛ్రేయసే జాగ్రతు.

('తెలుగుతల్లి' అనే సంకలనంలోనిది సం.ప్ర. తేదీ 1975,

## వేగిదేశము

నన్నయ భట్టారకుడు

“దక్షిణ గంగనా దద్ధయు నొప్పిన
    గోదావరియు జగదాది యైన
భీమేశ్వరంబును బెడగగుచున్న శ్రీ
    పర్వతంబును చూచి యుర్విలోన
ననఘమై శిష్టాగ్రహార భూయిష్ఠమై
    ధరణీసురోత్తమాధ్వరవిధాన
పుణ్యసమృద్ధమై పొలుచు వేగిదేశ
    విభవంబుఁ జూచుచు విబుధు దక్షి

ణాంబురాశి తీర్థంబున కరిగి దురిత
హారియైన కావేరీ మహాసముద్ర
నంగమంబున భూసురేశ్వరుల కభిమ
తార్థదానంబు జేసి కృతార్థుడగుచు”

('తెలుగుతల్లి' అనే సంకలనంలోనిది సం.ప్ర. తేది 1975)

# వేఁగిక్షేత్రము

విశ్వనాథ సత్యనారాయణ

ఏ రాజు పంచెనో యిచట శౌర్యపు పాయ
సమ్ములు నాగుల చవితినాళ్ళ,
ఏ యెట్టి సంజలో నెలమి పల్లవరాజ
రమణులు కాళ్ళఁ బారాణు లిడిరొ,
చిత్రరథస్వామి శ్రీరథోత్సవములో
తెలుఁగు పిల్లలు కత్తి త్రిప్పి రెపుడొ,
ఏరెండుజాముల యినుని వేడిమి వచ్చి
కలిసి పోయెను త్రిలింగ ప్రభువుల,

నాటిగత్ర్యేయసంబులై యలరుతొంటి
వేంగిరాజుల పాదపవిత్రచిహ్న
గర్వితమ్మైన యీ భూమిఖండమందు
సశ్రువులు జార్తురి జీవచ్ఛవాంధ్ర జనులు

వేఁగి రాజ్యపు పల్లె వీధుల చెరుగుళ్ళ
రిపులఁ గవ్వించు నేరుపులు తెలిసి
ఎగురు గోడిబిళ్ళ సొగసులో రిపుశిర
స్సుల బంతులాడు శిక్షలకు దాసి,
చెట్టాడి యుప్పు తెచ్చిన నాఁడె శాత్రవ
వ్యూహముల్ పగిలించు నొఱవుగఱచి,
కోతి కొమ్మచ్చిలో కోటగోడల కెగఁ
బ్రాకి లంఘించు చంక్రమణ మెఱిఁగి,

తెనుఁగు లంత స్థై యవి నేర్చుకొనియ యుఁదు
రెన్నగాఁ దెల్గు తల్లులు మున్ను శౌర్య
రస మొడిచి యుగ్గుఁబాలతో రంగరించి
బొడ్డు కోయని కూనకే పోయుదురట।

ఇమ్ముగఁ గాకుళమ్ము మొదలీవరకుం గల యాంధ్ర పూర్వ రా
జ్యమ్ముల పేరు చెప్పిన, హృదంతర మేలా చలించి పోవు, నా
ర్ద్రిమ్మగు చిత్తవృత్తుల పురాభవ నిర్ణయ మేని ఎన్ని జ
న్మమ్ములు గాగ నీ తనువునన్ బ్రవహించునొ యాంధ్ర రక్తముల్।

ఇది వినిపింతునంచు మది నెంచెద మిత్రులకున్ గళస్థ గా
ద్గదికము, లోచనాంత బహుధాస్రుత బాష్పనదమ్ము, స్పంద నా
స్పద హృదయమ్ము, నావనికిఁ బాలక చేసెదు, నన్ను నింత గా
నెద పదిలించుకొన్న దిది యెక్కడి పూర్వపు జన్మ వాసనో।

('తెలుగుతల్లి' అనే సంకలనంలోనిది సం.ప్ర తేది 1975)

# హంపి క్షేత్రము

కొడాలి వేంకట సుబ్బారావు

శిలలు ద్రవించి యేడ్చినవి జీర్ణము లైనవి తుంగభద్రలో
పల గుడి గోపురంబులు నభాస్థలు లైనవి కొండ ముచ్చు గుం
పులకు చరిత్రలో మునిగి పోయిన ఆంధ్ర వసుంధరాధి కో
జ్జ్వల విజయ ప్రతాప రభసం బొక స్వప్న కథా విశేషమై.

కొక్కెముల్ రాతి నొక్కులు గాగ ఉయ్యాల
      చలిపి నాడొక కొండ పలక తొలచి
సోపానములు రాతిసుళ్ళుగాగ నుయ్యి
      కొట్టినా డొక కొండగుట్ట తొలిచి
దూలముల్ రాతి బాదులై గాగ హర్మ్యము
      కట్టినా డొక కొండకటిని తొలిచి
వేదు లెల్లను రాతి విరుపులుగా రచ్చ
      దిద్దినా డొక కొండ దిబ్బ తొలిచి

సర్వ నిర్మాణముల నద్రిచయము నందె
శిల్పి చేతి సాధనముల చెక్కినాడు
మరలు లేకుండ యంత్రాల మహిమ లేక
ఆమహాశక్తికిని హేతు వరయలేము.

ఒకచేత. పాడైన ఓరుగల్ సిరులను
      విద్యానగర రాజవీధి కెత్తి,
ఒకచేత క్షీణత నొందు హిందూమత
      వైశాల్యభావ సంపదల నెత్తి
ఒకచేత రాజకీయోన్నతిలో మంత్ర
      శక్తియుక్తుల 'పరజాల' నెత్తి
ఒకచేత యోగ సాయుజ్యాంతరానంద
      తత్వ సారాచ్ఛ సాధనము లెత్తి

ఇహపరంబుల మతరాజకీయములకు
ఒకటి కొక్కటి పొసగని వికటవస్తు
జాలముల నైక్య పరచి నిస్సంగ మంచు
సంగివై సంగమందు నిస్సంగివైతె!

ఆ కన్నుమూతలో నంతర్వ్యథల వం
    దానిల స్తంభనాత్మార్చి వెలుగు
ఆబొమ్మమోడ్పులో ననమాను సెగకన్ను
    మంటలేగిన సుళ్ళు మాటు మణుగు
ఆకన్నువిప్పులో నఖిలరాజన్య శి
    ఖాదళ మ్మైన తర్పస్సు మెరయు
ఆ చిరునవ్వులో నాంధ్రసామ్రాజ్య సు
    శ్రీనవ్యజీవన శిల మిముడు

ఈ శిలావిగ్రహము నందె యింతగొప్ప
కుదురుకొని యుండ ఊహలు గుములు కొనిన
ఎంతవాడవో నిను స్తుతియింప గలమె!
విజయనగరాంధ్ర దేవుడవే నిజంబు.

('తెలుగుతల్లి' అనే సంకలనంలోనిది సం.ప్ర. తేది 1975)

## మాతృపూజ

బొడ్డు బాపిరాజు

అమృతమ్ముల్ ప్రవహించువాహినులు; ప్రత్యక్షాన్న పూర్ణావతా
రములౌ క్షేత్రము; లద్భుతమ్ములు కళాలావణ్య నిక్షేపముల్
ప్రముఖోత్కృష్ట చరిత్ర; లక్షయ యశోభాండారముల్ మాకునై
అమరించెన్ మముగన్నభూమి యిది నిత్య స్వర్గభోగమ్ములన్.

('తెలుగుతల్లి' అనే సంకలనంలోనిది. సం.ప్ర. తేది 1975)

## రాష్ట్రగానము

తుమ్మల సీతారామమూర్తి చౌదరి

నాఁడల తల్లికోట కదనమ్మున వాలిన తెల్గుబావుటా
నేఁడు తళత్తళల్ గురిసె నింగిని, మంగళ గీతవాద్యముల్
వాడల వాడలన్ విరియవచ్చిన దాంధ్రమహస్సు; జాతికి
వేడుక సంఘటించిన పవిత్ర చరిత్రుల కంజలించెదన్.

అమ్మబొజ్జలోనఁ దొమ్మిది నెలలున్న
నిసుఁగు బ్రదుకె వేయి నెలలుదాట
నలువదేండ్లు నిల్చి తలచూపినట్టి యీ
పట్టి బ్రదిమి కాన కట్టకలదె!

('తెలుగుతల్లి' అనే సంకలనంలోనిది సం.ప్ర. తేది 1975)

# హెచ్చరిక

తుమ్మల సీతారామమూర్తి చౌదరి

కలదోయి! తెలుఁగు జోదుల తుటారి కటారి
చెలరేఁగి పగఱఁ దీర్చినదినంబు
కలదోయి! తెలుఁగు రాజులు గంగ గట్టు పైఁ
డిండ్రించి పడగలెత్తిన దినంబు
కలదోయి! రేవు రేవులఁ దెలుంగు సరంగు
మొనసి లంగర్లు దింపిన దినంబు
కలదోయి! తెలుఁగు పల్కుల వెలంది వెలంది
వెలుఁగు లెల్లెడలఁ బర్వీన దినంబు.

కలదు కలదోయి! తెల్గుప్రెగ్గడలు మన్ను
మిన్ను తాళంబువైచి పేర్గన్న దినము
నేఁటి నీ పాటునెంచి కన్నీటి నిడకు
నిలుచునే! కాల మొకరీలఁ దెలుఁగు బిడ్డ!

తెలుఁగుదాతల దాన జలవేణిలో గిరుల్
తెప్పలై పరువులెత్తిన దినంబు
తెలుఁగు వారల భోగములఁ గాంచి పాకశా
సనుఁడు గ్రుక్కిళ్ళు మ్రింగినదినంబు
తెలుగు బొజ్జల పాదముల చెంత జగమెల్ల
విజ్ఞాన మధువు ద్రావిన దినంబు
తెలుఁగు బిడ్డలు తిలాంజలి కులమ్ముల కిచ్చి
యన్నంబు నొకదావఁ దిన్న దినము

కలదు కలదోయి! తెల్గుపోకడలు విశ్వ
మునకు మేల్బంతులై వెలింగిన దినంబు
నేఁడనీపాటు నెంచి కన్నిది నిరకు
నిలుచునే? కాల మొకటింఁ దెలుగుబిడ్డ!

ఉడుగని పౌరుషంబు విజయోత్సవ కారణమన్న సూత్రముఁ
విడువక దేశభక్తి పదవీననదవీసియైన దీక్షమై
నడలిన మాతృగౌరవము సంపదల న్గడియించునంతకున్
మడమను ద్రిప్పఁబోకు జయమంగళముల్ నిను సంశ్రయించుతఁ.

('రాష్ట్రగానము' అనే కావ్యంలోనిది. సం.ప్ర. తేది 1939)

## అమరజీవి

సామవేదం జానకిరామశర్మ

అది గొప్పయౌనొకో! యపుడు వెన్నెముకను
దాన మిచ్చె దధీచి మౌని యతఁడు;
అది యేమిఘనత! కాయము కోసి యిచ్చెను
శిబిచక్రవర్తి ప్రసిద్ధుఁ డతఁడు
అది యొక లెక్కయా! యడుగులు మూడుగా
ధర నిచ్చె బలియు వదాన్యుఁ డతఁడు!
అది లెస్సయా! మేన నవఘటించినసొమ్ము
లడుగ నిచ్చెను కర్ణుఁ డగునె దాత

యనుచు స్వర్గపురీ రథ్యలందు సురలు
పొట్టి శ్రీరాముల యుదంతమును దలంచి
యక్కజంపడి తలయూచి యాడుభాష
లందగించెను మేఘగర్జాంతరముల!

('తెలుగుతల్లి' అనే సంకలనంలోనిది. నం.ప్ర. తేది 19 '51)

## ఆంధ్రరాజ్య సూర్యోదయము

వెంపరాల సూర్యనారాయణశాస్త్రి

మంగళ మాంధ్రమాత కసమాన నయాంచిత రీతిపాలనా
ఖంగరమానమేతకు, నపార రసాశ్రయ కావ్యభారతీ
సంగత కీర్తిపూతకుఁ, బ్రశస్త నదీజల పుష్టసర్వ స
స్యాంగణభూత, కప్రతిహతాత్మజ శౌర్యధనాఽనపేతకున్.

('తెలుగుతల్లి' అనే సంకలనంలోనిది నం.ప్ర. తేది 1975)

## ఆకాంక్ష

పెనుమెచ్చ సత్యనారాయణరాజు

ఉపవాసవ్రతమ మించుకేనియు నుదా నుల్లంఘనం బోఁపనీ
కపురూపంబుగ నాంధ్రరాష్ట్రమునకై యర్పించె ప్రాణంబు లే
యపరబ్రహ్మము పొట్టిరాము లతనిన్ వ్యాజంబు లేకుండగా
ఎపుడున్ గొల్చుచు నాంధ్రః యేలుకొను మోయీః స్వీయరాష్ట్రం బికన్.

('తెలుగుతల్లి' అనే నంకలనంలోనిది నం.ప్ర. తేది 1975)

## స్వాగతము

కల్లూరి వేంకటసుబ్రహ్మణ్య దీక్షితులు

ప్రాణాలన్ బలిదాన మిచ్చితిమి ఆంధ్రక్ష్మారమాకన్య! నీ
కై; నిన్నెవ్వరు ధర్మభిక్షముగ మా కర్పింపలే; దేలకో
నానానాయక జాలనాయక వినూత్నమ్మైన సంసార మిం
కేనిన్ నీ వొక క్రొత్తిపై నడుపుకోవే యాత్మసామ్రాజ్యమున్.

('తెలుగుతల్లి' అనే సంకలనంలోనిది నం.ప్ర. తేది 1975)

## విజయోఽస్తు

నండూరి రామకృష్ణమాచార్య

పూర్వాంభోనిధి కాళహస్తి నగరీ శ్రీమన్మహేంద్రాచల
శ్రీశైల ప్రముఖ త్రిలింగ శిఖర ప్రాతర్నవోషస్వినీ!
కృష్ణా కంకణ కింకిణీ ఝణఝణాద్ గోదావరీ కాంచికా;
ద్రాక్షా పేశల వాఙ్మయీ! విజయతాం! త్రైలింగ పృథ్వీస్థలీ!

('తెలుగుతల్లి' అనే సంకలనంలోనిది నం.ప్ర. తేది 1975)

# తెలుగుతల్లి



అదెహో తెలుగు తల్లి
అందాల నిండు జాబిల్లి
ఆనందాల కల్పవల్లి
అదె నీ తెలుగుతల్లి.

పదహోయ్ తెలుగువాడా
అదె నీ తెలుగు మేడ
సంకెళ్ళు లేని నేల
సంతోష చంద్ర శాల.

కనహోయ్ తెనుంగు రేడా
అదె నీ అనుంగు నేల
అదిగో సుదూర వేల
చనహోయ్ తెలుగువీరా!

స్వర్గాల కాంతి స్వప్నాలు
స్వప్నాల కాంతి స్వర్గాలు
నిన్నే పిలుస్తున్నాయి
నిన్నే వరిస్తున్నాయి.

ఆందోళనాల డోల
సందేహాల హిందోళ
ఎందాక ఊగిసలాట
అదె నీ గులాబి తోట.

పదహోయ్ తెలుగుబాట
ఇదిగో తెలుగు కోట
పదహోయ్ నిర్భయంగా
పదహోయ్ దిగ్జయంగా
పదహోయ్ నిశ్చయంగా.

('తెలుగుతల్లి' అనే సంకలనంలోనిది సం.ప్ర. 1975)

# తెలుగుతల్లి

జంధ్యాల పాపయ్యశాస్త్రి

కనిపింపదే నేడు ! కాకతీయ ప్రాజ్య
    సామ్రాజ్య జాతీయ జయపతాక
వినిపింపదే నేడు ! విద్యానగరరాజ
    సభలోని విజయదుందుభుల మ్రోత
వెలగదే నేడు ! బొబ్బిలికోట బురుజుపై
    నాంధ్ర పాపయ తళత్తళలబాకు
నిప్పచ్చరంబయ్యెనే నేడు—వీరప
    ల్నాటి యోధుల సింహనాదలక్ష్మి

చెక్కుచెదరని యేనాడు మొక్కవోని
ఆంధ్ర పౌరుష మిప్పుడధ్వాన్నమయ్యె;
మరలనొకమాటు వెనుకకు మరలి చూచి
దిద్దుకోవమ్మ ! బిడ్డల, తెలుగుతల్లి !

"రాయిగ్రుద్దును" నీపురాశిల్ప సంపత్తి
    నమరావతీ స్తూప సముదయంబు;
"చదివించు" నీ మహాసామ్రాజ్య కథల నాం
    ధ్రక్ష్మాపతుల జయ స్తంభలిపులు;
"గళమెత్తిపాడు" నీగాన సౌభాగ్యమ్ము
    రమణీయముగ త్యాగరాయకృతులు;
"వేనోళ్ళచాటు" నీవీర మాతృత్వమ్ము
    పలనాటి వీరుల పంటకథలు;

"వల్లెవేయును" నీ వైభవ ప్రశస్తి
హోరుమంచును నేడు మా ఓడరేవు
శ్రుతికి చెడియున్న నీపూర్వ భాగ్యరేఖ
చెదిరిపోలేదు తల్లి ! మా స్మృతిపథాల.

('ఉదయశ్రీ' అనే సంకలనంలోనిది సం.ప్ర. తేది 1979)

# ఆంధ్రప్రశస్తి

పుట్టపర్తి నారాయణాచార్యులు

కన్నడపుం బసందుఁ దొలుకార్చు మహాకవి 'పంపఁడన్న' — మా
యన్న; యటుండనీ, రసికహాలుఁడు గూర్చిన సూక్తి పాటిలోఁ
జిన్నెలు వన్నెలున్ గలుగు జిన్నరికైతలు తెల్గు వంశపుం
గన్నెల భావసృష్టులట! గావలెనా! మరి వేరు భాగ్యముల్.

వింధ్యాద్రి వనులలో వికసించు దెనుగు క
　　త్తుల పొలుగల తళ తళలు దలఁచి
మల్లెపూవుల తావు లొల్లఁ బోవని కొండ
　　వీటి నాట్యమ్ముల నీటు పలచి
తుంగభద్రాసముత్తుంగ వీచీ కావ్య
　　గంభీర ఘుమఘుమల్ కలలఁ గెదికి
వీర బెబ్బులి రౌతు పెట్టిన పొలికేక
　　రాణించు తందాన తానలు విని

క్షణములో దివి భువి నొక్క గాటఁ గట్టు
తిమ్మరుసు మంత్రి శేముషీ దీప్తి దలఁచి
యాంధ్రుఁడై పుట్టి నట్టి పుణ్యాంశఁ బంట
లెంచి నాలోన నేనె గర్వించికొందు.

ఏ పద్మమున జుఱుకించెనో! మధువుఁ 'పె
　　న్నాదేవి' తిక్కనస్వాదుకవిత
యేవేళ ననుగ్రహించెనో! భద్రాద్రి
　　రామయ్య పోతన్న రసికభక్తి
యేపూన్కతో పాకళించెనో! శ్రీనాథ
　　కవిరాజు కర్ణాట క్రమపణితి
యే విక్రమమ్ము ప్రేరేచెనో! కృష్ణ రా
　　యని వీర వైష్ణవంబును మథింప

భద్రగజదీరగరి తామ్రపర్ణినుండి
భక్తి రసజీవనము చంద్రభాగవరకు
ఆత్రిలింగేశ్వరుల దయ యుపమశించి
'యాంధ్రి' యన మెత్తబడనట్టి యాత్మ లేదు.

వేదాద్రి నరసింహ విపుల వక్ష స్స్ఫురత్
కమనీయ కల్హార గంధలహరి
యేడుకొండలరాయ దేవూట కావూట
భోగించు పచ్చకప్పురపు తంపు
భ్రమరాంబికాసమర్చా కుంకుమోన్మిశ్ర
పుష్ప చంద్రకితమ్ము బొలుచు చెలువు
శ్రీ కాళహస్తీశ శివతాతి రూపరే
భాస్వద్గనైగనిగ్యముల ఘుంపు

కవితగా, గానముగ, చిత్రకళగ, నాట్య
కళయుగాఁ బ్రతియింట సాక్షాత్కరించి
ఆంధ్రరాష్ట్రంబు మనభాష నలవరించి
యెదుగు గావుత సంతతాభ్యుదయమహిమ.

('తెలుగుతల్లి' అనే సంకలనంలోనిది. సం.ప్ర. తేది 1975)

## తెలుఁగుతల్లి

గుఱ్ఱం జాషువకవి

కృతులందుటకు పల్లకి మోయ దొరఁ కొన్న
కృష్ణరాయఁడు రాజ్యమేలునాఁడు
మనుమసిద్ధియును దిక్కన గన్న కావ్యంబు
కోరచూపులు జూచుకొన్ననాఁడు
తెలుఁగురాయని యొప్పులాలుకు గుప్పిటిలోన
లేఁత కస్తురి గుబాళించునాఁడు
ముత్యాల మందిరంబుల సక్కపులమీద
బంగార మేరులై పొరలునాడు

కవుల పలుకులు వేదవాక్యంబు లగుచు
క్షితితలంబును గంపింపఁ జేయునాఁడు
గారవంబుననన్నేలఁ గాంచవైతి?
తెలుపఁగదవమ్మ! ననుఁగన్న తెలుఁగు తల్లి!

అలసానికులజుఁ డూయెలమంచములనుండి
పసిఁడిలేఖినిఁ బూని వ్రాయునాఁడు
పోతనార్యుని గేహమున భారతీదేవి
చిగురుఁజేతుల వంటఁ జేయునాఁడు
భువన భీకరుఁడు వేములవాడ భీమన్న
గండ్రగాజునకు జోలెఁ గట్టునాఁడు
శ్రీనాథకవి పాండితీ వైభవ సీమ
ఢిండిమభట్టు నోడించునాఁడు

కనులఁ జూచెడు భాగ్యంబు గలిగి యున్న
నేఁడు నాకవిత్వంబు రాణించియుండు
గారవంబున నన్నేల గాంచవైతి,
తెలుపగదవమ్మ! ననుగన్న తెలుఁగు తల్లి!

('ఖండకావ్యము' అనే సంపుటిలోనిది సం.ప్ర. తేది 1956)

# శుభోదయము

జంధ్యాల పాపయ్యశాస్త్రి

ఆంధ్రరత్నమ! మంగళాక్షతల్ పైచల్లి
వయ్య! నీకలలు సత్యమ్ములయ్యె
దేశభక్తా! వచ్చి దీవింపవయ్య; నీ
కోరికల్ రూపుచేకూర్చుకొనియె
విశ్వదాతా! ఇదే వీక్షింపవయ్య! నీ
పడిన కష్టములు సాఫల్యమందె
పూతంద్రి! శ్రీరాములూ! తిన్నగా లేచి
రా! నీతపస్సు సార్థకతఁగాంచె

తాత గాంధీజీ! కస్తూరిమాతతోడ
పుచ్చుకొనవయ్య! అగ్రతాంబూల మీవు
ఆంధ్రజనయిత్రి నూత్న గృహప్రవేశ
మిందురండు! మాస్వాగతం బందుకొండు!

విచ్చేసినారు! కవిత్రయ మ్మల్లదే
రమణీయ సౌవర్ణరథముమీఁద
అరుదెంచినారు! రాయలవారు ముందు వె
న్కల అష్టదిగ్గజమ్ములు చెలంగ
దయచేసినారు! విద్యారణ్య నాగార్జు
నులు శిష్యసందోహములు భజింప
అలరుచున్నారు! నాగమ్మ రుద్రమ్మలు
వీరాంగనలు చుట్టుచేరి కొలువ

ఆంధ్రజననీ స్వతంత్రరాష్ట్రావతరణ
జయమహోదయ మంగళోత్సవము చూడ
తుంగభద్రా తరంగిణీప్రాంగణముల
[illegible]నుకవేసిన ధాలధేషి జనంబు!

ఆరంభోత్సవ మాంధ్రరాష్ట్రమున కళ్యా! గౌతమీ! కృష్ణ! కా
వేరీ! పెన్న! సరస్వతీ! యమున! రావే గంగ! మాయింటిలో
పేరంటం"బని తుంగభద్ర కబురంపింపగ వారందఱున్
చేరన్ వచ్చువిధాన నల్గడ విరాజిల్లున్ ప్రజావాహినుల్.

ఆఱుకోట్ల జనుల ఆనందబాష్పాలు
తుంగభద్ర యగుచు పొంగివచ్చె;
ఆంధ్రరాష్ట్రపీఠ మదిరోహణము సేయ
కన్నతల్లి! కాళ్ళుకడుగుకొనవె!

("ఉదయశ్రీ" అదే సంపుటిలోనిది సం.ప్ర. తేది 1979)

# ఆంధ్రరాష్ట్రము

కొత్త భావయ్యచౌదరి

ఎందఱో మన పెద్దల-యాప్సితంబు
నలుబదేండ్లదీక్షాతపో-ఫలమనంగ
పొట్టిశ్రీరాము బలిదాన పూర్వకముగ
నాంధ్రరాష్ట్రంబు సిద్ధించె నోయయ్య నేడు

ఏ మహాతపస్వి - యీరాష్ట్రసిద్ధికై
ప్రాణములను వదలి - ప్రతిభఁజూపె
నట్టిగుణగణాఢ్యు - పొట్టిశ్రీరాముల
స్మరణ చిహ్న మగుచు - వరలుగాక

దీని వృద్ధికి నిరతంబు - తెలుగువారు
పాటుపడి తమసౌఖ్యముల్ — బదయవలయు
నిందు రాయలసీమంచు - నితరమంచు
భేదభావముల్ సమయించి - యాదరమున

కేంద్ర పాలనమున - కీర్తి వహించిన
నెహ్రూపండితుండు - నీతిఁగఱప
నాంధ్రులెల్ల రాష్ట్ర - మభివృద్ధిసేయగా
బూనుకొంద్రుగాక - ముందు ముందు

('కల్పవల్లి' అనే కావ్యంలోనిది సం.ప్ర. తేది 1958)

# ఆంధ్రరాష్ట్రము

కవికొండలరావు

ఎవ్వరెవ్వారిట్టె కలసిన—తెనుగు నుడువులు తీయమారెడు
తెనుగుపాటలు తేనెగాఱెడు—తెనుగు తలపులు తేటదేఱెడు
వారివారి నివాసభూముల.................................
కేకనామంబిడ దగున్—ఆంధ్రరాష్ట్రం బన దగున్.

కృష్ణరాయల కీర్తికాంతకు—పోతనాదుల పుట్టుకయితకు
త్యాగరాయల రాగసుకృతికి—మంత్ర్యుగంధర్ మంచియుక్తికి
ఆట పట్టయినట్టి భూమికి........ ..........................
ఏకనామంబిడదగున్, ఆంధ్రరాష్ట్రం బనదగున్.

విజయనగరము వెలిగె నెయ్యెడ-వీర బొబ్బిలి వెలసె నెయ్యెడ
రెడ్లపాలన యెసగె నెయ్యెడ-తిమ్మ జగపతి తెలిసె నెయ్యెడ
అయ్యెడ కుబేరమరునట్టుగ... ...... ..........................
ఏకనామం బిడదగున్-ఆంధ్ర రాష్ట్రం బనదగున్.

రుద్రమాంబారూఢి శక్తికి-మల్లమాంబామానరక్షకు
మొల్లవెంగమ ముగుద పలు! కు-కన్యకామణి గౌరవమునకు
పుట్టినిల్లయి పొదలుదానికి.... ..............................
ఏకనామం బిడదగున్ - ఆంధ్రరాష్ట్రంబనదగున్.

చిలుకనర సొళ చెలుక మీరంగ-పఱద గౌతమి పాయదీయగ
తుంగ భద్ర తరంగ మెచ్చ -కృష్ణవేణి నృత్త మమరగ
నిండువంటల నెగడునేలకు ....................... ... . ....
ఏకనామం బిడదగున్-ఆంధ్రరాష్ట్రం బనదగున్.

భరతఖండం పఱగనొక్క చె-ద్రవిడులాంధ్రులు తలప నొక్క చె
అయిన నామది సట్టె చూడగ-నాత్మజాతీయంబు వర్ధిల
నమర్చు సీమకు నాత్మనామం......... ........ . ...... ....
దేశనామం విడదగున్-ఆంధ్రరాష్ట్రం బనదగున్.

('కవికొండల వేంకటరావు గీతాలు' అనే సంపుటిలోనిది సం.ప్ర.తేది 1961)

## ఆంధ్రగీతం

కవికొండలరావు

ఆంధ్రమన్న ఆనందం।—తెలుగుఅన్న క్రొత్త వెలుగు।
గాలిపే సుజాతి యియ్యది।—తెలిపే సంస్కృతి యియ్యది।
ఇది యొకప్పు డెల్లలేని—సామ్రాజ్యం। దీని కళలు
ఏలినాయి। ముల్లోకాల్। మాభాష శిరీషకుసుమపేశలం।
మా భావ మపూర్వం, మార్దవం—మధుర గర్వమన మాదే।
రాష్ట్రము రాదన్నా-రాజ్యము లేదన్నా
గుడిసెకు నిట్రాటెత్తి-నిలబడివుండేవాళ్ళం।
అడిగికొంచు రోజు లింక—గడుపబోము; విడువబోము
మా జెండా విప్పి, దాని—నీడక్రింద నిలిచి తలచి
గడప గడప పసుపు గడప-చేసి చేరి కొలుచువార
మాంధ్రమన్న ఆనందం। తెలుగు అన్న క్రొత్తవెలుగు।

('కవికొండల వేంకటరావుగీతాలు' అనే సంకలనంలోనిది.
సం.ప్ర. తేది 1961।

# తెలుగుసీమ

దుగ్గిరాల బలరామకృష్ణయ్య

కాకతీయుల-కదన శౌండిరి
విచ్చి మండిన - వీర భూమిని
తెలివిగద్దను - తెలుగు సీమను
జగతిఁ - జాటర తమ్ముఁడా! 3 (పపద్యం)

కృష్ణరాణ్మణి - యుష్ణరక్తము
వీరరసమయి - వెల్లి విరిసిన
వీరభూమిని - తెలుఁగు సీమను
జగతిఁ జాటర తమ్ముఁడా! 4

కృష్ణరాయల - కీర్తిలతికలు
తీగసాగిన - దివ్యపథమును
తెలివిగద్దను - తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముడా! 5

రామరాయల - రాజ్యవైభవ
మతుల శోభల - నలరి యుండిన
తెలివిగద్దను - తెలుగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా! 6

త్రుళ్ళిపొంగెడి - తుంగభద్రను
అరుల నెత్తురు - వరదఁ జేర్చిన
తెలివి గద్దను - తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా! 20

ధర్మవీరప్ర - తాపరుద్రుని
రాజ్యపూజ్యత - రమణఁగాంచిన
తెలివిగద్దను - తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా! 2

అగ్గలిక్కన - గండుమగఁటిమిఁ
గత్తిప్రేటుల - గనలి పోరిన
తెల్లివిగద్దను - తెలుఁగు సీమను
జగతిఁ జాటర తమ్ముఁడా! 28

రాణి రుద్రమ - రమణ మీఱఁగ
రాజ్యమేలిన - రమ్యభూమిని
తెల్లివిగద్దను - తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా! 29

ఆంధ్ర పౌరయ - ఆంధ్రవెల్గుమ
ఘనత బెబ్బులి - యనఁగఁజెలఁగిన
తెలివిగద్దను - తెలుఁగుసీమను
జగతిఁజాటర తమ్ముఁడా! 36

వీరమాతగ - వెలుగు నింపిన
మల్లమాంబకు మాతృదేవిని
తెలివిగద్దను - తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా! 41

తిమ్మరుసు రణ - ధీరనీతుల
రంగభూమిగఁ - బ్రబలి కెక్కిన
తెలివితేటల - తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా! 42

మాన్యులక్కన - మాదనాదుల
ధీవిశేషుల - దివ్యమంత్రుల
నెలమిఁ బెంచిన - తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా! 5

వరచళుక్య - నృపాల చంద్రుల
ప్రబలవైభవ • పత్తనంబయి
కలిమిఁ గురిసిన • తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా! 56

బౌద్ధకళలకు • బౌద్ధవిద్యకు
నిలయమగుచును - నెగడియుండిన
లలిత భూమిని - తెలుగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా! 58

భక్తి రసమును వసుధఁ జిలికిన
రామభక్తుని • రామదాసుని
తెలఁగు తల్లిని - తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా! 5

గానవిద్యకు - గదలియనఁగను
గ్రాలు త్యాగయ - కన్నతల్లిని
లలితమూర్తిని తెలుగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా! 60

సుకవయిత్రికి - సుదతి మిన్నకు
మొల్లదేవికి - ముద్దుతల్లిగ
గులుకుధన్యను - తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా! 61

భక్తహృదయము - పల్లవింపఁగఁ
గవిత లల్లిన - మనుని పోతన
కలమునడచిన తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముడా! 62

ముక్కుతిమ్మన - ముద్దుపలుకుల
తియ్యఁదనముల - తేనెసోనల
తేటలొలికిన - తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా! 63

పసిఁడినిగ్గుల - నెసఁగుకైలికిఁ
తటిమఁగూర్చిన - భట్టుమూర్తిని
నెలమిఁగాంచిన - తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా! 64

విశ్వనీతుల - విపుల కవితలఁ
దేటతెనుఁగులఁ - దిద్దితీర్చిన
దివ్యవేమన - తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా! 64

హాస్యరసమున - నారితేరిన
రమ్యకవివరు - రామలింగని
ధీరహూతను - తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా! 66

కవిపితామహ - గణుతికెక్కిన
ముద్దుకైతల - పెద్దనార్యుని
కళల వెలిఁగిన - తెలుఁగు సీమను
జగతిఁ జాటర తమ్ముఁడా! 67

సుధను గురిసెడి - మధురకవితల
సొబఁగు తెలిపిన - సూరనార్యుని
తెలివి కిరవగు - తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా! 68

ప్రౌఢకావ్యపు - బాకరసమున
దొప్పదోఁగుచు - నొప్పుధూర్జటి
నిలను సాకిన - తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా! 69

పాలతీపియుఁ - బూలపొలుపును
కలిపి సులలిత - కవిత లల్లిన
తిక్కనార్యుని - తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా! 70

స్వేచ్ఛఁ జెలఁగుచు - జెలువుఁ జిల్కెడి
జిలుఁగుకైతల - సిరులనాథుని
జెలిమిఁ బెంచిన - తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా! 71

ద్విపదసరకల - తెగువుఁ జూపు న
భంగకవివరు - రంగనాథుని
పలుకు లొలికిన - తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా! 72

రామచరితము - రమ్యకవితల
వ్రాసిమించిన - భాస్కరాఖ్యుని
దిద్దితీర్చిన తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా! 73

చారుపదయుత - సరసకవితల
వినుతిఁ గాంచుచు - వేంకటాఖ్యను
వెలుఁగు కవిమణి - తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా! 74

కళల జిగిబిగిఁ _ దెలియ కవిమణి
విబుధమూర్తిని - వీరభద్రునిఁ
గలిగి యెసఁగిన _ తెలుఁగుసీమను
జగతిఁజాటర తమ్ముఁడా! 75

ప్రౌఢకవితల - వ్రాసికబ్బపుఁ
బదతిఁదనిపిన - పాపరాజును
జెలిమిఁబ్రోచిన - తెలుఁగుసీమను
జగతిఁజాటర తమ్ముఁడా! 76

భావబంధుర - భవ్య కవితల
రవణఁగప్పిస - రామభద్రుని
పలుకు విరిసిన - తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా! 77

వాఙ్మయంబును - వన్నెవన్నెల
తళుకుబెళుకులఁ - దనరఁజేసిన
తెలివిగనియగు - తెలుఁగుసీమను
జగతిఁజాటర తమ్ముఁడా! 82

దేవవాణిని - దివ్యటీకల
నవ్యపణతుల _ నడపిరంజిలు
ధీరవిదుషిని - తెలుఁగు సీమ ను
జగతిఁజాటర తమ్ముఁడా! 83

లలితకళలకు - తెలుపుఁదొడగుచు
రసముఁగూర్చుచు - రక్తిఁగొలిపిన
వెలఁదిమిన్నను - తెలుఁగుసీమను
జగతిఁజాటర తమ్ముడా! 84

నాట్యకళలకు - నవ్యరీతుల
మెఱుఁగు నెట్టిన - మేటితల్లిగ
వెలుఁగు పూజ్యను - తెలుఁగుసీమను
జగతిఁజాటర తమ్ముఁడా! 85

దేశభాషలఁ - దెలుఁగు లెస్సని
కృష్ణరాణ్మణి - కీర్తి సేయఁగఁ
బులకరించిన - తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా! 89

చిత్రకళలకుఁ - జేతిపనులకు
సకలవైభవ - సదనమగుచును
పొలుపారిన - తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా! 91

విజయపురమున - వినుత విబుధులు
కావ్యమూర్తులు - గండు జోదులు
కలిసియాడిన - తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా! 93

శాలివాహన - శకమునదకలు
ఆంధ్రవిష్ణుని - యమరరచనలు
తొలకరించిన - తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా! 97

కృష్ణగౌతమి - లెలమిఁ బాఱుచు
పాడిపంటల - పసలఁ బెంచఁగ
వెలుఁగుతల్లిని - తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా! 101

తుంగ భద్రయ - భంగగతులను
పొంగి పొరలుచుఁ - బొగడుపదములఁ
గులుకుసాధ్విని - తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా! 102

ఎంతపాడిన - నెంతపొగడిన
నంతుదొరకని - వింతపనులకుఁ
దెన్నుఁ దీసిన - తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా। 105

దిక్కు దిక్కులు - పిక్కటిల్లఁగ
విశ్వజనులకు - విశద పడఁగను
దెలుఁగు ఘన తను - దెలుపుదక్కను
ప్రోగఁజేయర తమ్ముఁడా। 106

తెలుఁగు రోషము - తెలుఁగు చేవయు
దెలుఁగు తెగువయు - దెలుఁగు బలిమియు
వెల్లివిరియఁగ - వీర ధర్మము
తెలిసి నడవర తమ్ముఁడా। 108

తెలుఁగు పౌరుష - దివ్యకాంతుల
దిక్కులన్నిఁట - ద్రిమ్మరించుచుఁ
గార్యశూరత - కరలు కొనఁగను
గదలిరమ్మిఁక తమ్ముఁడా। 109

తెలుఁగుసీమను - దేశమంతటఁ
జాటుటన్నను - జచ్చుదేయని
తెలిసి మాతకు దలను గాన్కగ
నిచ్చివేయర తమ్ముఁడా। 111

మాతృదేశము - మానహానికి
లొంగి దానిగఁ గ్రుంగిపోవుచు
నున్నవేళను - గన్నువిప్పవె?
ఎంతసిగ్గుర తమ్ముఁడా। 115

గాంధిదేవుఁడు _ కన్నతల్లినిఁ
గాచుకొఱకయి _ ఘనతఁగంకణ
ధారియగుచును _ దరలుచున్నను
నిద్రయేలర తమ్ముఁడా! 117

పూర్వ పురుషులఁ _ భూరి కీర్తికి
మచ్చగలుఁగఁగ - మందమతివయి
భాగ్యహీనత - బానిసీఁడుగ
నుండుటొప్పునె తమ్ముఁడా! 121

తెలుఁగు బాలుఁడు _ ధీరుఁడను నుడి
దేశమంతటఁ - దెలియునట్లుగ
మాతృరక్షణ _ మహితపూజకుఁ
బలిగనివ్వర తమ్ముఁడా! 126

## ఆకాంక్ష

తెలుఁగు పురుషులు _ తెలుఁగు పడఁతులు
ధీరమతులయి _ శూరవరులయి
మాతృ దుఃఖము _ మాన్పఁబోరెడి
మేటిజోదులు గావలెన్.

('తెలుఁగుసీమ' అనే ఖండకావ్యంలోనిది. నం.ప్ర. తేది 28.10.1932)

## ఆంధ్రసోదరా

పి. వేంకటహనుమంతరావు

ఆంధ్రదేశమ్మతి పవిత్రం
ఆంధ్రమాతను పూత చరితను
అంతరాత్మలో భక్తిశక్తితో
అరసి కొలువర సోదరా।

తీక్ష్ణమైనది ఆంధ్రతేజము
ఉష్ణమైనది ఆంధ్రరక్తము
ఉగ్రమైనది ఆంధ్రక్షాత్రము
ఉర్విఁజాటర సోదరా।

నవీన గరిమా త్యాగ మహిమా
మంత్రశక్తి తంత్రయుక్తి
మనకు కద్దని మనకు హెచ్చని
మహిని దాటర సోదరా।

ఆంధ్రభాషామధుర తమమని
ఆంధ్రకవితా అమర సుధయని
వివిధదేశాల్ వినుతి సలిపే
వితము జూడర సోదరా।

కులం మతం క్రుంగఁదీయని
వర్గకలహాల్ లొంగఁదీయని
పేద వారల పిండ బోవని
చాటవేయర సోదరా।

తెలుఁగు మాటకు తిరుగులేదని
తెలుఁగు దీక్షకు కొదువలేదని
తెలుఁగు బాటే వెలుఁగు బాటని
తెలియఁ జాటర సోదరా!

పరువు ప్రతిష్ఠ పాడు చేసే
నీతి జాతి కూలద్రోసె
హద్దూపద్దూ నధిగమించే
అహము మానర సోదరా!

('కాలము కొట్టిన గంటలు' అనే సంపుటిలోనిది సం.ప్ర. తేది 1967)

# స్వాతంత్ర్యచంద్రిక

విశ్వనాథ సత్యనారాయణ

విశదంబైన ప్రకాశభావమెసఁగన్ విచ్చెనెనేకాదశీ
శశిబింబాంద్రనవాంశువుల్ జలధరచ్ఛాయానిరాసక్రియా
కుశలంబుల్ నిశియెల్లనుం బగటివెల్గున్గాఁగ నాశాధ్వనీ
సిశరత్కాశసుమా శమంజరులు మింటఁదోరణాల్గట్టగన్.

రాజకళయెల్లదమయందె రాజిలంగ
శారదిక తారకా ప్రజాస్వామికముగ
వెలివచ్చిన జిల్గువెన్నెలల ప్రాత
కలక తేరెను దెల్గుమాగానిచేలు

విశ్వనాధుని తనూవిభవముగ్ధచ్ఛటా
వళులతో వెన్నెల వత్తులాడి
శంకరాచలమహాసానుప్రదీప్తని
ష్కుటములన్గుజ్జనగూళ్ళుమెసవి
విప్రయోగాన లావృతచకోరప్రాణ
స ంజీవకాంతుప్రసారమొలసి
యింద్రియాతర్పణాకృతి శైత్యసామ్రాజ్య
పట్టాభిరామమై పరిఢవిల్లి

ప్రౌఢ సస్యగోపాలక పాలకంబు
వెన్నెల ప్రకాశమియ్యది విస్తరిల్లి
తెలుఁగు మాగాణముల నాకు టివెమదుల
లవ టింటి కామనోజ్ఞ విలాసమొప్పె.

జయ కృష్ణా గోదావరి సాధువారి పరిపాలిత
జయపినాకినీసభంగ జలజతరంగ పరితోషిత
జయమహేంద్ర తనయా జలసంవర్ధితదేశాంచల
జయసర్వ మహానదీకృత సస్యసంపదున్మీలిత।
జయకవిత్రయోజ్జ్వల తర సాధుశిల్ప పరిపాలిత
జయశ్రీశ్రీకృష్ణరాయసారస్వత పరితోషిత।

జయతంజాపురీ మధురాసరస కావ్యసమున్మీలిత
జయసర్వ మహాసుకవీశ్వర కావ్యసమున్మీలిత
జయజయనాత్యుష్ణశీత శాంతావని భాగరమ్య
జయతీవ్రావేశమహాశాంతభావయుత జనతా।

జయ దివ్యమహాద్వైతస్వచ్ఛ భావసందీపిత
జయనానాద్వీపపూర్వసామ్రాజ్య మహాచరితా।
జయ జయ జయ వేదకాలసంవేదిత దిక్పురంధ్రి
జయ జయ జయ సకాలాంధ్రీ।

(అక్టోబరు 1958 'భారతి' మాసపత్రికలోనిది)

# విశాలాంధ్రము

తుమ్మల సీతారామమూర్తిచౌదరి

ఓరుఁగంటి సీమయోరియాలు కన్నదు
లఱవలాఁచికొన్న యాంధ్రభూమి
మధ్యరాష్ట్రమునఁగు మూరిల్లు నీ గద్ద
లేక నీ పతాక లెన్నయగునె!

దాప చినిఁగి చినిఁగి చదరైనటుల్ బరం
పురములేని చెన్నపురము లేని
రాచకొండలేని రాష్ట్రంబ వచ్చె నీ
సొగసె చూచి పొంగి సొగసిపోకు

కమ్మమెట్టోరుఁగల్ తెలంగాణమెల్ల
నీదిరా, గోలకొండ నీ[illegible]దురా, త్రి
లింగ జగమోయి! కోలారు బెంగుళూరు
నేల నూలూరు వేలూరు చెన్నపురము

లోకవిశ్రుతులౌ మన కాకతీయ
తెలురాజ్యమురా బన్త, రెఱిఁగియుండు
వాంధ్రతాముద్ర పంపినలాడు నిమ్ము
నాగ పురాశ్రితమ్ము 'చండా' స్థలమ్ము

నడుము కట్టవోయి! నా తమ్ముడా! విశా
లాంధ్రమునకు భాగ్య కేంద్రమునకు
నిన్ను బెరసినడువ నున్నారు సోదరుల్
గోలకొండ వారు కోటి మంది.

వరులకు లొంగి భంగపడు భారతజాతి స్వతంత్రయై జగ
ద్గురుత వహింపఁగంటిఁగనుఁగొంటిని రాష్ట్రమురాక నాకిఁకన్
గొఱఁత యొకండ నిల్చి కలఁగున్మది : యా సకలాంధ్ర ఖండముల్
బెరక్షినఁగాని తేఱదది; పెంపిదినూచు ముహూర్తమెప్పుడో!

"మా తెలంగాణమును బృథక్క్షేత్రనమ్ముఁ
జేయు" దని పల్కువారు నేర్చినదె చదువు
ముగ్గురే నల్గురే యట్లు మొగ్గిరనుట
కాదు–రావచ్చునా, యిట్టి కటికిమోఁత

చూతును బృహదాంధ్రము-నెవ
రే తంత్రము పన్నినను జయింతును దెనుఁగుం
గేతనములు దాండా–గుడి
యాతములన్ నాఁటి నాఁటి నలరింతుఁజుమా!

('ఉదయగానము' అనే సంపుటిలోనిది సం.ప్ర. తేది 1979)

# తెనుగునాడు మనది జననాడు

కాళోజీ నారాయణరావు

ఆనాడూ ఈనాడూ ఏనాడును లోటు లేదు
వ్యక్తి వ్యక్తి స్నేహానికి మనిషి మనిషి శ్రేయానికి
సర్వజనుల సౌఖ్యానికి భారత సౌభాగ్యానికి
ఆ ఈనాడుల మధ్య లంకె కుదిరి మెలగునాడు
ఆంధ్రుని అభ్యుదయానికి ఏనాడును లోటులేదు.
ప్రకృతిమాత ఆర్ద్ర హృదయ
కరువు కాటకాలతోడ ప్రజలు తల్లడిల్లుచుండ
ఆమెకు నిద్దురపట్టదు।
ప్రకృతిమాత ఆర్ద్ర హృదయ
పుడమి పాప వసికోటికి అందగచేసెడి చన్నులు
ఆర్ద్రత పైకుబికిపొంగు కొండల రొమ్ముల తిన్నెలు:
తిండి కరువు రూపుమాపు
పాడిమన్ను విత్తనాలు
కర్రు పదునుగల కాపు
కండరాల చెమటజాలు
ఏ దేదని వెదకికొనుచు సహ్యాద్రి గుండెపగుల
యుగయుగాలనుండి కృష్ణ కడుపు చెరువుగా ఏడ్వగ
కడలిదాక ఒకే ధార.
యుగయుగాల తృష్ణతోడ దరిదాపుల పుడమితాను
మాగాణిగ మారలేక నెర్రెల నిట్టూర్పులతో
మండుగాలి నింగిదాక।

లోయల్లో చేరిదూరి డొంకల్లో దాగిపారి
వ్రరల్లో గంతి పాకి అర్థమైన గట్లుదూకి
అయ్యో! నాజీవనమ్ము వృథ్కారాల తీర్థాలక!
అయ్యో! నా తీరమంత అపరకర్మకాండకేనా!
అని ఏడ్చెడి కృష్ణనీరు ఇన్నినాళ్ళ కడలిపాలు.

మున్నీటిని చేరనీని ఆనకట్ట వుండెనాలు
జీవనదుల పారునీరు సస్యాలకు చనుబాలు.
ఈనాడో ఏనాడో వేలాది ఏండ్లక్రింద
ఆగుట్ట ఈగుట్ట సాగి కలిసి నిలచినట్లు

కట్టలు పోసెను ఆంధ్రుడు, పాకాల లఖ్నారం
రామప్పవంటి వెన్నొ సాగరాల లోతు చెల్ల!
పట్టుగుణమో! మట్టిగుణమో!
నీటిగుణమో! గాలిగుణమో!

అన్నపూర్ణ నామాంకిత ఆంధ్రావని సౌభాగ్యమో
సేద్యమంటె సంబరపడు కాపుబిడ్డ తెలుగువాడు
చెట్టుకొట్టి, మెట్టతవ్వి, కంప పొదల నరికి కాల్చి
పుడమి దున్ని పండించిన మొదటివాడు తెలుగువాడు

వనరులున్న నాడొక్కడె పుడమి కరువు తీర్చగలడు
శ్రీరాములు ఆత్మార్పణ చరితం భారతి శ్రీమతి
మాటమ్మను కొలువ దిచ్చి చేర్చగలదు, సత్తికి వరపతి
రకరకాల సభ్యతల ప్రభల వెలయు భాగ్యనగరి
శక్తుల దోసిళ్ళ నిండు మార్గశీ పులగంతో సరి.

ఎదవరుసు కంటి పరువగం బీదలు పడు పాటలా
నుదులంటి తేటతెల్ల మెరిసించెడి పనిపాటలు
భారమును చేతజేసు నోపిక లశరి చేతులు

ఏండ్లు పూండ్ల కట్టడితో గుట్టల వరుసగ గట్టిన
ఆనకట్ట ఫలితంగా రససిద్ధుని నాటి కలలు
నిజము చేయ బూని
నాగార్జున సాగరమై వెలయుచుండె కృష్ణవేణి
ఆకలితో ఆకులపడు పని లేదిక
భారతాంబ తిరిపమెత్తు పని లేదిక

తెలు గన్ని విర్రలను గరిపెడు దానగా అయిన నాడు మనది తెలుగునాడు
స్వేరరై నిట్టూర్పునేల చేరరు గూడలేనినాడు మనది తెలుగునాడు
పనిధాంగళకు బ్రతుకు తెరువులిచ్చియు: అందు అయినవారు మనది తెలుగునాడు
పనిమంతు లెవ్వరును ఏ లేమికిని గురికానినాడు మనది తెలుగునాడు
భారతావని ప్రగతి బాటవా బలముతో పెంగునాడు మనది తెలుగునాడు
ఆంధ్రాభ్యుదయమ్ము అందరమేలు గన్ననాడు మనది తెలుగునాడు
దేశమంటే మట్టిగాదు మనుషులు అన్న మొదటినాడు మనది తెలుగునాడు
మనిషి మనిషిగ బ్రతుక ఏలు సౌకర్యమ్ము ఉన్ననాడు మనది తెలుగునాడు
బ్రతుకు మంగళసూత్రబద్ధ ఐకమత్యమై వెలయునాడు మనది తెలుగునాడు
తెలుగునాడు మనది మనది ఉనాడు వేరు వేరగునాడు వేరు ఉనాడు
కొదువ పుణ్యమ్ము, గొడవకు తావులేదు, ముదము మురిపము పల్లాం సంబరము

అన్నపూర్ణమ్మ మన ఆంధ్ర పూర్ణకుంభ, సుజలసస్యశ్యామలంబు.
లో దే మున్నది
ఆంధ్రుల అభ్యుదయానికి
భారతి సౌభాగ్యానికి
లో దే మున్నది:
కలిసి నిలిచి గర్వముగా శిరమునెత్తి అందామా నింగి దద్దరిల్లిపోగ
కలిసి నిలిచి భక్తిలోడ గళమునెత్తి పాడుదామా: పాడుదాము.

వందేమాతర మని
సుజలాం సుఫల మ్మని
సస్యశ్యామల మ్మని
వందేమాతర మని
పాడుదాము పాడుదాము
తెలుగునాడు మనది జననాడు
"జైహింద్"
వందేమాతరం.

('తెలుగుతల్లి' అనే సంకలనంలోనిది. సం.ప్ర. తేది 1976)

# సుదూరాన




కదలవోయ్ ఆంధ్ర కుమారా!
నిద్రవదలవోయ్ నవయుగం
నిర్మింప సాగవోయ్!
కదలవోయ్ ఆంధ్రకుమారా!

అదిగదిగో రేయిపోయి
వేగుచుక్క వెలిగెనోయ్
సుదూరాన విశాలాంధ్ర
విజయవాణి పిలిచెనోయ్ ॥క॥

ధనగర్వం తగదని
కుటిలత్వం చెరుపనీ
జనులంతా ఒకటనీ
జగమంతా చాటవోయ్ ॥క॥

వరదలెన్ని వచ్చినా
కరువు లెంత హెచ్చినా
నిలిచి నిగ్రహించవోయ్
నీధైర్యం విడువకోయ్ ॥క॥

కారుమొగిలు దారుకొసల
కాంతిరేఖ చూడవోయ్
కలహాలను విస్మరించి
శాంతిగీతి పాడవోయ్. ॥క॥

('తెనుఁగు తల్లి' అనే సంకలనంలోనిది. నం.ప్ర. తేది 1975)

## ఆంధ్రాభిషేకమ్ :

రాయప్రోలు సుబ్బారావు

జయస్తే విశాలాంధ్ర జననీమతల్లికా!
శ్రియస్తే తెలంగాణ చికురసమమాలికా,
ముక్కోటి కులదీపముఖముల్ నివాళింప
అఖిలజన శ్రీచక్రమభయముద్ర వహింప
భద్రపద పుణ్యాహవాచనము శ్రుతినింప

పరిథవిల్లినది నీ
పట్టాభిషేకంబు ॥జయస్తే॥

గౌతమీ కరవీచికలు పతాకలనెత్త
వనుపురానులు చెఱకు పాలు పంచగ కృష్ణ
తుంగభద్రా పూర్ణ మంగళోదకముతో

సాగినది నీరాష్ట్ర
సంప్రతిష్ఠాపనము ॥జయస్తే॥

శాతవాహనుల శాసనశిలల్ పలుకంగ
కాకతీయ రథాలగణగణల్ వినబడగ,
చాళుక్య పర్వాలు జయభారతముపాడ.

సమకొన్న దాంధ్ర భా
షారాష్ట్ర కల్పంబు ॥జయస్తే॥

కవుల వాగమృతంబు - గాయకుల స్వరమధువు
చిత్రరంజనరక్తి - శిల్పరూపణశక్తి
మిళితమై స్మృతిలోన పులకించి పలపింప

జరిగినది నీ రాష్ట్ర
జన్మోత్సవ శుభంబు ॥జయస్తే॥

నాగార్జున రసాయన రహస్యములు తేల్చి,
హాలకవి శృంగార మాలికలు సిగదాల్చి
రుద్రమ్మ పౌరుషారుణసూక్తము రచించి

రాణించెగా తెనుగు
రతనాల నడిగడ్డ ॥జయస్తే॥

నాల్గుకోట్ల మహాంధ్ర నాగరిక జనకాంక్ష,
నలుబదేండ్ల నిరూఢబలవ దుద్యమదీక్ష,
ఈడేరినది ఆంధ్రు లేకీభవింపండి.

ఇరుగు పొరుగులు నచ్చ
హితులు సహితులు మెచ్చ
ఈడేరినది ఆంధ్రులేకీభవింపండి. ॥జయస్తే॥

వేవేండ్ల కామ్యమిది పూయవలె పండవలె,
ప్రజాక్షేమమునెంచి పక్షకక్షలు డించి,
నడపండి రాష్ట్రతంత్రము ముళ్ళుపడకుండ

దేశప్రతిష్ఠల్ ప్ర
కాశంబు కావాలె
నడపండి రాష్ట్రతంత్రము ముళ్ళుపడకుండ

జయస్తే విశాలాంధ్ర జననీమతల్లికా
శ్రియస్తే తెలంగాణ చికుర నవమల్లికా.

('మిశ్రమంజరి' అనే సంపుటిలోనిది. సం.ప్ర. తేది 1968)

# విశాలాంధ్రము

వేమల సత్యనారాయణ

నీలి మబ్బులరాయునీలగిరీంద్రమ్ము
        పాదపీఠమ్ముగా పాదుకొల్పి
పసిడి మువ్వలమ్రోత లెనగు తరంగాల
        గౌతమి మొలనూలుగా ధరించి
సౌరుమీరిన వంశధారా ప్రవాహమ్ము
        ముత్యాల గ్రైవేయముగ వహించి
చిలుక సంద్రము ముఖశ్రీ జూచుకొనెడి కెం
        గేలి యద్దమ్ముగా గీలుకొల్పి

అమ్మ హేంద్రాచలము కిరీటమ్ము వెట్టి
యొరగుదిండుగ తూర్పుసాగరము నాని
నాల్గుకోట్ల యనుంగు సంతానమేలు
మా మహాంధ్రమాతకు ప్రణామమ్మొనర్తు!

తరతరాల దాస్యతమము తొలగించిన యీ తొలివేకువ
ప్రాగాశాపాలసీమ స్వాతంత్ర్యారుణతిలకము
పొడుపుగెంపు గుడికట్టుచు శోభిల్లిన యీ శుభవేళను
పుడమి ప్రాకు పురుగు కూడ ఎఱకలెగిరి యెగురులాడు!

ఉత్సాహ మహోదయమున ఉత్సవ సుమూహూర్తమ్మున
పీడకలల పాడునిదుర తేలిపోయి తెలివిగన్న
నరనారీ సందోహము నాల్గుకోట్ల సంతానము
నవజీవవికాసముతో ప్రవిమల చైతన్యముతో

మాలాకుసుమమ్ములట్లు కేలుకేలు గీలించుక
సకలాంధ్రమ్మొకరాష్ట్రము సలిపి తీరవలెనంచును
ఒకేసారి ఒకేదారి సాగిపోవు సమయమ్మున
ఓ మా ప్రియజననయిత్రీ! ఓ సువిశాలాంధ్రధాత్రీ!

నీ పురాతనౌన్నత్యము నీ యద్యతనాభ్యుదయము
గర్వమ్ముగ వినుతింతుము పర్వమ్ముగ వినిపింతుము!
నీ కృపా ప్రసన్నదృష్టి నీ యాశీః కుసుమవృష్టి
విరియింపుము వెలుగుతల్లి! కురియింపుము. వెలుగుతల్లి!

మగదేశ్వరుని కోట మొగలి గోపురముపై
ఆంధ్రధ్వజము నాట్యమాడినపుడు
చెక్కిన శిలకెల్ల జీవమిచ్చిన యాంధ్ర
శిల్పమ్ము కృష్ణ ఘోషించినపుడు,
నన్నయ్య భారతామ్నాయమ్ములో కవి
తాదేవతా వేణువూదినపుడు
అఖిలదేశమ్ముల కాంధ్ర సంస్కృతివోయి
తొలిబిక్షయిడి యాజ్ఞగొలిపినపుడు

శౌర్య శిల్పకళాజ్ఞాన చతురిమమ్ము
చతు రుదధివీచికలు జయ స్తుతులొనర్ప
భారతావనీ హీరకోటీరమట్లు
అలరిన తెలుంగుతల్లి! జోహారులమ్మ!

గౌతమీ సరిదూర్మికా కల స్వనములో
నన్నయ్య హృందాతనమ్ములోన
పెన్నచల్వలగుత్త గొన్న తెమ్మెరలలో
తిక్కన్న పలుకు పొందికలలోన
తుంగభద్రా భంగభంగ భంగిమములో
పెద్దన్న యల్లికబిగువులోన

కృష్ణవేణి మహోర్మికల త్రుళ్ళింతలో
రామకృష్ణుని యొయారములలోన

కత్తిగంటమ్ము లొక్క పోకడల పెనగి
రాచకలికి పచ్చతోరణముగట్టి
యిడిన సుకవిసమ్రాట్టు తిల్లదముసొమ్ము
శ్రీవిశాలాంధ్ర మాతకై సేయుగాత!

బ్రతికున్న దివ్యరూపాల రాలకు గూర్చు
తెనుగు శిల్పుల పనితనము చూచి
పలుమారు సామ్రాజ్యముల నెలకొల్పిన
తెనుగు కత్తుల వాడితనము నెంచి
నాదమ్ముతో చిదానంద రసమ్మొల్క
తెనుగు పాటల తీయదనము తలచి
మున్నీటివాణిజ్యమున పేరుమోసిన
తెనుగునావికుల పెత్తనము తలచి

ఖండఖండాంతరముల యాగంతుకులను
శిష్యులుగ గొన్న వైదుష్య మరసి
తొంటి పేర్వాసి త్రవ్వి యెత్తుటయెగాని
నేటి దైన్యస్థితి కెడంద బీటవారు!

చిక్కులు పెక్కుగా పొరుగు సీమల జిక్కిన యాంధ్రదేశపుం
జెక్కులనెల్ల నొక్కటిగ జేసి పురాతన వైభవోన్నతుల్
దక్కక శిల్ప గాన కవితా ప్రభుతా కరదీపికారుచుల్
దిక్కుల నింద సద్యశము తేవలె తల్లికి యావదాంధ్రమున్.

వండి ముక్కారు క్రొంబసడి పంటలు వసుం
ధరరామ పాదసాగరము పొడిచి
సకల పరిశ్రమాస్థానమై యైశ్వర్య
ఖనిధరారత్న గర్భమ్ము త్రవ్వి

దేశదేశాల శాంతికి చేతి దివ్వెగా
తనరి వేదాంతతత్త్వమ్ము తెలిపి
విలసిల్లి యాంధ్రుల తల భారతమ్మగ
రాష్ట్రాధిపత్య గౌరవము నొంది.

కార్యదీక్ష ఆంధ్రుల సమైక్యమ్ముతోడ
స్వేచ్ఛ ప్రత్యేక రాష్ట్ర సంసిద్ధితోడ
కలిగి ఆసియా కొక వెల్గుకంబమట్లు
తెలుగు తల్లి! ఆకల్పాంత మలరుమమ్మ!

("ముక్తఝరి" అనే గ్రంథంలోనిది సం.ప్ర. తేది 1968)

# మహాంధ్ర

దాశరథి

నాలుగు కోట్ల తెల్గుల మనంబులలోన మహాంధ్రలక్ష్మి దీ
పాలను పెట్టినట్టి శుభవాసర మియ్యది! నూర్లయేండ్ల స్వ
ప్నాలు నిజాలుగా మొలచి పందిరి ప్రాకి సుమాలు పూచి లో
కాలకు సౌరభమ్ములను కాను పెట్టిన రోజు పైదలీ!
అటు పోయి 'కృష్ణ'లో నటనంబులొనరించి సిక్తచేలమ్ముతో చేరరమ్మ.
ఇటుపోయి 'గోదారి' ఇసుకతిన్నెల దూ:
పాదాల పారాణ వైచరమ్మ
అటు 'పినాకిని' కౌగిలింతల తడియైన
వక్షమ్ము పొంగార వచ్చిపొమ్మ
అటు మంజు 'మంజీర' మధుగులగల్గన ఒయ్యారముగ సదలూదిరమ్మ.

కావిరంగు చీరధరించి, కాటుకలువు
పయ్యెద పయిన్ జీర బుటావని సెలంగ
ఫాల భాగాన దీపమ్మువలె తిలకము
వెలుగు లొలికింప రావమ్మ తెలుగు దాన

బ్రతుకు విపంచి మూగవడి పాడకయుండిన తీగ తీగకు
న్నతి గలిగించి, అంగుళుల తాకి పదమ్ములుపాడు మా సర
స్వతివి, మరాళ వాహనముపై నొక మా రిటువచ్చి పొమ్మ, మా
నతులను స్వీకరింపుము శరచ్చర దిందు వపుర్విలాసినీ.
ఓరుగల్లు పురాన నుదయించి గగనమ్ము ప్రాకిన తెల్గు పతాక వీవు,
విద్యానగరమందు విప్పారి వెల్గిన సాహితీ చంద్రమశ్శకులమీవు,
ఇక్ష్వాకు రాజుల కిలు వేలుపై నందికొండనుండిన మల్లెదండ వీవు
కోటవీట సెలంగు దండి వీరుల భుజదండమ్ము దూకిన చండి వీవు

పోతనామాత్య భాగవతాలి మధుర
గీతికలలోన పలికిన కీర మీవు
కవికలమ్మున గళమున చవులు గూర్చు
స్వామినీ! కవితా సరస్వతివి నీవు

నీవు లేకున్నచో నేనేద జగమేది? దారిలేనట్టి యెడారిగాక.
నీవురాకున్నచో భావమంజరులేవి? శిశిర జర్జర వనశ్రేణి గాక,
నీవులేకున్నచో నిత్యయౌవన మేది? వార్ధక భ్రష్ట జీవనము గాక,
నీవురాకున్నచో నింగి తారకలేవి? గాఢాంధకార మేఘమువలెగాక,

అలి సారస్వతోద్యానమందు, పొగడ
పువ్వువలె గుమ్మనెదు నిన్ను పొగడ తరమె
తమ్మ! నా రసనానృత్యరంగమందు
నర్తనము సేయవమ్మ! ఆంధ్రసుకూరి!

తిరుపతి కొండపై తిరిగి వత్తమురమ్మ
శిఖరాగ్ర సితమేఘచేలమూని
భద్రాచలము పొంత వాహ్యాళికైరమ్మ
శ్రీరామ సీతా ప్రసిద్ధ భూమి
శ్రీశైలవనముల చేరిపోదము రమ్మ.
మల్లికార్జును దివ్య మహిమనెంచి
సింహాచలమ్మున చెంగలింతమురమ్మ,
కొండ పల్లెలు మెదనిండదాల్చి

అడుగడుగునందు నందనోద్యానములయి
అంగుళమ్మంగుళమ్ము పుణ్యస్థలమ్ము
గా వెలయు తెలుగునేల శృంగార మొప్పు
తెలుగువన మొల్కవే దశదిశలలోన.

('అమృతాభిషేకం' అనే ఖండికలోనిది)

# మహాప్రభాతము

దాశరథి

ఎన్నినాళ్ళ స్వప్న మిది సత్యమైనది
ఎన్నినోళ్ల పిలుపు కిది జవాబు
నాల్గుకోట్ల వికచనాళీకములు గల
ఆంధ్రసరసి కిది మహాప్రభాతము

రక్తకాంచన తరుప్రతతి శారదవేళ
పూవులతో పొంగిపోయినట్లు
శశికాంత పాషాణచయము వెన్నెలలో
కరగి నీరై కల్వ గట్టినట్లు
చంద్రబాహుద్వయీ సాంద్రోపగూహమ్ము
కల్హారమునకు పులకలిడినట్లు
రాజహంసీ గరుద్రచిత బాలతరంగ
రంగవల్లి సరోజలమ్ము లట్లు

తరతరమ్ముల చీకటి బరువు లుడిగి
వానమబ్బుల కర్దమ పథము కడిగి
నాల్గు చెరగు లొక్కటియైన నాల్గుకోట్ల
తెలుగులోకాన చైతన్య మలమికొనియె.

అగరు సువాసనా ఘుమఘుమాయిత కేశభరమ్ముతోడ, సం
పెగపువంటి ముక్కున సుమించిన అందముతోడ, వాసకార్
మొగిళుల గొంగళీ ముసుగుపోయిన పూర్ణశశాంక చిత్రకం
బగుపడ మోమునన్ మధురహాసమునన్ తెలుగమ్మ వచ్చెడిన్.

ఒకవైపు కృష్ణవేణిక ఉర్వి పర్విబుర్వు
లై సాగి తెల్గింట సేన పెట్ట
ఒక త్రేవ గోదావరికి హర్షలసారికా
నాట్యంబు ప్రసన్నందనంబు కూర్ప
ఒకప్రక్క తుంగభద్రతు దాయ వెన్నెల
కెరటాలు తెలుగు సంబరము చేర్ప
ఒకదారి మంజీర చకపిక నడలతో
తెల్గుతల్లికి తరితీపు సేయ

సుజలయై తెల్గుతల్లి సంశోభిలంగ
సువలయై తెల్గుధాత్రి విస్ఫూర్తి జెంద
బిదరుపురినుండి వంగాబ్ధి వేలదాక
ఏకమైపోయె తెలుగువా రిల్లు నేడు.

ఇక నీకోన్ముఖులై మహాంధ్ర ధరణీ హృష్టాంతరంగోజ్జ్వల
ప్రకటోదార జనమ్ములార కవితా పాఠమ్ము గావింపు, డాం
ధ్రికి పూజాదికముల్ బొనర్పుడు, చిరప్రీహాభారమున్ దుర్చి నిం
గికి తాకన్ తలయెత్తు డాంధ్రధరణీకీర్తుల్ ప్రభాసింపగన్.

వాన తెరలు తొలిచి వచ్చినట్టి మహాంధ్ర
దేవతా కరస్థ దివ్యపాత్రి
తొణికి అమృతధార దోసిటం బడినది
త్రావు డాంధ్ర పుత్రులార! మీరు.

('తెలుగుతల్లి' అనే సంకలనంలోనిది. సం.ప్ర. తేది 1975)

# మహాంధ్రోదయం

దాశరథి

"చిమ్మ చీకటిలో తూర్పు సెమ్మెమీద
దివ్వెయొక్కటి వెలిగించె, రుద్విసావు
వెలుతురుల బాకు నాకాశవీధిలోని
కెవరయ్యా? ప్రగాఢ సాహిత్యమూర్తి!"

"నీవెరుగవె? శ్రీరాముడ
నేను మానవుడనె లెమ్ము!
నిద్రాణాంధ్రధరాస్థలి
నేడు మేలుకొల్పగలను,

వెలుతురు బాకు తాకిడికి
విచ్చిన చిక్కని కాలరాత్రి గుం
డెల జిలు జిల్లునెత్తురుధిర
నిర్ఝరిపారె, దిగంగ నాముఖ
మ్ముల నవ కుంకుమ ప్రభలు
మొల్చెను తామర మొగ్గలట్లు, త
ల్పులు తెరువుండు, రండు,
పిలువుండు శయించిన వారినెల్లరన్
తరుణీ సుందర దంతపట్టనలసత్
తాంబూల రాగప్రభా
స్ఫురణీయాధర బింబమట్టు లదిగో
సూర్యుండు ప్రాచీధరా
ధర కూటమ్ము వయిన్ పదమ్ములిడి
సౌందర్యమ్ము నేకూర్చెను

ర్వరకున్; నిద్దుర లెండు తెల్గు
జనులారా! సుప్రభాతం బిదే"
అని యామానవుడెవ్వడో తెలుగు
పద్యాలందు ప్రాభాత సూ
తన గీతావళి పాడి మేల్కొలుప
నేత్రాల్ విచ్చి తొల్సారి వె
ల్గును దర్శించితి తెల్గుగా, భయద
రాత్రుల్ వోయి ఇన్నాళ్ళ కిం
టిని, ఇల్లాలిని, పిల్లజెల్లలను
గంటిన్ స్వర్గసౌఖ్యమ్ముగా
నా తల్లి కృష్ణవేణమ్మ కన్నీరొత్తి
కొనుచు నాపై ప్రేమ మినుమడించె
గోదావరమ్మ సమ్మోదముతో నాకు
ముఖమార్జనకు జలమ్ముల నొసంగె
తుంగమ్మ తనపైట కొంగుతో నామోము
తుడిచి నిద్దుర భారమడచివేసె
పెన్నమ్మ తన పయః పీయూషము నొసంగి
ఆకలిమంట చల్లార్చివైచె

మూడు చెరగుల నేలల మూడు కోట్లు
ముడివడిన యట్లు కన్నులముందు తోచె
అందలము నెక్కి, యావజ్జీవి మెచ్చ
సుందర విభాత మేతెంచె తొంగరించి

అంధకార శయ్యాగృహ
మందు గురకవెట్టు జగతి
సముజ్జ్వల ప్రభాత పా
త్రమున ప్రభా మధువు గ్రోలె

నిద్దుర మేల్కొనెను జగతి
నిశావిశాల కారాగృహ
నిగళగళ ఘలంఘలలు
నీరవమ్ములయ్యె నేడు.

తెలుగు నింగి దారులలో
వెలుగు పులుగు లెక్కలార్చి
చిమ్మివైచె తరతరాల
చిక్కని చీకట్లునెల్ల

తెలవారుట కన్న నాకు
గల కాంక్ష మరొండు లేదు
ప్రతి మనిషి కరాలు సాచి
శిరమూచి ధరిత్రినేలు

ఎన్నాళ్ళకు తెల్లవారె!
ఎన్నాళ్ళకు కన్నుదూరె
వెలుగు. వెలుగు, వెలుగు, వెలుగు!
తెలుగు, తెలుగు, తెలుగు, తెలుగు!

ఏది కాకతి? ఎవరు రుద్రమ?
ఎవరు రాయలు? ఎవడు సింగన?
అన్ని నేనే, అంత నేనే,
వెలుగు నేనే, తెలుగు నేనే!

అరి శిరస్సుల నుత్తరించిన
అలుగు నేనే, తెలుగు నేనే!
అఖిల జగములు చుట్టివచ్చె
పులుగు నేనే, తెలుగు నేనే
తెలుగు నేనే, వెలుగు నేనే!

నాకు కావలె, నవ శిరీష
ప్రసవ పుంజాల భావగుంఫిత
కావ్యరాజము, నవ్య జగతీ
నవ్యమార్గ ప్రదర్శకము

శ్రమిక హృదయాంతర్మహో జ్జ
జ్వాగ్ని ఉరుకులు పెట్టు దారులు.
కృషికసీర నిశాత ముఖమున
త్రుమ్మినట్టి పొలాల దారులు

తెలుగు ఊరులు
తెలుగువారలు
ప్రతిఫలించే మహాకావ్యం
నాకు కావలె, నాకు కావలె

నాకుకావలె మహాంధ్రోర్వర;
రండి అన్నల్లార! తూరుపు
దారికెదురుగ, ద్వార బంధము;
మనిషి మనిషి మనస్సుదారల
రాగబంధము, రాగబంధము.

ధగ ధగద్దీపికాతత చళుక్య ప్రభా
        ధనులు నాకనుఁలో కనుము, కనుము
రమణీయ కాకతి రాజ్య ఘంటాఘణం
        ఘణలు నాగళములో వినుము, వినుము
వినుము ఢాణంఢణద్ విద్యాపురీరాజ
        భేరీరవమ్ము నా హృదయవీధి
కనుము కాపయ నాయకుని శౌర్య దావాగ్ని
        న్నా లేఖినీ ముఖాంతరమునందు

నా తెలుగు తల్లి దిగ్దిగంతముల దాక
పరచి నట్టి జ్యోత్స్నోజ్జ్వల ప్రభలలోన
పోతనవినుండి మాదాక పొంగి పొరలె
కావ్యవారాశి; కనుము లోకమ్ము నందు

ఈనాడు మహాంధ్రోదయ
మైనది, కోట్లాది జనము
తెలుగులక్ష్మి పాదాలకు
వెలుగుల పారాణిలిడిరి.

("మహాంధ్రోదయం" అనే ఖండికలోనిది)

# మహాంధ్ర

ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి

ఓహో! ఊహావల్లి
రోహత్పులకావళీ నిరూఢానంద
శ్రీ హృదయాంధ్రాళికి ను
ద్వాహోత్సవ మయ్యె నేఁటికౌరా! చూడన్

తీరాంధ్రము, మధ్యాంధ్రము
దూరాంధ్రము చేయి చేతితో గలిపిన యా
నీరాంధ్రాంధ్రావతరణ
ప్రారంభోత్సవ విధమ్ము భావింతుమదిన్

తెలుఁగను కమ్మని యక్కర
ములు పుడమి నెచటనేని పొడగన్నను గ
న్నుల కద్దుకొందు నశ్రులు
జలజల చెక్కుటలరాల సంతోషమతిన్

గడులను గిరిగీతల నె
వ్వడురా! మన బ్రతుకునదిమి వాంఛలఁ జిదుమున్?
ఎడఁద లోక కదలి పొంగె
వెడలిన నల్గడల విజయభేరులు మ్రోగున్.

ఎన్ని గళశృంఖలతతుల మఱెన్ని కంఠ
కహళమ్ముల మధుర కోలాహలములు!
ఏమి! తరతరముల మూఁగనోము సడలి
మూఁడు కోట్ల నోళులు మాటలాడుకొనుచున్!

తెలఁగాణపుఁ బల్లెల య
న్నల తమ్ముల గుండెలిపి నా హృదయములో,
బలుకును వినూత్న రాగా
వలిగాఁడెనుఁగమ్మ ఊర్పువలిపివలిగా

వితత భాగ్యపురాన వినరిన బావుటా
విజయవాటిని వెల్లువిప్పినపుడు
అమరావతీ శిల్పముల యజంతారేఖ
హృదయమ్ము గలిపి వర్తించునపుడు

నాగార్జునాచల సాగరమ్మటు పొంగి
తెలఁగాణమున పైడి దులిపినపుడు
శ్రీరాంధ్ర సుకవితా ధీరవాణులు భాగ్య
పురవీణలందు మ్రోఁగునపుడు

తేరిచూడంగరా యదృష్టదీప్తి
నేల నాలుగుచెఱఁగుల నేలఁగలరు
చెలిమి బలిమిని కలిమిని తెలివిగలిగి
వెలుఁగు నా రేకమతులైన తెలుఁగువారు

మంజీర గోదావరిం జీరికెరటాల
కౌగిళ్ళలోన నేకమయినట్లు
భద్రాద్రి రామయ్య పండునవ్వుల తావి
గోలుకొండను మేలుకొలిపినట్లు

శ్రీనాథ సుకవికీర్తిత పోతనార్యుండ
ప్రణయోత్సకత నవ్వుకొనినయట్లు
కాకలుతేరు కాకతి భూతలేశుండు
ఘనుమసిద్ధిని ప్రేమమనిపినట్లు

కలలు గాంచిన మాకు నిక్కమయి తోఁచె
ని మహాంధ్రోత్సవమ్ములో, నేండ్ల తపసు
పండినది భాగ్య నగరమ్ముపై నెగిరెను
వెలుఁగు రెక్కలువిప్పు తెల్గుల పతాక।

దుర్దినముల్ గతించినవి దూరపు బంధుల నడ్డు సూత్రముల్
నిర్దళితమ్ములైన యవి నేస్తములై మనుదయ్యెఁ॥ భావ న
మ్మర్దనముల్ దొరంగి ఋజుమార్గమునన్ తెనుఁగమ్మ పూజతో
వ్యర్థులు గాక యుండిన సెబాసని మెచ్చవె సర్వలోకముల్।

("దక్షారామము" లోనిది ప్ర. తేది 1971)

# విశాలాంధ్ర

జంధ్యాల పాపయ్యశాస్త్రి

శ్రీశైలమల్లికా సిగమీఁది జాబిల్లి
తీపి వెన్నెలలు చిందినది నేఁడు
అమరావతీ స్తూప కమనీయ శిల్పాలు
నవశక్తి పరిమళించినవి నేఁడు
ఏడుకొండలవాని పైడిఛత్రము కాంతి
దిగ్దిగంతములు నిండినది నేఁడు
సింహాచలస్వామి చెంచుల దొరసాని
విల్లెక్కుడించి నవ్వినది నేఁడు

కాకతమ్మ వాహన మోరుగంటిలోన
చెంగుమని లేచి రంకెవేసినది నేఁడు
హంపి యందలి శ్రీవిఠలాలయమున
కదిలినవి రాతి రథము చక్రములు నేఁడు.

పొంగి పులకించెనేమి త్రిలింగ భూమి:
వెలుగులు వెలార్చినది నేఁడు తెలుఁగునాడు
తమ్ముఁడారమ్ము! అర్ఘ్యపాద్యమ్ము లిమ్ము
చెల్లెలా! తెమ్ము పువ్వుల పళ్ళెరమ్ము!

భాగ్యనగరాన ఆంధ్రుల భాగ్యములను
దిద్దు నేఁడు మోతీలాలు పెద్దకొడుకు
దేశనాయకు "లాంధ్రప్రదేశ"మునకు
ఆచరింతురు పుణ్యాహవాచనములు.

తెనుఁగు జనయిత్రి దోయిలించినది నీకు
భారత సవిత్రి "శ్రీరస్తు" పలుకవమ్మ!
ఐకమత్యమ్ముతోడ ముందడుగు లిడఁగ
తెనుఁగు బిడ్డల ఆశీర్వదింపుమమ్మ!

('ఉదయశ్రీ' అనే సంపుటిలోనిది సం.ప్ర. తేది 1979)

# మహాంధ్రావతరణము

పల్లా దుర్గయ్య

రంగత్తరంగాల కొంగు జెండాలెత్తి
గోదావరమ్మ ఆమోద మొసగ
కలకంఠ లాలికించు కలకంఠ రవమెత్తి
కృష్ణమ్మ మంగళగీతి పాడ
కెరటాల కేలెత్తి చిరుముత్తెములు చిమ్మి
పెన్నమ్మ సేసలు వెట్టుచుండ
శృంగారరస సముజ్జృంభమాణ కటాక్ష
తుంగమ్మ తలయెత్తి తొంగిచూడ

ఆంధ్రరాష్ట్రమ్ము రాజచిహ్నములతోడ
తరలి వచ్చెను కర్నూలు పురము గడచి
భాగ్యనగరికి; ఉస్మాన బల మదేమొ
తేజరిల్లె మహాంధ్ర ప్రదేశ మగుచు.

నాలుగు కోట్ల తెల్గు వదనమ్ములు నల్వది యేండ్లనుండి యే
కాలము కోసమై తెఱవు గన్నులు కాయలుగాయ సంశయా
లోల విలోకనమ్ముల వెలుంగుల దిక్కులు చూచు నా ఉషః
కాల శుభోదయ మ్మగుడు కన్నుల పున్నమ యై రహించెడున్.

తాతలనాటి పంపకపు తప్పున ముప్పు ఘటిల్లి తల్లికిన్
కోతలుగాగ సంతు కని గుంపుల పాలయి చీలిపోవుటన్
లాతి జనుల్ వలెన్ పెనగులాడు దినాలు గతించి చేతులన్
చేతులు జేర్చి యొక్కెడకు జేరు శుభాహము వచ్చె నేటికిన్,

ఊరక మింటనుండి తెగి యూడిపడెన్ ఖువి నీ మహాంధ్ర మం
దారయ రాదు; తమ్ములును నన్నలు పిన్నలు పెద్దలేకమై
చేరి యొనర్చు త్యాగకృషి చేతల నత్పల మద్ది; దీని పెం
పారెడు బుద్ధి దిద్ది విపులార్థయుత మ్మొనరింపగా దగున్.

('తెలుగుతల్లి' అనే సంకలనంలోనిది. సం.ప్ర. తేది 1975)

# సంస్కారధార

సి. నారాయణరెడ్డి

సుప్తాత్మునిలోన బాల
సూర్యుడు మేల్కొన్న యపుడు
మూర్ఛితునికి మరల ప్రాణ
ములు దానము చేసినపుడు
చివుళ్లెత్తు ఒక మహాను
భవము, ఒక రసాత్తరవము
కవి నగు నాలోన నేడు
కనిపించెను వినిపించెను.
ఈ యనుభూతికి, గీతికి
ఏనాడో ఎడారియైన

ఎడద ఒకుమ్మడిగ పాల
కడలియై కరళ్ల ద్రొక్కె
ఎన్నియుగమ్ములు మారిన
పున్నెపు టనుభావ మ్మిది.
దొరలిన మన్మానస
దుగ్ధసాగరోర్ములలో
గొంతులు సవరించుకొనె త్రి
కోటి కచ్ఛపులు మహతులు.

కృష్ణవేణి తన చిర నం
కీర్ణ వేణి కీలబూని
అల్లుకొనుచు నన్ను గాంచి
ఆగిపోయె పులకరించి.

గోదావరి తన పురాని
గూఢ గాథలను స్మరించి
తనలో తా నవ్వుకొనుచు
నను గని లజ్జిత యయ్యెను.

మంజీర నిజామల పద
గుంజన్మంజీరావళి
జీరాడగ వచ్చి నన్ను
జేరి మోము వాల్చుకొనెను.

ధునీ విలాసినీ మణీ
గణము నా సమక్షమ్మున
నిలువగ అపర ప్రయాగ
మొలిచినట్టు లనిపించెను.

అంతట నాలోని సాగ
రాత్మ పొంగులెత్తి యెత్తి
నక్షేత్రయమ్మును గుండెల
కదుముకొనెను గాటమ్ముగ.

ఈ యపూర్వ ఘటనతోడ
ఎగిసి ఎగిసి నా ఊహలు
మిన్నందెను నేనైతి న
పీ చీన మహోరేఖకు
ప్రాచీనాంధ్ర పతాకగ.

కవివత్సలుడైన హాలు
గాథాసప్తశతి నైతి.
శాతకర్ణి భూతలేంద్ర
సమక్షమ్ములో జరిగిన

అగ్న్యాధేయాది మహా
యజ్ఞ హవిశ్శ్రేణినైతి.
అజంతా గుహాసరస్సు
నందు పద్మపాణినైతి.
అమరావతిలో గంధ
ర్వాంగనలకు వీణ నైతి.

పల్లెపట్టులందు మరుగు
పడిన తెల్గు సరస్వతిని
రాచగద్దెపై నిల్పిన
రాజరాజ మూర్తినైతి.
తెల్గుల కౌక దివ్యసంస్కృ
తిని భిక్షగ నందించిన
సనాతనుడు నన్నయ్య ప్ర
సన్నకథాగీతి నైతి.
హరిహరులను ముద్దచేసి
ఆయువులను బోసి జగతి
ప్రతిష్ఠించునట్టి కవి
బ్రహ్మ కావ్యరీతినైతి.

ఇతి నంత రుద్రమ్మక
రాంచల చంచత్ కృపాణ
చకితద్యుతిగా; కాప
య్య కృతోద్ధతహుంకృతిగా,
అంత నైతి రెడ్డిరాట్స
మర్పిత కనకాంబరాళ్య
లంకృతుఁడగు శ్రీనాథుని
ప్రౌఢపద్య ఝంకృతిగా,

పోతన్న సుధాఖండ
స్ఫీత భాగవతకృతిగా.

కత్తిగంటముల నొక్కటి
గా నడిపిన కృష్ణదేవ
రాయ 'భువన విజయ' భవన
రాజ ద్గోపుర మైతిని.

మధురలోన తంజాపురి
వదనములో నర్తించిన
పలుకు వెలది పైడి అంది
యల క్రేంకారమ్ము నైతి.

అర్వాచీనాంధ్ర జగత్
సర్వతోముఖ ప్రతిభా
నిర్వచనము సేయుకవి
జ్ఞాకరపచోముకుర మైతి.

నవాంధ్రావతరణావస
రవిభాతచ్ఛవి నైతిని.
జతిసుమా! నేనే 'నా
గార్జున సాగర' మైతిని.

('తెలుగుతల్లి' అనే సంకలనంలోనిది. పం.ప్ర. [illegible] 1975)

# ఆశయసిద్ధి

సి. నారాయణరెడ్డి

తెల్గు తమ్ముడా నేటిపూట అం
దింతు నీకు ఒక మాట
వెల్గు వెన్నెదుల పేర్చి కూర్చి అ
ర్పింతు నీకు ఒక పాట

గగన పుష్పమనుకొన్న రాష్ట్రమది
కనులముందు వికసించె
శశవిషాణమనుకొన్న ఆశయం
విశాలాంధ్ర సిద్ధించె

ఈ విశాలతను కేవలమ్ము స్థా
నీయమంచు అనుకోకు
ఇన్నినాళ్ళు అనుకున్నచో విమూ
లించు కించపడబోకు

ఈ విశాలత మరేదయందువా?
ఇది మనోగతము సుమ్ము

ఇది అసూయలకు ఇద్దిమాయలకు
ఎన్నొమైళ్ళ దూరమ్ము
దేశమందు ఎందేని లేని వి
ద్వేషవహ్నులు ఈ నేల?

ఒకని ఉన్నతిని చూడలేని కను
లూచుకున్న పని యేల?

ప్రక్క యింటిలో పండుగైనచో
ముక్కువిర్చుకొను వాడు;
ఎంత తొందరగ అంతమొందితే
అంత మంచి దీనాడు.

పాతరీతులను ఒక్కమారు సం
ప్లాదితమ్ములుగ జేసి—
నీతులన్నిటిని ఉతికివేసి గుం
డియల చుట్టుకై నేసి:

భూతకాలమను గోతిద్రవ్వి గుణ
శాతకుంభమును దీసి
నేటి కాలమును నీట మున్గి మం
చి ముత్యమ్ములను దీసి:

తమ్మి పూవులను; తుమ్మపూలనొక
దండలోని కెక్కించి
పేద మానిసికి సౌధవాసికి
భేద భావమును త్రుంచి.

తెల్లవారు మన గల్గినప్పుడే
వెల్గు నాంధ్రదేశమ్ము
అపుడె సార్థక మ్మాంధ్రులందు పొం
గారు అభినివేశమ్ము.

(14 నవంబరు 1956 ఆంధ్రప్రదేశ్ అవతరణ సందర్భంలో వ్రాసినది
'దివ్వెల మువ్వలు' అనే సంపుటిలోనిది సం.ప్ర. తేది 1959)

# యజ్ఞఫలం

సి. నారాయణరెడ్డి

గగనమ్ముపై బిర్ర బిగిసి కూర్చున్న గం
గను నేలపైకి దించిన భగీరథునివలె;

ప్రతి తెల్గువాడు ఉద్ధరిత మస్తకము తోడ
కన్పడెను నవ్యాంధ్ర కల్పద్రుమము నీడ

తల బద్దల్గట్టగా అలనాడు సగరు ము
న్మనుమండు నిర్వహించెను దుర్భరతపమ్ము

బ్రతుకునే ఇంధనప్రతి జేసి మా తెల్గు
వాడు సాధించె నీనాడు యజ్ఞఫలమ్ము

ఇది మన కదృష్టమ్ము ఇది సుధాశ్లిష్టమ్ము
దివ్యాత్మ కులకే సంసేవ్యమానము సుమ్ము

తెల్గునదులందు గుండెలుమున్గ స్నానమ్ము
లొనరించి సాగిరండో శుభ్రమతులార!

అమృతమున కామ్రేడితమునైన ఈ యజ్ఞ
ఫలమారగింప బంతులు దీర్చి కూర్చొనుడు

ఎవరి భాగమువారు అవతరించిన చిత్త
ములతోడ స్వీకరింపుడు సుమ్ము విబుధులై

ఏ పంక్తిలోనే సుధ పొంచెదరు వేలు
పుంవ్రాతలో విషాత్ములు రాహుకేతువులు

చిర తపస్సంప్రాప్త శివఫలమున రేణు
వంత వారికి దక్కెనా ప్రళయమైపోవు

దివిజులెవ్వారొ? రాక్షసు లెవ్వరో ముందె
దీ నికషములపైన తేల్చుకొనుడీ మీరు

అనుభూతఫలులు అమృతాత్మకులు తెల్గు లను
డాకొన్కకడు తపఁటిల్లు దక్కవలె ఋక్కవలె.

ఝరులు కిన్నరులుగా గిరులు మేరువులుగా
అడవి చెట్లన్ని కల్పానోకహతతులుగా
మన సమీకృత విశాలాంధ్ర దేశమ్ము
విలసిల్లు నవ మానవుల స్వర్గసీమగా

(ఆంధ్రప్రదేశ్ - అవతరణ 1956 సందర్భంలో వ్రాసినది.
"దివ్వెలమువ్వలు" అనే కావ్య సంపుటిలోనిది. సం.ప్ర. తేది 1959)

# ఐక్యలింగము

వానమామలై వరదాచార్యులు

అదో నవంబరు ఒకటి నవాంబరమ్ము
దాల్చె ఆంధ్రావనీమాత తక్కినట్టి
కోటి కొమరుల నాదిచేర్చ కొంగుజాపి
భాగ్యనగరికి విచ్చేసె భాగ్యమనుచు

శ్రీ వెంకటేశుండు సింహాద్రి వాసుండు
    భద్రాద్రిపతి తెల్గుప్రభువు లైరి
కాళేశ్వరాద్య దాక్షారామ శ్రీశైల
    లింగమ్ము లొకనాట లీనమయ్యె
రాయలు రుద్రమ్మ రాజరాజనరేంద్రుఁ
    డీ ముగ్గు రొకకోట నేలుకొనిరి
తుంగభద్రా కృష్ణ గంగ గోదావరి
    మూడేరు లొకతోట మురువుసూపె

అదిగో ఆంధ్రప్రదేశ్ త్రిలింగైక్యసీమ
ఘనుల ముక్కోటి బిడ్డలఁ గన్నతల్లి
పండు ముత్తైద విద్యల పాడియావు
అఖిల భారతీయులపాలి అన్నపూర్ణ.

ప్రాచ్య దేశాంధ్ర శ్రీ మహాభారతమ్ము
భవ్య తెలగాణ శ్రీ మహాభాగవతము
మహిత రాయలసీమ రామాయణమ్ము
ఘన త్రివేణీ సమాగ మాకార మూనె.

కలసియున్న సోదరులు వేరుబడుదురు
వేరువిడిచి తిరు జేరి రాకట
ఆంధ్రజాతిలోన నైకమత్యం బిల్ల
యనెడి మాట కల్లయయ్యె నేడు.

కన్నతల్లి! ఆంధ్రులపాలి కల్పవల్లి
ధాత్రి! ఆంధ్రప్రదేశమాతా నమోస్తు!
అంబ! అజయమై అమరవై ఆత్మసుతులఁ
గొలువ నాచంద్రతారార్క మలరవమ్మ!

('తెలుగుతల్లి' అనే సంకలనంలోనిది. సం.ప్ర. తేది 1975)

# విశాలాంధ్ర

దివాకర్ల వేంకటావధాని

శాతవాహనధరా చక్రేశ్వరుల తేజ
మదరంగ నేలిన యట్టినాళ్ల
చాళుక్యవంశ రాజన్యచూడామణుల్
వేదధర్మమ్ము నిల్పిన దినాల
కాకతీయ వసుంధరాకళత్రుల కీర్తి
వెన్నెలల్ దెసలఁ బర్వించినపుడు
విద్యాపురీ పరివృఢులు తెల్గుకవిత్వ
కన్యకు నాట్యముల్ గఱపువేళ

తెల్గుసోదులు స్వేచ్ఛమై తెగి విరోధి
కంఠదళనమ్ము చేసిన కాలమందు
బ్రదికియుండని మేటికొఱంత తీరె
శుభ విశాలాంధ్ర రాష్ట్రమ్ము చూచుకతన.

('తెలుగుతల్లి' అనే సంకలనంలోనిది నం.ప్ర. తేది 1975)

## ఉదయరేఖ

కేశవపంతుల నరసింహశాస్త్రి

తనగద్దె శేషుని వదనసహస్రం బయి
    ముదురు రత్నాలతో ముద్దుగులుక
తన కిరీటము మేరు ధరణీధరాగ్రమై
    పసిడి కాంతుల దిశాపంక్తిఁ బూయ
తనదు హారాళి కేదారవ త్తటనదీ
    గ్రామమై పచ్చలరంగు లీన
తన దుకూలము మేటి తరగల సంద్రమై
    కుచ్చెళ్ల మడతల మెచ్చుఁగూర్ప

దీప్త పరిపాలనం బెల్ల దీవులందు
బహుమతికి పాత్రముగ మించు భరతమాత
గన్న రాష్ట్రాత్మలోన మిన్నయగుచు
తేజరిలు గాత అఖిలాంధ్ర దేశలక్ష్మి.

మ్రోగుగావుత ఇంక మొనసి నీ పాండితి
    డిండిమం బఖిల దిఙ్మండలముల
పారుగావుత ఇంక భవదీయ కవితాస్ర
    వంతి ఖండాంతర ప్రాంతములను
ఒరయుగావుత ఇంక ఉజ్జ్వల తావక
    శేముషీమణి విపశ్చిన్నికషము
మెలగుగావుత ఇంక లలిత యుష్మద్యశో
    రమ యింట నింట భారత ధరిత్రి

జగము పులకింప కవిమేను జలదరింప
మధురతర తవకానర్ఘ మంజువచన
రచన లిక నెల్ల దీవులఁ బ్రచురదీప్తి
నంది వెలసెడుగాత! మా ఆంధ్రమాత!

తడిసిన కనుల నద్దగనిమ్ము మనసార
 తల్లి! నీ పాదపద్మద్వయాన
అదిరెడు గుండెల హత్తుకోనీవమ్మ!
 భ్రాతృవక్షఃపీఠ భాగములను
చెనటిమాటలు విన్న చెవులఁ జేర్పగనిమ్ము
 ధన్యాతిధన్య! స్వాతంత్ర్యగీతి
పదకు చేతుల గంట వాయింపఁగా నిమ్ము
 తల్లి! నీ పూజావిధానమునకు

దుర్భరభయాతిరేక దోదూయమాన
దేహము ప్రదక్షిణముచేసి తేరనిమ్ము
సర్వవైక్లబ్య భావంబు సమసిపోవ
మూడు కంఠాలు నేకమై పాడనిమ్ము.

చుక్కలు చంద్రునిన్ గులికిచూచెడుదాక సరోజబాంధవుం
డక్కర మీరఁ బద్మిని సహస్రకరమ్ముల కౌఁగిలింతలన్
జొక్కి రమించుదాక, గుణసుందర మేకసితాతపత్ర మీ
ఒక్క మహాంధ్రరాష్ట్ర మది యున్నతి గాంచి జనాళిఁ బ్రోచుతన్.

('తెలుగుతల్లి' అనే సంకలనం లోనిది. నం.ప్ర. తేది 1975)

# మహోదయము

ఉరుపుటూరి రాఘవాచార్యులు

అరినంతతులకు సింహస్వప్నమై యున్న
తెలుగు మగంటిమి యొలికె నెచట
రాజులు పెంచ విభ్రాజితాంగములతో
తెలుగుపల్కు వెలంది కులికె నెచట
పసుపు కుంకుమతోడ పారాణితో తెన్గు
ఇల్లాలు కాపుర మెచట సేసె
రాళ్ళలో ప్రాణాలు చల్లి శిల్పులతెల్గు
ఉలులు సౌందర్యంబు జిలికె నెచట

అపవిత్ర ధరిత్రి యీ ఆంధ్రభూమి
తలపునకు వచ్చి యొడలెల్లఁ బులకరించు
మరల పూర్వమహోదయ మందువేళ
వచ్చె వెనువెంట తాను శుభమ్ము దెచ్చె.

ఒకచేత జపమాల యుండఁ దెల్గులపల్కు
చెలువ వైరాగ్యంబు జిలుకరించె
ఒక చేతిలో చిలుకయుండ కామము గూడ
పురుషార్థమే యని బోధచేసె
ఒకచేత వారిజంబుండ సౌందర్యంబు
సత్యము శివముతో నిత్యమనియె
ఒకచేత పుస్తకం బుంచ విద్దెలనెల్ల
నేర్పి విజ్ఞానంబు నేర్పుదనియె

అట్టి విత్తులు పొలముల నలికి తెను
ఏరు గోదావరీనీరు పారఁబెట్టి
పంట పండించి భాగ్యాలు బండ్లకెత్తి
గరిసెలను నింపితిమి యిక కరవు రాదు.

('తెలుఁగు తల్లి' అనే సంకలనంలోనిది. సం.ప్ర తేది 197[illegible]

# ఆంధ్రమాత

అద్దంకి నరసింగారావు

ఆంధ్ర దేశంబయి అవతరించెను నాడు
    ఆంధ్రప్రదేశమయి అలరు నేడు
సోదర సోదరీసౌహార్దవర్తన మందు
    సౌభాగ్యసీమయై శోభగాంచె
రాష్ట్రీయ భావనా రాగాంధకారంబు
    కన్గప్పనీయక గ్రాలుచుండి
భారతావని శాంతి భద్రతా కంకణ
    బద్ధయై శోభిల్లు భాగ్యసీమ

యుత్సవంబున కేతెంచి యుండు మీకు
స్వాగతమిదు సంతోష సమయ మిద్ది
భరత సంస్కృతి సద్కళా ప్రాభవమున
కీర్తినిల్పుడు చిరముగా మీరలెల్ల
"ఆంధ్రప్రదేశంబు మిన్నయం చనెడి సూక్తి"

ఆసేతుశీతాద్రి హైందవావని లోని
    అన్నపూర్ణాఖ్యయీ వాంధ్రమాత।
స్వాతంత్ర్య సమరంబు సాగించి సాధించి
    ఆనంద మిచ్చినా వాంధ్రమాత।
సంగీత సాహిత్య సంస్కృతీ విలసిత
    అందాలరాణి యీ వాంధ్రమాత।
ముక్కోటి సంతతి మురిపంబుపోషించు
    యనురాగమూర్తి యీ వాంధ్రమాత।

సరస సంగీత సాహితీ సాధు బద్ధ
వివిధ సోదర సోదరీ భావరత్న
ఖచితమౌ మాలగైకొని కరుణమీర
విశ్వవిఖ్యాతి వెలయ దీవింపుమమ్మ!

ఆంధ్రప్రదేశంబు అవతరింపగ గొప్ప
సాధన చేసిన సదయులార!
సాంఘిక సంక్షేమ సౌభాగ్యలబ్ధిని
సాధించుచున్నట్టి సదయులార!
సంతోషమొనగూర్చు సత్కళా విభవంబు
సాధించుచున్నట్టి సదయులార!
కార్మిక కర్షక కల్యాణ లక్ష్యంబు
సాధింపనున్నట్టి సదయులార!

సచివవరులార! ప్రజలార! సాధులార!
సంఘ సేవకులార! సుజ్ఞానులార!
హర్షధ్వానములనుచేసి ఆంధ్రదేశ
మాత జేజేలు పెట్టుడీ మమతమీర!

## నా దేశం !

కొసరాజు

తెలుగుదేశమే నాది
తెలుగుబిడ్డనే నేను
తెలుగుపేరు వింటేనే మురిసిపోతాను
తెలుగుభాష అంటే మైమరచిపోతాను, ॥తెలుగు॥

నన్నయభట్టిక్కడనే పుట్టినాడు
తిక్కనకవి గంట మిచట పట్టినాడు
    పోతన్నలు, శ్రీనాథులు,
    రామరాజ భూషణులు
    తెలుగుభాషకే వన్నెలు దిద్దినారూ.
    తెలుగుజాతి నాల్కలపై నిలిచినారు. ॥తెలుగు॥

ఆటవెలదులను ముద్దుల
    మూటగట్టె వేమన్న
భావి కాలగతుల తెలియ
    బల్కెను వీరబ్రహ్మం
కర్నాటక గానానికె, కళదెచ్చెను త్యాగరాజు,
ఇంతటి విజ్ఞానధనులు
ఎవరున్నారు
వెదకిచూచినాగాని కానరారు, ॥తెలుగు॥

బరిపై కొరడగొట్టి, కత్తి
    బట్టెను నాయకురాలు,
పురుష వేషమున శత్రుల
    నురుమాడెను రుద్రమ్మ,

మొల్లలు మల్లమదేవులు.
మహిళలకే మణిపూసలు,
తెలుగుగడ్డకే, పేరు దెచ్చినారు
స్త్రీ జాతికి గౌరవమ్ము నిచ్చినారు. ||తెలుగు||

ఓరుగల్లు నేలిన శూరుడు ప్రతాపరుద్రుడు
పౌరుషమ్ము చిందించిన బాలచంద్రుడు
    రాచకొండ వెలమదొరలు,
    కొండవీటి రెడ్డివిభులు,
మన ప్రతాపమునకు బలే మచ్చుతునకలు
వేదినెత్తు పాలించిన వీరపుత్రులు, ||తెలుగు||

కలియుగ భీముడని బిరుదు
    గొన్న, "కోడె రామమూర్తి"
అద్భుతమేధావిగ, పే
    రందిన "విశ్వేశ్వరయ్య"
జగము మెచ్చు "రాధాకృష్ణ"
త్యాగమూర్తి "ప్రకాశం"
"సత్యసాయి బాబాలు".
మనవాళ్లంటే చాలు. ||తెలుగు||

సింహాచలమప్పన్నా, శ్రీశైలం మల్లన్నా,
యాదగిరి నరసింహా, ఏడుకొండల వెంకన్నా!
వీరంతా తెలుగువారి కిలవేలుపులు,
కుహి ఖులు ఖాపించునట్టి మనదేవుళ్లు॥ ॥తెలుగు॥

కృష్ణా, గోదావరులు, కేరింతలు గొడుతున్నవి,
తుంగభద్ర మంజీరలు, అంగలువేస్తున్నవి,
నిత్యము ప్రవహించుచున్న
నిర్మలమగు జీవనదులు,
బంగారపు పంటలు పండిస్తువున్నవీ
కరువు రక్కసిని దూరం తరుముతున్నవీ. ॥తెలుగు॥

తెలుగువాడు ఏడనున్న, తెలుగువాడు
తెలుగుభాషనే, సొంపుగా పలుకుతాడు
మరచిపోని అతని కట్టు,
మారిపోని అతని బొట్టు,
తలచుకున్న, రోమరోమం
పులకరిస్తుందీ,
అభిమానం పొంగిపొరలి
ఉరకలేస్తుందీ. ॥తెలుగు॥

('తెలుగుతల్లి' అనే సంకలనంలోనిది సం. ౹ . తేది. 19.5)

# ఏకతా సేతువు

జె. బాపురెడ్డి

ఒక్కటేరా! తెలుగుదేశం
ఒక్కటేరా! తెలుగుభాష
ఎక్కడున్నా తెలుగులందరు
ఒక్కటేరా! ఒక్కటేరా!

ఒక్కటే గోదావరినది
ఒక్కటే కృష్ణానది
రెండునదులూ తెలుగుజాతి
గుండెలో ఒకటైనవి ॥ఒక్క॥

అరకులోయల గాలికొండ
హైదరాబాద్ గోలకొండ
కలిసికట్టెను తెలుగుతల్లి
కంఠసీమను పూలదండ ॥ఒక్క॥

సాగరమ్మొక వైపున, నిజాం
సాగర మ్మొక వైపున
తెలుగుతల్లికి వీచుచల్లని
అలలవీవన లందమొప్పగ ॥ఒక్క॥

ఎదలు ఎదలు కూర్చికట్టిన
ఏకతా సేతువులమీద
కదలివచ్చెను ప్రగతిచక్రాల్
కనుల పండువగా; ॥ఒక్క॥

పేదవోయిన తెలంగాణము
పెంపయిన సర్కారుప్రాంతము
మధ్య రాయలసీమతమ్ముల
మధ్య భేదము మాపుదాం.

('తెలుగుతల్లి' అనే సంకలనంలోనిది సం.ప్ర. తేది 1975)

# తెలుగుదేశము నాది

ఉప్పులూరి మల్లికార్జునశర్మ

తెలుగుదేశము నాది – తెలుగువాడను నేను
తెలుగునాడే నాదిరా - ఓయన్న వెలుగులే విరజిమ్మెరా॥

శాతవాహనునాటి - చల్లనీపాలనా
కాకతీయుల నాటి, కమనీయశిల్పమూ
వేంగిరాజులనాటి - ఎనలేని సంపదా
అన్నిదేశాలనూ ముగ్ధులను చేసినా ॥తెలుగు॥

రాయలాభుజశక్తి, రామలింగనియుక్తి
శ్రీనాథు కలశక్తి - పోతనారక్తి
రామదాసూరక్తి - త్యాగరాజూ గీతి
నిత్యమై నిఖిలమై, మారుమ్రోగుచునున్న ॥తెలుగు॥

స్వాతంత్ర్య సమరాన - యోధానయోధులై
ముందుకురికిన వారు - నా తెలుగువారురా
నా ఆంధ్రకేసరీ - నా మాడపాటీ
ఛాతినే లేపారు – దేశాన్ని వూపారు ॥తెలుగు॥

పరపాలనా పోయి - మనపాల నొచ్చింది
తెలుగు పలుకులు పలుకు అందరూ ఒకటైరి
తెచ్చారు రాష్ట్రాన్ని - యిచ్చారు అందరికి
ముక్కోటిదేవతలు, ఆశీస్సు లిచ్చారు ॥తెలుగు॥

కలతలూ మానాలి, అందరము కలవాలి
రాష్ట్రాభివృద్ధికై - కంకణము కట్టాలి
దేశదేశాలలో - జేజేలు పొందగా
విజయాన్ని పొందాలి - విజయదుందుభి మ్రోగ ॥తెలుగు॥

("తెలుగుతల్లి" అనే సంకలనంలోనిది సం.ప్ర. తేది 1975)

## రాష్ట్ర రథం

వల్లి భాస్కరరావు (బర్మా)

కదులుతుంది! కదులుతుంది!
విశాలాంధ్ర రథం!
తెలుగుబిడ్డ ప్రతి ఒక్కడు
రథసారధి నిజం!

విశాలాంధ్ర రథం నిండ
వినోదాలె చెల్లీ!
ఎటువిన్నా ఉల్లాసపు
నినాదాలె తల్లీ!

చుట్టూరా బావుటాల
తోరణాలు చెల్లీ!
ఆ నడుమను తెలుగుపాప
చిరునవ్వులు తల్లీ!

తెలుగు ప్రజల నలువదేండ్ల
తపోఫలం చెల్లీ!
పొట్టిరాము గట్టిదీక్ష
మరువలేము తల్లీ!

గతమన్నది శ్మశానమ్ము
తవ్వబోకు తమ్మూ!
ఎదురున్నది దివ్యమైన
రాచబాట రమ్మూ!

కులభేదం కూల్చి కాల్చి
సమధర్మం తెమ్మా!
అనాదే జాతి కంత
హాయి గూర్చు నమ్మా!

నాదంతా నేడు సకల
నిండవలెను తమ్మా!
మనమంతా తెలుగు ఘనత
చాటవలెను రమ్మా!

('తెలుగుతల్లి' అనే సంకలనంలోనిది. సం.ప్ర. తేది 1975)

# ఆంధ్రరాష్ట్రరజతోత్సవసమయం

పి. తిరుమలరావు

ఆంధ్రరాష్ట్ర
జన్మదినోత్సవ తరుణం
మన జాతిప్రగతికే
నవోదయ తరుణం।

గలగల పారే గోదావరితో
కిలకిల నవ్వే క్రిష్ణవేణితో
త్రెళ్ళు చూపారే తుంగభద్రతో
పాడిపంటలకు ఆలవాలమై
ఆంధ్రదేశమే అన్నపూర్ణయని
జాతినంతను జగతిప్రశంసించెడి
శుభసమయం।

ఆంధ్రరాష్ట్రరజతోత్సవతరుణం।
లేమి జనుల "లేమి"రజతోత్సవ తరుణం

ఎందరో మహానుభావులు। అందరికీ వందనములు
త్యాగపురుషులు తమ దూరదృష్టితో
భాషాప్రయుక్తరాష్ట్ర వాదనచేసి
తమ కాయశక్తుల పోషణచేసిన
తమ తలపుల తలుపులు
స్వర్గద్వారపు తలుపులు
తెరచిరి తెరచిరి తపోధనులు।
స్వర్గద్వారపు తలుపులు,

ఎందరో మహానుభావులు
వారందరికి మన వందనములు
అందులో మన అమరజీవి
పొట్టి శ్రీరాములు అభినవరాముడు.
ఎక్కువెట్టిన నిరసన వ్రతమను బాణము
విసరెను ప్రాణము; అసువుల బాసెను;

దేశనాయకులు దద్దరిల్లగా
దేశప్రజలు దుందుభిలు మ్రోయగా
త్యాగధనుడు శ్రీరాములుకు
మన అందరి వందనములు
మననం చేసుకొందాం వారి
గుణగణములు గణన చేసుకొందాం;

ఆంధ్రుల మంతా ఒక్కటే
ఈ జగతిలో జాతికి
ఆంధ్రుల మంతా ఒక్కటే
దేశప్రగతికి ప్రపంచ ప్రగతికి
ఈ జగతిలో జాతిగ
ఆంధ్రుల మంతా ఒక్కటే
పచ్చని చేలతో పలుకరించెడి కోస్తా జిల్లాల్
రత్నగర్భ యని గణుతికెక్కిన
రవితేజము వెల్గెడి
రాయలసీమ
కాకలీరిన కాకతీయుల
శౌర్య ప్రతాపపు పాయసమిచ్చెడి
తెలంగాణము అందరూ కలిసిన
త్రిలింగదేశము
ఆంధ్రుల మంతా ఒక్కటే;

ముచ్చటగా మూడుకోట్లు
అరుకోట్లయి అరసిన
ఆంధ్రదేశమే త్రిలింగదేశము
జాతీయత తెలిపే ఏకకంఠముతో
అందర మొక్కటే తల్లిమ్రోల
మనసార పాడుకొను సమయం!
త్యాగయ, తిక్కన
పోతన, భీమన
ఎర్రాప్రగడ రాయలనాటి
అష్టదిగ్గజములు
కవుల కలములు
కిలకిలనవ్వె
కావ్యకన్యకల
కాటుక చూపుల
పలుకరింపుల
పులకరింపులతో
పరవశమందే
శుభసమయం.

ఆంధ్రరాష్ట్ర
జన్మదినోత్సవ తరుణం
మన జాతిప్రగతికే
నవోదయ తరుణం!

('కెరటాలు' అనే పుస్తకంలోనిది సం. ప్ర. తేది 1980

## గోదావరి

మాఁన: వి

"సురుచిరమగు సహ్య నగో
త్తరమున విలసిల్లుచుండుఁ దద్దయు గోదా
వరి తత్ప్రదేశము మనో
హరము పవిత్రము మునీంద్ర! యఖిల ధరిత్రిన్"

('తెలుగుతల్లి' అనే సంకలనంలోనిది సం.ప్ర. తేది 1975)

## గోదావరి

శ్రీనాథమహాకవి

త్ర్యంబకాచల శిఖరాగ్రంబునం దుదయించి
పొదలి చూర్యావర్త భూమి దటిసి
మలఁగి దండకవనీ మధ్యభాగము నా
ప్రస్రవనాచల ప్రస్థ మొనసి
పట్టిస శ్రీ వీరభద్రేశు సేవించి
తిల సోమనాథు మందిరము దాసి
యేచి యనంత భోగేశ్వర స్థానంబు
రుద్రపాదముల పైఁ ద్రోవగాఁగఁ

గోటిపల్లీశు కోమలాంఘ్రులకు మొక్కి
కుండలాముఖ తీర్థంబు గుస్తరించి
భీమమండలి దాపలఁ బెట్టికొనుచు
గౌతమీగంగ లవణాబ్ధిఁ గౌఁగిలించె.

('తెలుగుతల్లి' అనే సంకలనంలోనిది. సం ప్ర. తేది 1975)

## తుంగభద్రానది

తెనాలి రామకృష్ణకవి

గంగాసంగమ మిచ్చగించునె, మదిన్ గావేరి దేవేరిగా
నంగీకార మొనర్చునే, యమునతో నానందముం బొందునే
రంగత్తుంగ తరంగ హస్తముల నా రత్నాకరేంద్రుండు నీ
యంగం బంటి సుఖించునేని, గుణభద్రా! తుంగభద్రానదీ!

('తెలుగుతల్లి' అనే సంకలనంలోనిది సం.ప్ర. తేది 1975)

## శ్రీశైలము

పాల్కురికి సోమనాథుడు

పరమొప్పు దక్షిణ కైలాసమనఁగఁ
బన సర్వపర్వతసార్వభౌమాఖ్య
తనుపేర్చు శ్రీగిరీంద్రంబు దానదియు
ననుపమ ప్రమథ గణాస్థానవేది,
మునుల ముముక్షుల మూలబందరువు,
బాగొందఁ బర్వతు పండినతపము
ప్రోగైన మూర్తి, శంభుని యశోరాశి,
గరువుగట్టిన మహాకాశంబు, శ్రుతుల
శిరము, ఘనీభవించిన పరంజ్యోతి
దఱగని పుణ్యంబు, తపనిధి నుతుల
గుణి, సదాశివుని యంకుర, మద్రిజాత
వలపలిబంది, భక్తవరుల యిల్వేల్పు,
సలసంబులేని విజ్ఞానాబ్ధి కదలు
ధృతి ముద్దగించిన దివ్యామృతంబు

లతగరిగొన్న మూలస్తంభ మనఁగఁ
జెలువారునట్టి యా శ్రీశైల శిఖర
కలిత త్రిలోక విఖ్యాతయశఃప్ర
పూర్తియౌ శ్రీస్వయంభూలింగ చక్ర
వర్తి, యనమకీర్తి, వారిత నతజ
నార్తి, శ్రీమన్మల్లికార్జునలింగ
మూర్తియొప్పారు.

('తెలుగుతల్లి' అనే సంకలనంలోనిది- సం. ప్ర తేది 1975)

## శ్రీశైలము

నాగల్లూరి శేషనారాధ్యకవి

పాతాళగంగా కబంధ పీచిచ్ఛటా
మూర్ఛిత బ్రహ్మాండ గోలకంబు
విశ్వ విశ్వంభరా విర్భావ నిర్భార
మండన శ్రీకర్ణ కుండలంబు
కాన్యత్రృజేంధన పాషాణ వాలుకా
జ్యోతిస్తటిత్ప్రభా శోభితంబు
దీపిత త్రిభువన తీర్థ ముక్తాఫల
ప్రోద్భూత కారణ భువనరాశి

పారదామృత కుండికా స్పర్శవేది
సర్వ సంజీవనీ మహౌషధ వితాన
పుణ్యపావన కాననాద్భుత మహత్వ
పలన మహిమోన్నతంబు శ్రీ పర్వతంబు.

శిఖరంబుఁ జూచినఁ జేరుఁ గైవల్యంబు
పరిమహత్త్వంబును బొగడఁదరమె

గిరిశిరోభాగంబు గిరిజేశ్వరుని మూర్తి
పురిలింగమహిమలు పొగడవశమె
గిరి లుబ్ధకులు ముక్తి పురవరాధీశులు
పురి పీఠరక్షులఁ బొగడవశమె
గిరి జీవకోటులు గీర్వాణ నివహంబు
పురి జీవకోటులఁ బొగడవశమె

ప్రథిత ప్రభు పాప సంహారాభ్రంకషాగ్ర
గండ పాషాణ వాలుకా ఖండ వహ్ని
సలిల వర్ధమాన మృగపవి స్తంభనాభి
ఫలద మహిమోన్నతంబు శ్రీ పర్వతంబు.

('తెలుగుతల్లి' అనే సంకలనంలోనిది. సం.ప్ర. తేది 1975)

## దాక్షారామము

శ్రీనాథ మహాకవి

ఆంధ్రభూభువల మధ్యము పుండరీకంబు
సప్తగోదావరజలము తేనె
బ్రహ్మసంవేద్యాది బహుతీర్థములు రేకు
లకరులు దారుదివ్యస్థలములు
నాళంబు లవణాబ్ధి వేలావిభాగంబు
కల్యాణభోగమోక్షములు తావి
దక్షవాటీ మహాస్థానంబు కర్ణిక
హంసంబు భీమనాయకుడు శివుడు

గౌతమీసింధు కౌంతేయ కణ్వనదులు
తుల్యభాగయు నేలేఱు దుమ్మికొనలు
భువన సంభావ్యమైన యీ పుణ్యభూమి
యనఘ! సంసారతాప శాంత్యౌషధంబు.

ఎక్కడఁజూచిన స్సరసి, యెక్కడఁజూచిన దేవమందిరం
బెక్కడఁ జూచినన్ దటిని, యెక్కడఁ జూచినఁ బుష్పవాటికం
బెక్కడఁజూచిన న్నది, మహావలయంబున భీమమండలం
బెక్కడఁ అన్యమండలము లెక్కడఁ భావన చేసిచూచినన్.

సరివచ్చు ననవచ్చు శతమన్యు వీటికి
వివిధదేవాగార విభ్రమమున,
బ్రతివచ్చు ననవచ్చుఁ బాలమున్నీటికి
నక్షయంబగు జీవనాభివృద్ధి
నెనవచ్చు ననవచ్చు నిందుబింబంబునకు
సకలకళా విలాసప్రవృద్ధి
దొరవచ్చు ననవచ్చుఁ దోయజాక్షుని మూర్తి
కభిరామలక్ష్మీ సమగ్ర మహిమఁ

జెప్పనొప్పదె యప్పర శ్రీసహస్ర
దవళతరదీర్ఘ దృక్పుట దాళధళ్య
సమ్మిళద్భీమనాథ భూషాళశాంత
తరళదీధితి పరిపాటి దక్షవాటి.

భీమనాథేశ్వరునికంటె పెద్దవేల్పు
దక్షవాటంబుకంటె నుత్తమపదంబు
సప్తగోదావరముకంటె సకలతీర్థ
సారమగు తీర్థసారంబు జగతి లేదు.

('తెలుగుతల్లి' అనే సంకలనంలోనిది. సం.బ్ర. తేది 1978)

## కారెమపూడి

శ్రీనాథమహాకవి

వీరులు దివ్యలింగములు విష్ణువు చెన్నుఁడు తల్లి పోతురా
జారయ కాల భైరవుఁడు నంకమశక్తియు నన్నపూర్ణయున్
గేరెడి గంగధార మిడుగే మణికర్ణికగాఁ జెలంగు నీ
కారెమపూడి పట్టణము కాశిగదా పలనాటి వారికిన్.

('తెలుగుతల్లి' అనే సంకలనంలోనిది. సం.ప్ర. తేది 1975)

## విక్రమసింహపురము (నెల్లూరు)

జక్కన కవి

శ్రీ కవితా నూన చిత్రరేఖా యుక్తి । కొమ్మలందును గోటకొమ్మలందు
నవరస పదయుక్తి నానార్థ గరిమలు । రాజులందును గవిరాజులందు
కవిలోక సంతోషకర జీవనస్థితి । సరసులందును గేళి సరసులందు
నవనవ శ్రీ సుమనః ప్రవాళ । విభూతి మావులందును నెలమావులందు

గలిగి సముదగ్ర సౌధాగ్రతల సమగ్ర
శాత కుంభ మహాకుంభ జాత గుంభి
తోరు రత్న వినూత్న శృంగార మనుచు
సిరుల నొప్పారు విక్రమసింహపురము.

# కాళహస్తి

ధూర్జటి మహాకవి

నంసార పారదోచ్చాటనానలకీల
      కలుష సంచయ తామ్ర గంధకంబు,
కామలతా మూల కందకుద్దాలంబు,
      నంకల్ప పాషాణ టంకముఖము,
రాగకాలి వనాంకుర కదంగరీయంబు,
      శంకా కళంక భుజంగనకులి.
నవమనో గోరా జనానికా రజ్జువు,
      కోపనేక్షణ విశిఖోపలంబు,

దివ్యదేశిక హంసోపదిష్టమార్గ
నిర్గుణ ధ్యాన సంధాన నిరుపమాన
సౌఖ్య సంపత్తి సాధక జననివాస
మమృత లింగాకారము కాళహస్తిపురము.

('తెలుగుతల్లి' ఆ , నంకలనంలోనిది. నం.ప్ర. తేది 1975)

# విజయనగరము

తిరుపతి వేంకటకవులు

అమ్మవంకను జుట్టమా యేమి ? భోజ భూ
పాలపర్యునకల్ల కాళిదాసు
అబ్బవంకను జుట్టమా యేమి ? విక్రమ
ప్రభువరేణ్యునకల్ల భట్టిసుకవి

అత్తవంకను జుట్టమా యేమి ? రాజధ
రాధీశ్వరునకు నన్నయభట్టు
మామవంకను జుట్టమా యేమి ? కృష్ణరా
ద్ధరణీశ్వరునకు పెద్దన్నగారు

కవి యయినవాని నెల్లను గారవింప
రాజయిన వానికెల్ల ధర్మమ్ముగాక
పూషవార కులాంభోధి పూర్ణచంద్ర !
శ్రీమ దానందగజపతి క్షితితలేంద్ర !

"అష్టావధానమా-యానంద దంతీంద్ర
జనపాలు దర్శనం" బనెడివారు

"ఆశుకవిత్వమా, యానంద దంతీంద్ర
జనపాలు దర్శనం" బనెడివారు

"శతమంట కవనమ్ము సల్పుటా, యానంద
జనపాలు దర్శనం" బనెడివారు

"ఆకాశపురాణ మల్లుటా, యానంద
జనపాలు దర్శనం" బనెడివారు

కాని సులభ మటంచు నొక్కరును జెప్ప
రట్టి భవదీయ దర్శనం బాచరించి
ధన్యతను జెందె నా కవిత్వప్రశంస
శ్రీమ దానంద గజపతి క్షితితలేంద్ర ।

కవులెల్లన్ దలలూచి మెచ్చ బుధలోకంబెల్ల వహ్వా । యనం
గవి చిత్రమ్ముగ వందమంది కయినన్ గాదేని యష్టావధా
న విశేషంబయినన్ రచింపఁగల మానంద క్షితీశాన, మా
మా యవధానమ్మును జూడుమా । మనములో నానందమున్ జెందుమా।

స్థైర్యములేని చిత్త, మవధాన మెఱుంగని సత్కవిత్వ, మౌ
దార్యములేని హస్తము, యధార్థతలేని రసజ్ఞ, మంచి మా
ధుర్యములేని గానము, మృదుత్వములేని వచఃప్రసంగ, మై
శ్వర్యములేని భోగము, నసారము లయ్యవి దంతిభూవరా ।

కాశీనహస్ర మొక్కటి చేసితిమి భవా
దృశులెల్ల విని వహ్వారే । యనంగ
ధాతు రత్నాకరోద్గ్రంథ మొక్కటి చేసి
తిమి శాబ్దికులకు మోదము మతిల్ల
పీఠి నొక్కటిని సంప్రీతి జేసితిమెల్ల
రసికాగ్రణులు నద్దిరా । యనంగ
శుకరంభికా వాదమొకటి చేసితిమి వే
దాంతి శృంగారు లౌరా । యనంగ

సంస్కృతమ్మున నివి తెల్గుసరణి శ్రవణ
నందనము చేసినార మానందముగను
దక్కఁగల చాటువుల కిఁక లెక్కలేదు
విజయనగర మహారాజ । విపులతేజ ।

సుగుణావతంస ! యానం
ద గణపతీ ! సత్యమైన దానిని లోకా
నుగతి నొడివితిమి కానీ
జగమెఱిఁగిన బ్రాహ్మణునకు జందెంబేలా !

('నానారాజ సందర్శనము'లోని ఏపద్య రత్నములు)

## ముఖలింగము

విశ్వనాథసత్యనారాయణ

ఈ పొంగెత్తిన వంశధార మఱి యిట్లే పొంగులై పొంగులై
నా ప్రాణమ్ములు దేహ మీ జలములలోనన్ ముంచుకోనిమ్మ యే
యే ప్రారంభములేని యీ తెనుఁగు లిట్లే గూఢసంవర్త వే
ళా పర్యంతము నుండనిమ్ము విధి యేలా మారు మాకోసమై.

నా జాతి పూర్వప్రతా జీవరహితమై
శక్తి నాదులయందుఁ జచ్చిపోయి
నా మాతృభూమి తేజోమహాశ్చ్యుతిని బ్ర
హ్మ క్షత్రతేజంబు మంటఁగలిసి

నా మాతృభాష నానా దుష్టభాషల
యౌద్ధత్యమును దల నవధరించి
నా తల్లినేల నే నాఁటి వాదారముల్
పై మెఱుంగులు చూచి భ్రమసిపోయి

ఏమి మిగిలిన దీనాటి కిట్లు పొంగు
లొలయు వర్షానదీ గభీరోదకముల
దైన్య గర్భదారిద్ర్యముల్ దక్క భిన్న
గిరిశిఖర దుర్గ పరిధీనగీతి దక్క.

ఇచటి 'నాగావళి' ప్రచుర వర్షంత స్త
రంగముల్ 'వంశధారా' జలములు
తరఁగెత్తిన 'మహేంద్రతనయా' సుపాధస్సు
లొకరీతిగాఁ బొంగి యుబికిపోయి.

'గౌతమీ కృష్ణవేణి' తరంగములు తా
దాత్మ్యమ్మునందు నైక్యము తలంచి
'గుండ్లకమ్మ' జలాల గుబురులోగుబురులై
'పెన్నా' తరంగముల్ పెరిగిపోయి.

(ఆంధ్రప్రశస్తి అనే సంకలనంలోనిది)

## శ్రీకాకుళము

విశ్వనాథ సత్యనారాయణ

శ్రీ కృష్ణవేణి గరిష్ఠ పాద స్తరం
గాహత ప్రాకార మైన యదియు
బిరుజుల దితిజ సమూహరక్తము గ్రోలు
నాల్కవోలు పతాక నాటి నదియు
ఆంధ్ర వీర భటాళి కాత్మ శౌర్యంబుల
యందు శాణోపలం బైన యదియు
ఘంటశాలా పురీకలిత పూర్వాంధ్ర శి
ల్పాచార్యులకు తల్లియైన యదియు

రాజరా జాంధ్రవిష్ణుని రాజధాని
కలుషముల కెల్ల పిడుగు శ్రీకాకుళంబు
కన్నులకుఁ గట్టినట్లుగఁ గానబడెడు
వేదకాలము నాటి ముత్తయిదువట్లు.

('తెలుగుతల్లి' అనే సంకలనంలోనిది. సం.ప్ర. తేది 1976)

# హంపివిజయనగరము

గంటిజోగి సోమయాజి

మాధవు నానతి మదిఁబూని హరిహర
పతి గట్టియుండిన పట్న మేది ?

కుందేలు పాఱక కుక్కలఁబోరాడు
శౌర్యాగ్ని యెచ్చోట జ్వలితమయ్యె ?

నారాయణాదార్యుండు సహజన్ము వెనువెంట
సంచరించిన మహాస్థాన మెద్ది ?

ఏడుప్రాకారంబు లీడు లేకుండఁగ
నరిభీకరమ్ముగా నలరె నెచట ?

సకలసామ్రాజ్య వైభవ స్థానమగుచు
పరమపావన భావనా శాలమగుచు
సరస విజ్ఞాన సంపూర్ణ దారువగుచు
వృద్ధిగాంచినపట్టణం బేది నేఁడు ?

కూరగాయలకును గొఱగాక రత్నముల్
కుప్పలుతెప్పలై యొప్పెనెచట

వేనవేల్ జనములు విలుచువేడ్కనువచ్చి
కన్నులపండువుల్ గాంచిరెచట

వివిధ దేశాయాత విశ్రుతవర్తకుల్
బేరసారములు గావించిరెచట

భూషణమ్ములుదాల్చి భూలోకసుందరుల్
మేడలపై నడియాడి రెచట

నట్టి యిండ్లను గబ్బిలా లవతరించె
పెంటప్రోవులుదవ్వ యే వింతగలదు?
కడుపు తఱుగక పోవదె కాంచినంత
విజయనగరాన వెలసిన విజయలక్ష్మి!

పనిఁబూని యెచటకో చననెంచు వారికి
సందు లేకుండిన నరణులేద?

ఖంగు ఖంగు మటంచు గంటలనాదముల్
రంజిల్ల సడచెడు రథములెచట?

రోజాసుమమ్ముల బజారులెచ్చోట?
పుష్పలావికల సొంపులును నెచట?

వాసనాద్రవ్యముల్ రాసులై బాటసా
రుల నాసలను బేర్లఁబిలిచెనెచట?

నక్కకూఁతలు, పఱచెడు పక్కిగములు
ముదురుఁదొండలు, పందుల బురదగుమ్మి
తప్ప నింకేమి యిండ్లలోఁ దనరుచుండ
విజయనగరాన వెలసిన విజయలక్ష్మి!

నింబముల్ నారంగ జంబూద్రుమమ్ములు
తరుణంపుఁ గిసలముల్ దాల్చెనెచట?

జలజాత కువలయ సందోహముల రజ
స్సాంద్రతల్ దొలఁకెడు సరసులెచట?

శుభలక్షణమ్ములఁ జూచుట కింపైన
గోరాజ సంతతుల్ గూలెనెచట?

అనయమ్ము జనముల యాననమ్ములఁ దాండ
వమునప్పు సంతుష్టిపాళె నెచట?

అకట! తుంగము స్తలు రెల్లు లలరె నేఁడు
గడ్డిపూవులె కన్నులఁ గాననయ్యె
బురదగుమ్ములు శూన్యత లరయ వలసె
విజయనగరాన వెలసిన విజయలక్ష్మి!

పసియించు మానవ భావమై ఖరి నృత్య
పాళిఁ దాకెడు సౌధపంక్తి యెచట?

తలఁపుల యచ్చటఁ దెలిపెడు ననురీతి
దళ్ళవౌ గోడల దీప్తులెచట?

ఉన్నతజన్మము నుద్ఘోషణము సేయు
మాణిక్యదేహుళుల్ మలసె నెచట?

ఐశ్వర్య సూచియై యలరారు హాటక
పంజర శుకముల పలుకు లెచట?

వైభవమ్మెల్లఁ గలలోని వార్తయయ్యె
ఘనములౌ గేహముల్ దల్లిగలసిపోయె
కనకరాసులు చోరులు గొనఁగనయ్యె
నాశన మ్మెల్లచోటుల నాట్యమాడె
విజయనగరాన వెలసిన విజయలక్ష్మి!

ఇరువక్కలను దోఁచు నింద్రచాపమ్ముల
గతి నాతపత్ర యుగమ్ము మెఱయ

నన్యులకెన్నఁడు నందని రవిరాజి
యనురీతి నభిషేక హయము దనరఁ

దనుఁజుట్టి యెప్పుడు ననుసరించెడు గ్రహ
వితతి రాజులు వెనుకవెదలఁ

దన ప్రభావముఁగాంచి దినమును హర్షించు
జనులునాఁ దనచుట్టు జనములలర

మణివిభూషలు భాసురాంబరము లెనఁగ
బలములనుజూచి చిఱునవ్వు మొలకలెత్త
రాజమార్తాండుఁ డీనాఁడు రాఁడదేల
విజయదశమిని నీ పురవీథులందు
విజయనగరాన వెలసిన విజయలక్ష్మి!

(రామచంద్రుని హంపి యాత్రలోనిది సం.ప్ర. తేది. 1972)

## అమరావతి

కరుణశ్రీ

అందచందాలు చిందాడు బౌద్ధస్తూప
    శిల్పలక్ష్మిస్మిత శ్రీల యందు
శాతవాహన మహాచక్రవర్తుల ఆంధ్ర
    జాతీయ కేతనాంచలములందు

ఖండ ఖండాంతరాగత మహాయాన బౌ
    ద్ధాచార్య వాక్ప్రవాహములయందు
అమరేశ్వరస్వామి ఆలయమ్మున మ్రోగు
    కంచుఘంటల ఘణఘణలయందు

విశ్వవిద్యాలయాంగణ వేదులందు
బౌద్ధ వైదికమత కరస్పర్శలందు
“మూడు పువ్వు లారుకాయలై’ ముద్దులాడె
దిగ్దిగంతాల అమరావతీ ప్రశస్తి

(‘ఉదయశ్రీ’ అనే ఖండకావ్యంలోనిది సం.ప్ర. తేది 1979)

# ఓరుగల్లు

దేవులపల్లి రామానుజరావు

కాబోలు నియ్యది కాకతీయు లొకప్డు
కఱకు నెత్తుట కత్తి కడుగుచోటు

కాబోలు నీ ద్వార కల్యాణవేదిక
అలికి ముగ్గులు పెట్టె తెలుగు పడుచు

కాబోలు నీ జీర్ణ కమనీయ సౌధాన
సుకుమార శిల్పము ల్సొంపు లొలికె

కాబోలు నీవీధి కాపురం బొనరించె
పైడి మేడలలోన భాగ్యలక్ష్మి.

ఇచటనే నిల్చి కాబోలు నిందుముఖులు
ఆయుధంబులు పూజించి యరుగుదెంచు
ఆంధ్రసేనకు కపురంపు టారతులను
ఇచ్చి వారల శౌర్యంబు మెచ్చినారు.

ఆంధ్రనగరి యని యల్లారు ముద్దుగా
పిలిచె విద్యానాథుఁ డెలమి నీమె

అల్లుని స్వేచ్ఛకై నెల్లూరి నెఱజాణ
పఠియించె నిచటనే భారతంబు

జాను తెనుంగున శైవ ప్రబంధము
ల్మొలకెత్తి యిచటనే మొగ్గదొడగె

సుందర మందార సుమదామ మొక్కటి
పోతన గ్రుచ్చె నీ పొలమునందు

అర్థి హృదయాన నెందరో ఆంధ్రకవులు
అలపించిరి యిచటనే ఆత్మగీత
తలచినంతనె మేనెల్ల పులకరించు
అక్కటా నాటిశోభ యేమాయె నేడు!

రత్నాలు వజ్రాలు రాసులుగాఁ బోసి
అంగళ్ల నిచటనే అమ్మినారు
పట్టుకంబళ్ళపై బంగారు నచ్చున
గాయల నాడిరి కాంత లిచట
ఉడుకు రక్తము పొంగ హుంకార మొనరించి
అలరారె నిచట మా ఆంధ్రసేన
బంగారమును గూడ పండించిరంట మా
హాలిక ప్రవరు లీ ఆంధ్రభూమి

మా ప్రతాప నరేంద్రుని మానవతులు
వల్లభునిగూడి యిచ్చటి పుల్లెతోట
నిగ్గుతీవియ తొడిగిన మొగ్గలగుచు
తూగుటుయ్యెలలందున నూగిరంట!

('తెలుగుతల్లి' అనే సంకలనంలోనిది నం ప్ర. తేది 1975)

# అలంపూరు

గడియారం రామకృష్ణశర్మ

జగము సృజింప మున్నిచట స్రష్ట తపంబొనరించె; నెందు ప
న్నగధరు భవ్య లింగ మఘనాశకరంబును నిల్పె; ధాతచే
నగణిత కీర్తిగాంచె నెది'; అ గిరి పశ్చిమ దిక్కవాటమై
నెగడు నలంపురంబు, గణనీయతలంబును సన్నుతించెదన్.

పరమ పావని తుంగభద్రాస్రవంతియే
    కలుషంబులఁడచు గంగాభవాని
రసలింగరూపుఁడౌ బ్రహ్మేశ్వరస్వామి
    యెల్లరఁ దన్పు విశ్వేశ్వరుండు
భవకామనలు దీర్చు జోగుళాంబాశక్తి
    అఖిలజీవులఁ బ్రోచు అన్నపూర్ణ
వాస్తు శిల్పవిశేష వైభవాఢ్యము హేమ
    లాపురంబే కాశికాపురంబు

భవ్యచౌషష్టి ఘట్ట సంభరిత మగుచుఁ
దలఁప శ్రీగిరి పశ్చిమద్వార మగుచు
వ్యాసముని సన్నుతికిఁ బాత్రమైనభూమి
భద్రగుణరాశి దక్షిణ వారణాసి.

వరము నొసంగు తీర్థముల వైదికదేవత లొక్కరొక్కరే
వరలి తరింపఁజేయుదురు భక్తుల, దక్షిణవారణాసిలో
హరి హర శక్తి భాస్కర గణాస్యకుమారులు, షణ్మతాల దే
వర లిట నిల్చి అందరఁ గృపామతిఁ బ్రోతురు సర్వకాలమున్,

తన కళారీతి వైదగ్ధ్యంబుఁ జాటెడి
    మహనీయ రమ్య విమాన పంక్తి
శిల్ప కళాలక్ష్మి విభులాస్య మొనరింప
    వెలయుంచు కమనీయ భిత్తిరచన
దర్శించు వారి మై మరపించు గాథా రు
    చిర విలాసాపూర్వ చిత్రసృష్టి
దేవకోష్ఠంబుల దివ్యవిన్యాసంబు
    నవధరించెదు అధిష్ఠానగరిమ

జాహ్నవీ యమునా విలాసములు శిల్ప
ద్వారబంధాలు చూపరఁ దనుపుచుండ
దివ్యసౌందర్య మొక్కెడఁ దీర్చి పేర్చి
కట్టిరి చళుక్యు లిట సురాగారములను,

వేదవేదాంగ దర్శనవిద్యలెల్ల
సులభతరంబుగ బోధించు సూరిగణము
తనరి ప్రాచీన విశ్వవిద్యాలయంబు
పొలిచె పేర్గాంచె మా యలంపూరు పురము.

ఖండఖండాంతర ఖ్యాతిగన్న యిచటి
శిల్పసౌందర్యమునకు నిశ్చేష్టులగుచు
అలరి వైదేశికాళి జోహారు లొసఁగ
ఎఱుఁగకున్నట్టి మనవారి వేమియందు.

('తెలుగుతల్లి' అనే సంకలనంలోనిది సం.ప్ర. తేది 1975)

## నాగార్జునకొండ

సౌవర్ణ పులివర్తి విజయభూషణశర్మ

తలనాటన్గల సత్యస్థాగరముగా ప్రత్యక్షమై అ య్యదే
నిలయంబయ్యెను పూర్వ మార్యమత వాణిగ్లానికిన్ శాశ్వతం
త్ర లసత్‌వాద వివాద ఘట్టములకున్ నాగార్జునాచార్య వ
ర్యుల సవ్యాద్భుత సూక్ష్మతార్కికులకున్ రోచిష్ణు శిష్యాలికిన్.

బౌద్ధగాథలనేకముల్ ప్రస్తరముల
పై రచించిరి ఆచంద్ర తారకముగ
నాటి నాగార్జునాచార్యు జ్ఞానబోధ
లన్ బవిత్రితు లయిన కళాదపరులు

కొన్ని యుగములు వంతులు కురిసి ఆగె
శిల్పములుగూడ తమ విచిత్రిలు చిమ్మి
చరితలోపల జీర్ణమై చెరగిపోయె.
నమ్ము మియ్యది హృదయశల్యమ్ము నాకు

కాల ఘనదండ చండవిఘాత నిచయ
పూర్ణ చూర్ణీకృతమ్ములై పుడమి మిగిలి
యున్న శైథిల్యముల మధ్య కొన్ని కొన్ని
జీవరేఖలు జాల దర్శింపగలము.

అదె, నాగార్జునకొండ అయ్యెదియు బౌద్ధచార్య పీఠంబు ; అ
ల్లదె జీవత్తటినీ తరంగ విలసత్ లాస్యక్రియా ధ్యాన స
మ్ముదిత స్వాంతము ; దాని శీర్షమువయిన్ ముత్యంబులున్ రాతె బు
ద్ధ దయానూక్తులు మధ్య మాధ్వవిలసత్ వ్యాఖ్యా విశేషార్థముల్,

('నవకవిత' అనే సంకలనంలోనిది నం.ప్ర. తేది 1980)

# రాజధాని

సురగాలి తిమోతి జ్ఞానానందకవి

పటు వజ్రదీక్షతో నిట కులీకుతుబుషా
        గోలకొండను పట్టుకొన్న నాడు
భాగ్యమ్మ నిట కుతుబ్షా వివాహంబాడి
        తెలుగు జీవనములో గలియునాడు
మధురాత్మ నిచ్చోట మల్కిభరాముండు
        లలిత కళాసేవ సలుపునాడు
హిందు ముస్లిముల సంబంధ సౌగంధ్యమ్ము
        లెనరార తానీష యేలునాడు

పొంగుపొలు చెలిమి జ్యోత్స్నామరీచులు
వెలిగె ప్రజల హృదయ వీధులందు
తెలుగు భువనమందు వెలయుత మానాటి
కలుష రహితమైన చెలిమి వెలుగు

అరుగో! ధర్మనిబద్ధ దీక్షితులు మా యక్కన్న మాదన్న లి
ర్వురు నీ యున్నతికై నిరంతరము పాటుంబడ్డ మేధానిధుల్
పరిరక్షించిరి సర్వవర్గములు వివాదమ్ము లేనట్టి శాం
తిరమన్ నేడును నా విశేషములు రానీ! రాజధాన్యగ్రణీ!

సాలారుజంగ్ ప్రపంచ ప్రసిద్ధిగన్న
        శిల్పాల నొకచోట చేర్చినాడు
మూసీ నదీవేగమ్మున కడ్డునిర్మించి
        విశ్వేశ్వరయ భిక్ష పెట్టినాడు
ధ్యేయమ్ము కోసమ్ము షోయిబుల్లాఖాను
        తృణముగా నుసురు లర్పించినాడు
జనసమూహమునకు హనుమంతువంతులు
        విజ్ఞానతృష్ణ గల్పించినాడు

గమ్యమొకటె తారతమ్యమ్ము లేనట్టి
సహన జీవనాలు సలిపినారు
రాజసమ్ము తెలుపు రాజధానీ! నాటి
భ్రాతృభావ మలరవలయు నేడు

సహనస్వాంతులు బాపు జీహితులు నిస్వార్థుల్ మఱింకెందరో
మహనీయుల్ మతసామరస్యము రహింపన్ సర్వమున్వీడి యీ
మహదాంధ్రమ్మును నిల్వబెట్టుట తలంపన్ రాజధానీ! శుభా
వహమై పోల్చెడి వారి కయ్యెడి నమోవాకమ్ము లెల్లప్పుడున్.

తెలుగుల దొడ్డసంస్కృతులు తీయని మేలిమి తీరుతీయముల్
పలుకులలోని గౌరవపుభావము చక్కనిమన్ననల్ దిశాం
చలముల నాచికొన్న యవి సౌహృదయమ్ము వెలుంగనిమ్ము నీ
తెలుగులలోన నాంధ్ర జగతీసతి! ధర్మనిబద్ధ ధీమతీ!

నిరతంపు దుఃఖంపుతెరలలో పొరలాడు
        నిరుపేద పెదవిలో విరిసెనవ్వు
చితికపోయినవారి జీవనసరణిలో
        నవతరించెను దివ్యనవశకమ్ము
ఊషరక్షేత్రాల కూపిరిపోయంగ
        పలుకరించెను నెటాతెలుగుగంగ
చొరరాని భయదంపు గిరిశిఖరాలలో
        వినిపించె విజ్ఞాన వేదఘోష

అభ్యుదయము కొఱకు నారాటపడుచున్న
నవ్యదీక్షకులగు నందనులకు
తిరుగులేదు నేడు తెలుగుదేశమ్ములో
రమ్యతాత్రివేణి! రాజధాని!

గెలిచెన్ మానవతా మహోదయము దిగ్దేశాలు కొండాడగా
నిలిచెన్ ధర్మము మేలిగుబ్బగొడుగై నీడల్ ప్రసాదింపగా
పిలిచెన్ కోటిగళాలతో నిట ప్రజావేశమ్ము వందింపగా
తెలుగున్ జాతి యికెట్లు గాంచిదొ నమస్తే రాజధాన్యగ్రణీ!

('రాజధాని' అనే సంకలనంలోనిది. సం.ప్ర. తేది 1987)

## ఇది హైదరాబాదు

సి. నారాయణరెడ్డి

ఇది హైదరాబాదు ఇది హైదరాబాదు
ఇది భిన్నసంస్కృతులు ఎదిగిపూచిన పాదు

ఇచట మల్కిభరాము ప్రచురిత మ్మొనరించె
తెలుగు భారతి శింజినుల మంజులస్వనము

ఇచట గోపన్న చేయించె తన బ్రతుకు వె
చ్చించి సీతమ్మకొక చింతాకు పతకమ్ము

ఇచట తెల్గులవాణి ఇచట ఉర్దూబాణి
కలసిపోయిన విముక్తాప్రవాహము లట్లు

రావోయి తమ్ముడా రమ్ము రాయలసీమ
నుండి సాగరసీమనుండి తెల్లు(ం)నుండి

పొగబండి దిగ్గి సూటిగపొమ్ము సంభ్రమా
త్మకము సాలార్జ గుని క ళాని కేతనము

ఒడలివంపుల దెల్పు తడి ఎరతి నిల్పు
పడతి కన్పడ సిగ్గుపడబోకు చిత్రమది

తొలి మేలిముసుగు లోపల మెత్తగానవ్వు
జవ్వనిన్ గని చేయిసాచకుము శిల్పమిది

ఒక కొన్ని దినము లుత్సుకత పొంపిరిపోవ
దర్శించుమా కళాదర్శ నిలయాంతరము

అపుడు కనవచ్చు జలదాంగనలతో సరా
గములాడు దార్శినారు మనోజ్ఞ శృంగముల

అటనుండి విశ్వవిద్యాలయమ్మున కేగ
వోయి అది ఇంద్రసభనుండి రాలినతున్క

ఇస్లాము సంస్కృతిని హిందూమతాత్మ నొక
అద్దానజూపు హర్మ్యశ్రేణులను గాంచి;

ఘంటాపథమ్ములను గడచి విశ్రాంతికై
సాగిపొమ్ము హుసేను సాగరతటమ్ముపై

అచట నొక గడియసేపైన కూర్చొని తాన
మాడుము సమీరశీతాంబుశీకరములన్

హైదరాబా డింక నీదే సుమా! నీవు
వలస వచ్చినదాన వనుకోకు కలనైన

సహనమే నీకు భూషణము; దానినిదాల్చ
తెలగాణ నిన్ను గుండెల కద్దుకొనునయ్య!

వానలో నొకకొంత యాన విస్పదుగాక
వేసాన నొక కొంతసింత కన్పదుగాక

అయిన నేమాయె నయ్యా తెల్గులందరికి
నంస్కృతి యొకండె పూనలలోని దారమటు.

(14 నవంబరు 1956 ఆంధ్రప్రదేశ్ అవతరణ దినంనాడు వ్రాసిన 'గేయ' గీతం.)

('దివ్వెల మువ్వలు' అనే సంపుటిలోనిది నం.ప్ర. తేది. 1969)

## శ్రీకాకుళమండలము

విశ్వనాథ సత్యనారాయణ

దివ్యమౌ శిల్పవైదగ్ధ్య దేవళములు
నాట్య సంగీత నాటక నవ్యకవిత
లలిత సాహిత్య శ్రీకాకుళ ప్రశస్తి
తెలుఁగు భూమాత కొప్పున వెలుగుమణులు

శ్రీవిష్ణువు కూర్మంబుగ
నావిర్భవ మొంది యశము నందిన శ్రీకూ
ర్మా విభవపురము కడు
సేవితమై తెలుఁగుమాత శ్రీల నొసంగున్.

# విశాఖామండలమ్ము

విశ్వనాథ సత్యనారాయణ

వీరబొబ్బిలియును మఱి విజయనగర
పోరయుద్ధమునందున వీరులెల్ల
మడసినను తెల్గువెలుగులు మాయలేదు
తెలుఁగు భూమాత శౌర్యము వెలుగునచట

ప్రథితమైనట్టి సూర్యదేవాలయమున
శిల్పకళ మఱి వరనర-సింహస్వామి
ఆలయము వంశధార నాగావళియును
తెలుఁగు భూమాత విదితమౌ దివ్యదీప్తి.

తరు లతా గుల్మ సుమవల అరకులోయ
సహజ సౌందర్య సంభార సంపదయును
అచటి గిరిజన దింస నాట్యప్రశస్తి
నిగ్గు శ్రీ తెల్గు భూమాత నేత్రదీప్తి.

విశ్వ కళావని వేష్టి తాంధ్రాలయ
ప్రథఁగూర్చు వైశాఖ పట్టణంబు
సంద్ర వ్యాపారమున్ సవరించి యాంధ్రకు
వన్నెఁగూర్చు విశాఖ పట్టణంబు.
మనుగడన్ గూర్చుట కనువైనసామగ్రి
వర్థిల్లు వైశాఖ పట్టణంబు
జింకు పాలీప్లేట్లు సింధియా కంపెని
కర్మశాలలుఁగల ఘనపురంబు
విశ్వ కీర్తినొంది వేనోళ్ళఁ గొనియాడఁ
బడుచున్న వైశాఖ పట్టణంబు

సంద్రతీరమునందు విశాలమైన
ఓడరేవు సంపదఁగల్గి ఉత్సుకముగ
తెలుఁగు భూమాత నొసఁటిపై తిలకమయ్యె.
జన వీధల బాధలకంతులేదు.

సస్య భూరుహ వలపుష్ప సంభృతమయి
నిత్యమును దైవపూజతో నెఱిఁదనర్చు
విమల సింహాచల క్షేత్ర విదిత చరిత
తెలుగు భూమాత నాసికతీరు గాటు.

## 3. తూర్పుగోదావరి మండలము

విశ్వనాథసత్యనారాయణ

పూర్వము కాకినాడపురి పొంపిరి వోయిన, ఓడరేవుగా
పర్వి సముద్రతీరమున ప్రాభవ మొందిన పట్టణం బహో
ఉర్వరయైన దాని విత వోజ్వల చేరువ గ్రామపేదల
త్సోర్వమిసంద్ర మత్స్య పచ నొగిరభోక్తలు తెల్గుతేజముల్.

రాజ రాజనరేంద్రుని రాజ్యమహేంద్ర
వరము గోదావరీనది దరిని శోభఁ
దనరియును, తెల్గువెలుగు వితానమైన
కమ్మనైనట్టి కవితలుగ్రాలెఁ దొలుత.

కమ్మనికైత తేనియలు కాఱు ప్రశస్త పసింది గంటముల్
ఇమ్ముగఁ గ్రమకేల నిడియిక్షురసోక్తి విశిష్టభావముల్
తుమ్మెద శబ్దతుల్యపదతూర్యము సన్నయభట్టు జాణతన్
నెమ్మనిప్రాసె భారతము నిస్తుల తెల్గువెలుంగు లొప్పఁగ

అహహా! నన్నయభట్టు భారతము నత్యానంద ముప్పొంగగన్
మహనీయుండగు రాజరాజ నరపాల్యాశ్యాంకితం బొందియున్
మహిమం బొప్పఁగ నన్నపార్యునకు సన్మానంబు చేకూర్చె ని
మ్మహిపై నిత్యముగా తెలుంగు ప్రతిభల్ మానోజ్ఞమై వెల్గగన్.

రెండున్నర పర్వంబులు
దండిగను తెలుఁగు పలుగులు ధగధగ మెఱయున్
పండిత ప్రతిభన్ నన్నయ
మండిత రచనము సలిపియు మధనె నయయ్యా!

సారంగధరుని సంస్కారసంపద హేల
నలుదిశల్ వ్యాపించు నగరమౌర!
విఖ్యాత కందుకూర్వీరేశలింగము
సంఘ వైతాళిక రంగమౌర!
లలిత చిలకమర్తి లక్ష్మీనృసింహాని
మధుర కావ్యరచన మందిరమహో!
శ్రీపాదకృష్ణమూర్తి కృతుల రమణీయ
దీపాలు వెలిగెడు దివ్యనగరి
ప్రాత నూతనరైలు వంతెనల్ ధవళేశ్వ
రానకట్ట సిరి విరాజితపురి

మఱియు గురజాడకవి దివ్యమందిరంబు
రుచ్య వలరన క్షీర విరూఢియైన
రమ్యరాజమహేంద్రము రాజితమగు
తెలుఁగు భూమాత వక్షమై వెలయునౌర!

## 4. పశ్చిమగోదావరీ మండలము

విశ్వనాథ సత్యనారాయణ

రమ్య కొక్కొండ వేంకటరత్నము మఱి
గిడుగు సీతాపతియు మఱి అడవి బాపి
రాజు ఉభయ గోదావరి తేజకవులు
తెలుఁగు భూమాత కరక్రమ కలువచెలువ

అల్లూ రిసీతారామా
ఝల్లాఘుం దాంగ్ల సైన్య ముద్వేసిల్లన్
కల్లోలులతో బోరియు
ఉల్లాసంబొంది తెలుఁగు ఉషస్సయ్యెన్.

కీర్తియుతుఁడు దేవులపల్లి కృష్ణశాస్త్రి
అహఁ దివాకర్ల శ్రీవేంకటావధాని
తెలుఁగు సంస్కృత సాహిత్యదీప్తిఁ దనరి
తెలుఁగు భూమాత పలుకుల వెలుగులైరి.

## 5. కృష్ణామండలము

విశ్వనాథ సత్యనారాయణ

బృందావనమౌ బందరు
నందున తెలుఁగవని శోభనం బలరారన్
బందుర కవితా సుందరి
విందులు గూర్చిరి తిరుపతి వేంకటకవులున్

ఆంధ్ర సంస్కృత, ఆంగ్లభాషా యశస్వి
రాజమన్నారు హైకోర్టు-రాజ ప్రథమ
న్యాయ మూర్త్యైసుకీర్తి-నంది ప్రథిత
తెలుఁగు భూమాత విజ్ఞాన-తేజమయ్యె.

ఇంద్రకీలాద్రి చేరువ-నింపుఁదనరు
వాడ విజయాఖ్యను విజయ-వాడ యయ్యె
విజయునికి కృష్ణుపైఁగల-వేడుకలర
నచటఁ బ్రవహించునది కృష్ణ—యనె నతండు.

విజయునిచెంత కృష్ణుఁడతి-వేడుకతో చరియించు నట్లుగా
సుజలయుతంపు కృష్ణ కడు సొంపుగఁ బాఱుచునుండ విజ్యవా
డజరమునైన కీర్తిఁగొని అద్భుతరీతిని వ్యాప్తినొందుచున్
విజయుని నామకీర్తి యనువింతగు బొజ్జయెఁ దెల్గుమాతకున్.

విజయవాడ ప్రౌఢ-విఖ్యాత కంఠఁపు
మండిత వజ్రాల-దండయనఁగ
మాగాణి భూములఁ-దోగాడు జలముల
పిల్లకాల్వల పిల్ల-తల్లియనఁగ
లంక భూములపైకి-లంఘించు వెల్లువ
నురుగుఁ గ్రక్కెడు క్రూర-యురగ మనఁగ
జలధినాథుని మేన-జలములన్ జల్లుచు
జలక మాడించెడు-జాణయనగ

నురుగుఁ గ్రక్కుచు-చెర చెరఁ బరుగులిడుచు
తంపరంబైన సుడిగుండ-పొంగు టలల
తృష్ణఁ దీర్చెడు నాట్యంపు-కృష్ణవేణి
తెలుఁగు వెలుగుల తొలకరి-నొలుకుకులుకు

తకిట తద్ధిమి దిమ్మను-తాళగతుల
కృష్ణ కులుకుల నాట్య సంగీత కూచి
పూడి నాట్యము క్షేత్రయ్య-పుణ్యకృతులు
తెలుఁగు టవనిసతి నితంబ-కులుకు లౌర

నరస విశ్వనాథ-సత్యనారాయణ
ఆంధ్రకవితయంద-నన్యమైన
జ్ఞానపీఠి కాన్క-జాణయయ్యె సతండు
తెలుఁగు టవని మాత-తేజమౌరః

## 6. గుంటూరు మండలము

విశ్వనాథ సత్యనారాయణ

శ్రీ గుంటూరు పురంబునందున మహాచెల్వొప్ప జన్మించి వి
ద్యాగారంబగు తిక్కనాఖ్యుఁడు మహాధన్యాత్ముఁడై పొందితిన్.
వాగ్యోగుల్ పరికించి భారతములో పద్యైదు పర్వంబు లు
ద్వేగోద్వేల తెలుంగు రమ్యరచనన్ దీపించఁగా వ్రాసెఁగా

ఔరః నాగార్జున విశ్వవిద్యాలయంబు
గుంట్రునగరము వెలుపల-కొమరుఁ వనర
వెలసియున్నది గుంటూరు-ఫలమనంగ
తెలుఁగు సద్విద్య కళలట-వెలుగులొలుకు.

ప్రాచీనాంధ్ర ప్రభావ చిహ్నముగుచున్ ప్రఖ్యాతమౌ నాంధ్రకున్
రోచిస్సుల్ సమకూర్చి బౌద్ధమునకున్ రూపుల్ కడున్ దిద్ది సం
పీచంబౌ, అమరావతీపురము సంప్రీతిన్ విరాజిల్లుచున్
పూచెన్ గిరితి తెల్గు భూసతికి కర్పూరార్ఘ్యదీపంబుగా

అచటి బౌద్ధవిహారపు - టమల శిల్ప
శిథిలఖండము లింకను - చెన్ను - దనరు
మహిత భిలింగేశ్వరాలయం — మణిసరమయె
తెలుఁగు భూమాత కటకమై - వెలయకృష్ణ

ధీర ! తెనాలి పట్టణము నం దుదయించిన రామకృష్ణుఁ డా
ధీరుని దివ్యకైత సుధ తీపికి మెచ్చిన కృష్ణరాయ లా
వీరుని నూఱుతప్పులను వేడుకతో సయిరించెగాన నా
శూరుఁడు ఢిల్లిపాదుషకు సొంపుగ నంధినొనర్చె నాంధ్రతో

శుకపిక నాదగాన రససోనల నొల్కెడి గంటమూనియున్
వికట కవిత్వసంపదను వేడుక రాయల కొల్వుకూటమిన్
పకపక నవ్వులొప్పఁగను పండితులున్, కవిపుంగవుల్ కదున్
వికలమునొంద నత్కవిత వెన్నెలఁగాచెను రామకృష్ణుఁడున్.

నూట యొకటైన తప్పుతా నొప్పుకొనక
కృష్ణరాయలు శ్రీ రామ కృష్ణకవికి
శిక్షవేయఁగ నేర్పుతో రక్షఁబొంది
ఢిల్లికేగియు పాదుషా ఉల్లమలర,
జేసి బహుమని సుల్తాన్ల దోషములను
పాదుషా కెరింగించి యాపద దొలంగఁ
జేసి శ్రీకృష్ణరాయని వాసి నిలిపి
తెలుఁగు సామ్రాజ్య రక్షణన్ తీర్చిదిద్దె
నప్పుడిప్పుడు మఱియు నింకెప్పుడైన
ప్రథితమౌ తెనాలి తెలుఁగువసుధ నటికి
కొంగు బంగారమై సిరుల్ పొంగఁజేయుఁ
గాని బీదలబాధల కంతులేదు.

రాయప్రోలు సుబ్బారావు రచనశక్తి
లలిత గంభీర భావంబు లొలుకు కవిత
భావపురి కీర్తిఁ బ్రకటించు పటిమవావ్వ
తెలుఁగు భూమాత విజ్ఞాన వెలుగతండు

బ్రహ్మనాయని సమతత్వపథము కలుక
చెంది నాగమ్మయో ! కోడి పందె రణము
నందు పలనాటి భాగ్యమున్ డిందుపఱచె
నైన నట తెల్గుకాంతులు ఆఱలేదు.

బాలచంద్రుని, మగువ, మాంచాల తెగువ
మనుఁడు కన్నమనాయని కదనశక్తి
వేయినోళ్ళనుఁ గొనియాడు విదిత చరిత
తెలుఁగు భూమాత కుడికాలి తేజ మహహ !

ఘన కొండవీటి రాజగు
అనవేమారెడ్డి కవుల నారాధించెన్
జన నుతుఁడగు శ్రీనాథుఁడు
అనితర యశమొందె నతని యాస్థానమునన్.

స్వర్ణ కుండలముల నత్కాంతు పీనెడి
  ముని ముసినవ్వుల మోము దనర
నవరత్న శోభల నవఘుశించిన కంఠ
  మాల వక్షంబునఁ గ్రాలుచుండ
శృంగార రసభూతి పొంగార తంగుర
  క్రమభావము లొల్కగంటమూని
పసిఁడి కాంతుల నీను వస్త్రముల్ ధరియించి
  ఘనస్థ రసోక్తివిభావ పటిమగల్గు

నవరసంబుల మహితమౌ కవితఁగూర్చి
సురుచిరంబైన కవిరాజు బిరుదమొంది
తెలుఁగు వెలుగొవ్వ కారయై । వెలసె నౌర।
రమణ శ్రీనాథ కవిరాజ రాజవరుడు.

అనముఁ దనవేమ భూపతి కనుజుఁడైన
యోగివేమన రచితమౌ యోగమాల
గీతములు సర్వమానవజాతిహితవు
తెలుఁగు భూమాత కాతఁడు వెలుగుబిడ్డ.

నందికొండ సమీప మందున్న కృష్ణమ్మ
నంటి ఇక్ష్వాకు రాజ్యంబు వెలసె
నయశాలి నాగార్జు నాచార్యునిన్ బౌద్ధ
విశ్వవిద్యాలయం వెలసినట్టి
నందికొండను శిల్పనై పుణ్య మొలికించు
బౌద్ధవిహార విశుద్ధచరిత
నేష నాగార్జునసాగర జలములు
సర్వప్రపంచ విశాలయశము

దాని కుడికాల్వ నీటితో తడిసిపండు
పూజ్యగుంటూరు మండలి భూమిపంట
తెలుఁగు భూమాత బంగారు దీప్తులౌర ।
కాని బీదలు కూటికై కటకటింత్రు.

## 7. నెల్లూరు మండలము

విశ్వనాథ సత్యనారాయణ

పెన్నానది నెల్లూరుకు
విన్నాణం బగుచు నన్య విరివికి నెలవై
సన్నుత నెల్లూ ర్మండలి
పున్నంబై తెలుఁగుమాత భూషణమయ్యెన్.

వీరవర ఖడ్గతిక్కన ధారణియగు
సింహపురి పేరఁ బూర్వము చెన్నుఁగొనిన
పూజ్యమైనట్టి నెల్లూరి భూరిజిల్ల
తెలుఁగు భూమాత సాహిత్య తొలకరియయె

తిక్కన భారతకృతికై
రొక్కంబిడి మనుమసిద్ధి రుచిరాంకితమున్
మక్కువఁగొని తెలుఁగును నలు
దిక్కులఁ బ్రసరింప జేసె తేజంబలరన్.

## 8. చిత్తూరు మండలము

విశ్వనాథ సత్యనారాయణ

చిత్తూరు మండలమునకు
ముత్తెంబై కాళహస్తి ముద మొనగూర్చున్
ఎత్తిన చేతులు దించక
ఇత్తురు కానుకలు తక్కు లింపెనలారన్.

కాళహస్తి మహాత్మ్యము కావ్యకర్త
శ్రీరసాహితీవిజ్ఞాని ధూర్జటికవి
స్వర్ణముఖీ తోయ సాదృశ్య సత్కృతులు
తెలుఁగు భూమాత గంటఁపు తళుకురవలు

తిన్నఁడు నందనా రనెడి దీనులు భక్తులు శైవసేవలో
కన్నులు నొందియున్, కడకు గాంచిరి మోక్షము కాళహస్తిలో
సన్నుతి పాత్రమైన శివసన్నిధిఁ జేరిన భక్తులెందరో
మన్నన లొందియున్ శివునిమార్గముఁ జాటి తరించినా రహో।

ఏడుకొండల శ్రీనివాసవేంకటేశు
మూలమగువైన అలివేలుమంగను మఱి
బీబి నాంచారి యనెడిసాహేబు కన్య
పెండ్లియాడియు కులతత్వ భేద మూన్చి
తిరుమలందున దైవమై తేజమొంది
తెలుఁగు భూమాత యశమును తీర్చిదిద్దె.

శ్రీ వేంకటేశ్వర చిన్మయ తిరుమల
    తిరుపతి వైకుంఠదీప్తిఁదనరు
విశ్వవిద్యాలయ విదితమా పద్మాక్షి
    దివ్య కళాశాల దీప్తిపురము
అలవేలుమంగ దివ్యారామమున్ బీబి
    నాంచారమా దివ్యనగరమౌర।
స్నిగ్ధ బంగారుపూత శిఖర దేవాలయాల్
    కపిలతీర్థఁపు శోభఁగ్రాలు పురము
ఏడు కొండలపైకి యెగఁబ్రాకు రహదారి
    కిరువైపులను దివ్యతరుల నగర్ష

సర్వహిందూభక్త సంపత్తు కానుకల్
      ప్రోవులై విలసిల్లు పుణ్యనగరు
సంస్కృతాంధ్రంబుల సాహిత్య సంగీత
      లాస్యముల్ విలసిల్లు లలితపురము.

యాత్రికాళికి సత్రము లాశ్రయమిదు
మహిని వైకుంఠమౌ తిరుమల తిరుపతి
తెలుఁగు భూమాత హస్తనందీవరత్న
కటక ఝణ ఝణస్తోత్ర వేంకటుని పురము.

చంద్రగిరిరాజ యశములా చంద్రతార
అర్కమైనిల్చు వారి యనన్య వీర్య
శౌర్య సాహస దాన విశాల నిరతి
రాజసౌధము కోటయు రాతిగంట
ఘనుఁడు నాగమనాయని ఖడ్గశక్తి
తెలుఁగు భూమాత మోకాలి దిట్టతనము.

## 9. కడప మండలము

విశ్వనాథ సత్యనారాయణ

కడప మండలమందు కుగ్రామమైన
అత్మకూరున కుమ్మరి యతివ మొల్ల
కవితవరమునఁ బుట్టి ఘన యశస్వి
రచిత రామాయణంబు విరాజితమయె.

మల్లెలు మొల్లలున్ మఱియు మంజుల సౌరభ పారిజాత సం
ఫుల్ల సుమాళిసూక్తులు ) భూతసరంబగు రామగాథ న
త్యుల్లస భావనాపటిమ మెప్ప రచించిన కుమ్మరమ్మయౌ
మొల్ల తెలుంగు భూపడఁతి ముంజెతికంకణ రత్నకాంత్నహో!

ఒంటిమిట్టను గ్రామము ఒకటి తొల్లి
కడప సామీప్యమున మహోన్నత నొందె
అచట బమ్మెర పోతన్న అవతరించి
భాగవతమును తెలుగులో వ్రాసె నహహ!

లేత రసాల పల్లవములీల మృదుత్వము నొప్పు కైత సం
భూతిఁ దనర్చుకావ్యమును భూపతి కియ్యక రామభద్రు సం
కేతము కంకితంబు నిడి కీర్తిని బమ్మెర పోత నొంది సం
ప్రీతి నొనర్చె శారదకు పేశల తెల్గు ధరాప్రభాతమై

తాళ్ళ పాకన్నమాచార్య తత్త్వగీతి
రాధికా కృష్ణప్రేమ సంవాద మధుర
లలిత శృంగారరస మధూలాస్య గతులు
తెలుఁగు భూమాత పదఁపు టందియల రవళి.

పోతులూ ర్వీరబ్రహ్మము పూజ్యకాల
జ్ఞానతత్త్వము కులమతాజ్ఞాన తిమిర
మంతరింపఁగఁ జేసెడి మహిత వెలుగు
తెలుఁగు భూమాత మణిపీఠి దివ్యదీప్తి.

## 10. అనంతపుర మండలము

విశ్వనాథ సత్యనారాయణ

సదయులు రెడ్డి వంశజుల సాహస పాలనమందు పూర్వ మిం
పొదవి నృసింహ దేవళ విభూతిఁ దనర్చుచు మల్లెలావి నం
పదగల యుర్వరౌ కదిరిపట్టణసంస్కృతి శోభనంబు స
మ్మదముఁ దలిర్చు తెల్గు భువిముద్దియ పాదఁపు టందె రత్నమౌ

కృష్ణరాయని వైణవ గీతియలలు
సందడించెడి పెన్న విశాల తటము
పైన కోలిల్లెడిన్ తాడిపత్రి తెలుఁగు
ధరణి మా తాంఘ్రిమంజీర తళుకులరవ.

స్నిగ్ధ జలతారు పట్టిల చీరనేత
వెలయు ధర్మావరము పట్టువలువ తళుకు
హైందవోన్నతి సందీప్త హిందుపురము
తెలుఁగు భూతల్లి మేనిపైవలువ సిరులు

శౌర్య సాహసులైన ప్రజాళి నెలవు
కృష్ణరాయని పాలన కీర్తిధనము
తోర్చలాన్విత పెనుగొండ దుర్గమౌరః
తెలుఁగు భూమాత వీర్యసందీప్తహేతి.

## 11. కర్నూలు మండలము

విశ్వనాథ సత్యనారాయణ

కవ్యమౌ నాంధ్రకు న్ముఖ్యపట్టణ మయి
తుంగభద్రా తటంబుపై తొంగలించు
మహిత కర్నూలు తెల్గుభూమాత పాద
పద్మ సంపదలకు మహోపట్టుఁగొమ్మ.

శ్రీ మల్లికార్జున శ్రీమతి భ్రమరాంబ
గుడుల శోభల నీను గొప్పనగము
శ్రీ శివాజీ దానచిరకీర్తిఁ జాటెడి
గోపురం బలరారు గొప్పనగము

శ్రీకృష్ణరాయని చిరకీర్తి చిహ్నమౌ
ప్రాకార శిల్పప్రభావ నగము
శ్రీకర విద్యుత్తుఁ జేకూర్చు ప్రాజెక్టు
చెన్నారుచున్న విచిత్రనగము

భక్తకోటికి నెలవులై ప్రభఁజెలంగు
సౌధరాజ వితానాల సత్య నగము
శైవ సంపదఁ జాటు శ్రీశైల మౌర!
తెలుఁగు భూమాత శివపూజ తిలలగిన్నె.

## 13. హైదరాబాదు

విశ్వనాథ సత్యనారాయణ

తెలుగు వలరాణి భాగ్యమ్మ తేజమలర,
గోలుకొం డావనీపతి కుతుబుషాహ
భాగ్య మాపేర నిర్మించె భాగ్యపురిని
అదియె హైదరాబాదయ్యె హైదరాఖ్య!

హైదరబాదు భాగ్యపురమందు నవాబులు వైభవోద్ధతిన్
మేదుర పాలనన్ సలిపి మిక్కుట బంగరు వజ్రరత్నముల్
గాదెల నింపి సౌధములఁ గట్టిరి, ఇప్పు డదాంధ్రప్రదేశపున్
మేదుర ముఖ్యపట్నమయి మెప్పుల కుప్పయి వెల్గుచుండెగా.

# ఆంధ్రతేజమ, వందనంబందికొనుము!

తాపీ ధర్మారావు

విజయనగ రాంజనేయు సేవింపనేఁగి
క్రూర విరచిత పరితాప మూర్ఛితాత్మఁ
బెల్లువగఁ ద్రెళ్ళి, మది తల్లడిల్లి, యుల్ల
మందునం దాపసందేహ మల్లికొనఁగ,

"నాంధ్రతేజంబు గలదె యీ యవని నింక?"
నంచుఁ గించిజ్జితన్ మించ నెంచినాఁడ
కాని సందేహమును బూనినాను గాన
దోసమూనెను మది; కిదె దోసిలిడెద
నాంధ్రతేజమ, వందనం బందికొనుము.

2

మౌర్యవంశ సంస్థాపనాదార్యవర్యు
డైన చంద్రగుప్తుండు, చండాంశులీల,
యవన బలముల గవనువ కవల నునిచి,
దండితారాతి వీరప్రతాపుఁ డగుచు
పాలనము సేయ మగధకు బాటవమున,
గయ్యమునకు వియ్యమునకు నెయ్యమునకు
నీడు జోడునఁ గూడు నీ ప్రౌఢయనఁగ
మన్ననలఁగన్న వన్నెయే మాఱియున్న
తెలుఁగు నెఱుఁగక పొరపడి తెగదలచితి
దోసమూనెను మది కిదె దోసిలిడెద
నాంధ్రతేజమ వందనం బందికొనుము,

౩

క్రైదు వసఁటావమని యశోకక్షితిజుఁ
డాత్మ పరితాప బోధనీయానురాగ
పూరితంబగు సందేశముం బనుపఁగ
విమల దర్పణ ప్రక్షిప్త బింబమటుల
“ప్రణయ భరితాత్ములమె మేము; బగఱ కొఱకె”
“యాయుధాంకిత పాణుల నలరినార”
"మిన్ననాళులు పశుబల మెన్ని తాత“
“పదయని జయంబు శాంతిని బడసి“ తనుచు,
ఖడ్గధారలఁ బ్రేమ భంగములఁ జేసి
తుది నశోకంపుమున్నీట ముంచి యెత్తు
నాఁటి తేజంబు గలదను మాటలేమి
దీనమూనెను మది. కిదె దోసిలిడెద
నాంధ్ర తేజమ, వందనం బందికొనుమ.

౪

అవల నన్నూటయేఁబది హాయనంబు
లొక్క వక్కని దిక్కుల నుక్కుమిగిలి
యుర్వి సర్వంబు నేలు చఖర్వ్యమతిని
“వేల లింతేల మాకలాలీలల” కని
మణి మయూరాది దేదీవ్యమానమైన
వస్తువులతోడ విహరింప వనిధినెల్ల
యంచితోద్యానసరసిగ్గావించి మించి
దుర్గ మహార్యములనెల్ల తొల్చిమల్చి
“స్వర్గ మీచోట భూమికి సాఁగివచ్చె
నేమొ” యనునట్లు సొంపుల నింపునింపు
దేవళంబుల శాశ్వతశివి మెఱయఁ
గట్టి, గట్టిగ భక్తిని, జెట్టఁబట్టి;

గహ్వరంబుల కుడ్యభాగంబులెల్ల
పటము లొనరించి, తామెంత ప్రాఁతవడియు
నైగనిగ్యంబుపోని వర్ణములతోడ
ఔర నేర్పున, రచియించి భారతీయ
చిత్రలేఖన కౌకకొంత మాత్రముడిపి,
వజ్రమునకన్న పరుసనై వైరివట్ల,
గట్టమన్నను గుసుమంబు కన్న మెత్త
నగుచు, లోకంబు మెచ్చఁగా నలరినట్టి
తేజమున్నది మఱియొక్క యోజ ననుచు
నెంచ జాలకయే నంశయించినాఁడ;
దోసమూనెను మది కిదె దోసిలిడెద
నాంధ్రతేజమ, వందనం బందికొనుము.

౬

వేగి దేశాన బాలన విధమునందు
నిగమనభలను నిర్మించు నేర్పుమించు
సౌష్ఠవముఁజూపి, దేశ భాషాప్రపంచ
సార్వభౌమత నర్థించి, సాహితీవి
శుద్ధవాహినీగతి బుద్ధి నుద్ధతులయి
నాటికిని నేటికినిగూడ సాటియన్న
మాటలేకుండు రత్నాలమూట లనెదు
కృతుల నతులితగతుల నన్నుతులనందు
నా చళుక్యాది నృపుల కల్యాణకాల
మందుఁగల తేజ మింకొక చందమంట
గాంచనేరక మది నంశయించినాడ;
దోసమూనెను మది కిదె దోసిలిడెద
నాంధ్రతేజమ, వందనం బందికొనుము.

6

భండనావరరుద్రులు, ఖండితారి
నికరభద్రులు, కీర్తినిర్ణద్రు, లలఘు
వితరణసముద్రులగు రుద్రక్షితి విభులట
నోరుగల్లున విలసిల్ల, నుల్లసమున
మొఱకుఁ దురకల దీకొని నఱికియుండె,
రమ్యకావ్యంబులను బరిశ్రమలయందు
కాలమును బుచ్చియుండె విఖ్యాతిగాంచి;
రుద్రమాంబిక సామ్రాజ్య భద్రపీఠి
నెక్కి యొక్కట సర్వంబుఁ జక్కఁ జేసి
'అబల యట పాలనంబున సొబగదేమి?
మేలు మే'లని పరులును జాలఁబొగడ,
వైభవమ్మున దులఁదూగి వన్నెఁగన్న
నాటి తేజంబు దాఁ బరిణామ మంది
యున్న దీనాఁడు గన జాలకున్న కతన
దోసమూనెను మది కిదె దోసిలిడెద
నాంధ్రతేజమ! వందనం బందికొనుము.

7

సప్తవప్రావృతంబు ప్రాసాదసీమ
దక్షిణాపథమెల్ల నుద్యానవనము
విజిత వైరిరాట్ శ్రీలకే వితతిగాఁగ
హాయి విహరించి యాకాశ మంటుచుండు
స్వీయకేతన చేలాగ్రసీమ పవన
చాలనంబున దట తట సద్దుసేయు
నంతమాత్రాన శత్రు హృదంతరములు
దడ ద డని కొట్టుకొనునంత దాటిఁజూపి
మణిగణపు పంక్తు లచటి విపణులలోన

లోచనంబులు దనివారఁ జూచి చూచి
నవ సుధాధారలను మీఱు నవ్య భవ్య
కావ్య పీయూషపాన సౌఖ్యంబుఁ గాంచి
యెందుఁ జూచినఁ దనవారె ముందుగాఁగ
సర్వతోముఖ సుస్థిరైశ్వర్య మంది
విజయనగరాన ప్రతిభమై వెలయునాఁటి
తేజ మీనాఁడు గ్రాలుటఁ దెలియకుంట
దోసమూనెను మది కిదె దోసిలిడెద
నాంధ్రతేజమః వందనం బందికొనుమ.

('పాతపాళి' అనే కావ్యంలోనిది. నం.ప్ర. తేది 1960)

## కొండవీటి పొగమబ్బులు

విశ్వనాథ సత్యనారాయణ

దగ్ధాంధ్రరాజ్య నిత్యవిధూత ధూమమ్ము
    వ[illegible]ఁ గొండబురుజుల కెలన లేచి
బురుజు కొమ్ములపిడి పోలేని రెడ్ల కీ
    రి[illegible]వోలెఁ బెనురాళ్ళ నతుకులుపడి
రెడ్లకందా [illegible]న్క రేఁగు వందింటిపై
    నా[illegible]గవోలె గుమురులై ముందుసాఁగి
ద్రాగ్దావదా[illegible]ధ్ర స్వతంత్రతా రమవోలెఁ
    గొండ లంటి యంటకుండఁ బోయి

శ్యామలీ క వర్ద్గాన ఘూసాదనార్థ
మొలయు వెల్లావుల కదంబములుగ నిలిచి
కొండ కొమ్ములు లో దాఁచుకొన్న క్రొత్త
క్రొత్త పొగమబ్బు లలమె నీ కొండకోనల.

ఒక రెడ్డి సభతీర్చియున్న కొండకువాలు
        కొసలతో ముత్యాల గొడుగుపట్టు
ఒక రెడ్డి మూర్తిపోలిక తీరియున్నకొం
        డకు రోసగాఁ గిరీటమ్ముపెట్టు
ఒక యంతఃపుర వధూత్ప్రేక్షఁ జనుబురు
        జున సన్న మేలిముసుంగు తొడుగు
ఒక తెల్గుబంటు తీవికి ముద్రగొనియున్న
        బురుజు వజ్రమహాసివోలె వ్రేలు

ఈ జగా పొగమబ్బులు రాజసేవ
మఱచి పోలేవు రసధునీ మహితమూర్తు
లేము లెక్కించు చుంటిమి యెన్నినాళ్ళు
చనెనొ యని వంద లేళ్ళుగాఁ జూఁచుకొంచు.

అన్నదర్థాతి ధేయా రబ్ధములు రెడ్ల
        కువి వంటశాలల పొగలటంచు
అచట శ్రీనాథ కావ్యశ్రోతలగు మాకుఁ
        బఱచిన పందిళ్ళ పఱపులంచు
కొండకొమ్ములఁ దీర్చికొని నిల్పియున్న యాం
        ధ్ర భటాళి వీరగంథా లటంచు
ఉత్సవాగత జనమ్మొరిగిపోఁ గొండకొ
        మ్ములఁ దొంగి కను రెడ్ల ముగుదలనుచు

మున్ను గుఱ్ఱాల దూఁకించు కొన్నచోట
నడుగడుగునందు పాతంబులైన మాకు
నవ్వు దప్పదు తలనెత్తినంత కొండ
కొసల మబ్బులు పొరపెట్టి వినరులాడు.

ఒకసారి వలపమ్ము చిలికి ముత్యాల యం
చులవోలికను పత్యకల(జరించు
ఒకసారి జఘన భాగోపరి ప్రస్తచే
ల విధాన గిరిమెుదళ్ళ( బడిపోవు
ఒకసారి గిరిలక్ష్మి మొగముపై మొగలి పు
వ్వొ ఝ్వా(దుకొన్నట్లు వెల్లరే(గు
ఒకసారి స్వేదబిందుకములు రత్యంత
వేళా కుదావృత్తి విస్తరించు

చిలుత పొగమబ్బులీ కొండసీమ(బలుచ(
బడి, విశీర్ణమై( ధూతమై, తడిసి, రాచ
సిరి యుడిగిపోయినట్టి యీ శిథిలదుర్గ
లక్ష్మి కొన(గూర్చు వెట్టి యలంకృతులను

అధిరూఢ కుండినేశాత్మజ మయిన స్వం
దన గరుత్మన్మండిత ధ్వజమ్ము
గజపతి ప్రౌఢోగ్ర కరఘటా ఘండా వి
ధూతాంబు నిచయ బిందూత్కరంబు
రెడ్డ కీర్తిపతాక శ్రీనాథకవి కావ్య
దూత హంసాధినాథుని గరుత్తు
అలక నవాపాత్రు నంటిరా(జిన కృష్ణ
రాయబాహోగ్ర ఖడ్గాగ్రనృహోగ్ని

ఒక టొకటిగా(గ స్మృతి తెచ్చుచున్నవన్ని
చిలుతలీ పొగమబ్బులు చిందులాడి
కొండవీటి ప్రా(గోటపై కొమ్ములందు
నవ్యవర్షేందిరా దురంధర నిరూఢి.

నిప్పులు చూడ మన్నిలుత్కల ప్రౌఢ
పాత్రులు బురుజులపైని లేరు

ఈ చెలఁగ్రుమ్మ శౌర్యేందిరా పుంమూర్తు
లైన రెడ్డికోటపైన లేరు
గుండెలు కత్తులఁగ్రుమ్మ రాయల రాచ
యేనికగున్న లీ పైనలేవు
అడు గద్దునకుఁ బ్రాణమాహుతి గొనఁగద్వాః
స్థాన రక్షకభటులైనలేరు

ఒసి పొగమబ్బులార! రండోసి రండు
మీకు మా కిష్టమే యిష్టమాఁ కలేక
తిరుగవచ్చు రాజులు కొల్వుతీర్చుచోట
నరుగవచ్చు రాకన్నె లున్నట్టిచోట

ఎంత నిర్భయముగా నీ పొగమబ్బులు
జెట్టీల బురుజుపైఁ జిమ్మిరేఁగు
ఏ లెక్కలేనట్లె యీ పొగమబ్బులు
మిరియాల తఖతుపై తఱిమిపోవు
ఇంత యద్దంకి లే కీ పొగమబ్బులు
తారాబురుజుమీఁద దాట్లువెట్లు
ఈ మాత్ర మాఁకలే కీ పొగమబ్బులు
కేళిశుద్ధాంతసౌధాళిఁ జొచ్చు

పిచ్చి పొగమబ్బులార! కోపించిరేని
పెద్దవారు సుమీ! మిమ్ముచించి తొమ్ము
తాఁచి చెండాడి పోదు రద్దంకి రెడ్లు
తెలిహీనమ్ము లద్దంకిలేని రెడ్లు

ఇదుపుల విలిఖించిరేమొ నా ముక్తాక్ష
రములుగా దుర్గకుడ్యముల నొలని
ఇచట మ్రుగ్గులు పెట్టిరేమొ నాఁ గ్లప్త ము
క్తారేఖగా గిరిస్థలము మెఱసి

ఇట వితాన మమర్చిరేమొ నా మృదుమరు
చ్చాలిత మధ్యమై చదలఁదీర్చి
ఇట కేళకుళివెట్టిరేమొ నాఁదు దులశి
తల పృషత్పరిషించితముల గదలి

ప్రాతర నతిక్రమిత యామభాను రోచి
రా సమాత్త ధావళ్య మర్యాదమైన
లేఁత యీ పొగమబ్బు పురాతనంబు
త్రవ్వుచున్నది రెడ్ల యాంధ్రప్రశస్తి.

ఇవి రెడ్లరాజుల యెదలలోఁ బూరించు
కోరానికోర్కెలు గుములుకట్టి
ఇవి తెల్గుబంటుల యిందుప గింజలై
నాత్మలు పీడలే కరుగుడెంచి
ఇవియు శ్రీనాథుని యెఱ్ఱప్రెగ్గడ కావ్య
తకురాని భావముల్ తరకగట్టి
అవచితిప్పయసెట్టి వివిరత్నరాశిగా
మలఁచిన ప్రాణముల్ మగిడివచ్చి

కొండవీటి పొలాల్ వీడికోనులేక
అశబలమున మగుడు ప్రేతాత్మలవలె
సొరిది నీ గిరికొమ్ముల జుట్టుపట్ల
నిట్టి పొగమబ్బులై భ్రమించుగాక.

నా ప్రాణములకును నీ పొగమబ్బుల
కేమి సంబంధమో యేను గూడ
పొగమబ్బునై కొండచిగురు కోనలపైన
బురుజులపైనఁ గొమ్ములకుఁబైన
వ్రాలిపోనో మధ్య ప్రిఁకపోనో వేల
రాలిపోనో గాల తేలిపోనో

నా యూహచక్ర సుందర పరిభ్రమణమై
యీ పొగమబ్బులనే వరించె

ఎన్ని పొగమబ్బు లెఱిఁగి లే నేను మున్ను
తూర్పుకనుమలు విడుచు నిట్టూర్పు లట్టి
వికటి యీ పొగమబ్బు లే యెడఁదలోని
లలితము మదీయగిరి నేలా వెలార్చు.

('మణిమకుటము' అనే కవితానంకలనంలోనిది. నం.ప్ర. తేది 1961)

## ఆంధ్రదేశ వర్ణనము

వేటూరి ప్రభాకరశాస్త్రి

సీ॥ ఈ యింద్రకీలాద్రి నింద్రజుఁ డతపుతోఁ
బోరి పాశుపతంబు పొసగనంతె
నీ పుణ్యగరిమయందు నీశుండు భూమీ
సురున కర్థి సాయుజ్య మెనయనిచ్చె
నీ పట్టణంబున నెలమి మాధవవర్మ
ఘనముగా గురియించెఁ గనకవర్ష
మీ క్షేత్రమున శమీవృక్షంబునను వహ్నిఁ
బటుచేల చేగట్టెఁ బండితయ్య

భవ్య కృష్ణానదీ తటప్రాప్త భోగ
దక్ష సన్మోక్ష లక్ష్మీప్రధాన మనగ
వెలగె మల్లేశ లింగసంస్థితిని దూఢి
పుణ్యనిలయంబు బెజవాడపురవరంబు

సీ॥ క్రొత్త బియ్యము కాయగూర లొబ్బట్లు
నైతంపుబూరెలు పంచదారయామ
వడలు నల్లంబు మీగడలు బియ్యని
పెర్వు కమ్మని చిరుపాలు గనగసాలు
చిరుసెనగలపప్పు తరచు పిద్యంబులు
కంబళ్ళు దుప్పట్లు కంచుకములు
హింగు జీరకములు నెనసిన మిరియంబు
మదము గొల్పెడునెయ్యి మాటదురును

లనుసరణశీల మొప్ప గంధాక్షతములు
నంద మింపొందుశిఖలు నొయ్యారినడలు
గలుగు కాంతలు పురుషులు గలిగి సిరులఁ
జెలగు నయ్యాంధ్రదేశంబు చెలువుగాంచి

(డిసెంబరు 1982 'తెలుగువాణి' లోనిది.
అంతర్జాతీయ తెలుగుసంస్థ మాసపత్రిక)

## ఆంధ్రసంస్కృతి

గంధం అప్పారావు

ఏ దేశమందున్న ఏ రాష్ట్రమందున్న
భారతీయులమన్న భావమ్ము వదలక
ఆంధ్రసంస్కృతి ఠవిన్ అలరింపజేయుడీ!
ఆంధ్రులారా! సుగుణసాంద్రులై వెలయుడీ!

మానవతావాది మంజులస్వాంతుండు
శాక్యముని శిష్యుండు సంఘాబిరాముండు
పండిత వరేణ్యుండు ప్రజ్ఞాధురంధరుడు
ఆర్యనాగార్జునుడు ఆంధ్రుల కులపతి

సంఘాభివృద్ధికొ సాహిత్యమనుమాట
సార్థకముచేసిన సత్కవిశ్రేష్ఠులు
సంస్కారహృదయులు సద సద్వివేకులు
తిక్కన వేమనలు తెలుగు మేధావులు

పంచేంద్రియంబుల వంచనను బరిమార్చి
సచ్చరిత్రంబున శాంతి మార్గము నిచ్చు
సంగీతసాధకుని సహృదయ తిలకుని
త్యాగయ్య గని ఆంధ్రి ధన్యురా లయ్యెను

వెంకటరత్నము వీరేశలింగము
అప్పరాయ మనీషు లాంధ్రులకు గురువులూ
ఇదె ఆంధ్రసంస్కృతి ఇవె తెల్గువెలుగులు
ఆంధ్రసంస్కృతి ఇలన్ అలరింపజేయుసీ।

('యువజనసేవాసంఘము' వెంగంపేట తమళనాడు.
రజితోత్సవ సంచిక 1980–81 లోనిది)

## జేజేలు

కొండూరు వీరరాఘవాచార్యులు

తెలుఁగు రాజుల పతాకల నీడలో జనుల్
    సుఖనిద్రగన్న రోజులు దలంచి
తెలుఁగు శిల్పుల కళావిలసనమ్ములకు ది
    గ్దేశముల్ కైసాచు దినములరసి
తెలుఁగు సంస్కృతి కెడందలు పల్లవింప దీ
    వులు గడించిన నేరుపుల నెఱింగి
తెలుఁగు యోగుల యుపదేశము ల్విని ఖండ
    ఖండము ల్తరియించు గాథలెన్ని

తెలుఁగు టిల్లాంధ్ర మేలైన చెలువములకు
జగము కైవార మొనరించు చరితదడవి
తెలుఁగుల గురుత్వ మహిమ బుద్ధిందలంచి
తేలుఁగు తల్లికి జేజేలు సలుపవోయి

('అమరావతి' అనే ఖండకావ్యంలోనిది సం.॥ప్ర. తేది 1950)

## ఉపదేశము

కొండూరు వీరరాఘవాచార్యులు

ఏ విశిష్ట ముహూర్తమందిచట బౌద్ధ
చైతన్యమున కంకురార్పణ సలిపినారొ
మూడు పూలాఱుకాయలై ముమ్మరించె
శిల్పమును ధర్మమును జేయిదేయి గలిపి

ఎం దహింసాధర్మ మినుమడించుట జన్న
ములు జాతరలు రూపములు దొఱంగె
ఎందు జాతివిభేద మినుమంత పొడసూప
దావహిల్లను మానవాళి సమత
ఎం దింద్రియములు యమింపంగఁబడి మహా
నిర్వాణపథము రాణించుప్రజకు
ఎందు సర్వజ్ఞ మునీశ్వర బోధ సు
ధాసార మెదవకు తన్పు జనుల

అట్టి బౌద్ధ మతమ్ము సర్వావనీ త
లాన వ్యాప్తమ్ము సేయఁగా బూనె నౌర!
మగధ భువనాధిపతి విశ్వమాన్యుఁడౌ న
శోక నరపాలు దవగత శోకుఁడగుచు

విహరించినది తెల్గువీరుల బావుటా
ధర్మమ్ముతో దిగంతముల యందు
దిద్దితీర్చినది, దిగ్దేశమ్ములను నాంధ్ర
సంస్కృతి నూత్న వాసనలు చిమ్మి
అవరించినది భూమ్యాకాశములు నిండ
వైదికాంధ్రుల కళాప్రాభవమ్ము
అదరించినది దయార్ద్రచిత్తము యోగ్య
తా మూలమగు నేమతంబునైన

శాంతి దైవార సర్వ ప్రజానుతమ్ము
వెలయజేసిన దలనాటి తెలుఁగుజాతి;
"తెలుగుమీజె" సటన్న మేల్పలుకు జగతి
నిండి ధాటంగ మన పురాఖండయశము.

ఈ కృష్ణాతటినీ తటంబులను భూమీగాన చైత్యం బొకం
డే కాలంబులు బౌద్ధధర్మంబు పుష్పింపంగ సృష్టించి ప్రే
మాకారుండగు శాక్యసింహముని పాదాబ్జద్వయీ దివ్యపూ
జా కైంకర్యమొనర్చ యాంధ్ర జనతాస్వాంతంబు లింపొందఁగా.

గౌతమీ కృష్ణా ద్వయాంతపుణ్యాపగ
లాదరించినది యీ యాంధ్రభూమి
తిరుపతి మంగళాద్రి ప్రముఖాద్భుత
క్షేత్రము ల్గలవీ పవిత్రజగతి
శరణాగతత్రాణ శరణ దీక్షావిధి
నందె వేసినది యీ యాంధ్రజాతి
గుణమె పూజాస్థానమని గౌరవించు ను
దార చారిత్రు లాంధ్రప్రభువులు

ఇన్ని యుత్కృష్టగుణముల వన్నెకెక్క
తెలుఁగు దేశములో బుద్ధదేవుమహిమ
పరిఢవిల్లె నేని బంగారు పరిమళించి
నట్టులే యాంధ్రదేశ మహస్సు వెలుఁగు

భువన సంతారకములైన బుద్ధదేవు
మహిత మంగళ సత్య ధర్మంబు లిచట
పాదుకొని దిగ్విదిక్కుల ప్రబలం కమృత
దివ్య సందేశ సుఖము లందించుఁగాత.

('అమరావతి' అనే ఖండకావ్యంలోనిది సం.ప్ర. తేది. 1950)

# తెలుగువాడు

సి. నారాయణరెడ్డి

శాతవాహనుల వంశాన పుట్టినవాడు
కాకతీయుల పోతుగడ్డ మెట్టినవాడు
పల్లెలోనే కాదు ఢిల్లీలో సైతమ్ము
పెద్దగద్దెల నేలి పేరుకెక్కినవాడు

ఎవడయ్య ఎవడువాడు, ఇం
కెవడయ్య తెలుగువాడు

పంచెకట్టుటలో ప్రపంచాన మొనగాడు
కండువా లేనిదే గడపదాటనివాడు
పంచభక్ష్యాలు తన కంచాన వడ్డించ
గోంగూర కోసమై గుటక లేసేవాడు

ఎవడయ్య ఎవడువాడు, ఇం
కెవడయ్య తెలుగువాడు

తల్లిభాషకు వేరు ఇల్లుకావలెనంచు
రైళ్ళపతగొట్టి మారాము చేసెను నాడు
ఏకభాషకు రెండు ఇళ్ళు కావలెనంచు
అఖిల భారతమునే అదరగొట్టెను నేడు

ఎవడయ్య ఎవడువాడు, ఇం
కెవడయ్య తెలుగువాడు

తెలుగు భాసను జుంటితేనె యని తెగపొగడి
పొరిగింటి పులుపుపై మరులు పెంచినవాడు

దేశ భాషలలోన తెలుగు లెస్సని చాటి
మల్లెలకు ఇదుల్లు లిల్లీలు ఫలించినవాడు

ఎవడయ్యా ఎవడువాడు, ఇం
కెవడయ్యా తెలుగువాడు

ఒకచేత మజ్జిగను ఒడిసి పట్టినవాడు
ఒకచేత మధుపాత్ర పొదివి పెట్టినవాడు
ఒకముహూర్తాన ఇంచుక బుర్రగోకుకొని
చల్ల పంచినచేత కల్లుపంచినవాడు

ఎవడయ్యా ఎవడువాడు, ఇం
కెవ్వడయ్యా తెలుగువాడు

వేల నర్థెసల దేరాలు నాటినవాడు
అన్ని మానలలోన అట్టె ఒదిగినవాడు
"ఏ దేశమేగినా ఎందు కాలిడినా"
ఆవకాయ వియోగ మసలె సైపనివాడు

ఎవడయ్యా ఎవడువాడు, ఇం
కెవడయ్యా తెలుగువాడు

మంచిమన సెదురైన మాల లిచ్చేవాడు
భాయి భాయీ అన్న చేయి కలిపేవాడు
తిక్క రేగిందంటె డొక్క చీల్చేవాడు
చిక్కు లెరుగనివాడు చిత్తానపనివాడు

ఎవడయ్యా ఎవడువాడు, ఇం
కెవడయ్యా తెలుగువాడు.

(ఆంధ్రప్రదేశ్ అవతరణోత్సవంనాడు ఆలవోకగా వ్రాసినది. "మరోహరివిల్లు" అనే కవితా సంపుటిలోనిది. నం.ప్ర. తేది 1969)

## తెలుగువాడు

జె. బాపురెడ్డి

వెలుగులోనుంచి పుట్టినవాడు
తెలుగువాడు
వేలాది వసంతాల విజయచ్ఛత్రంక్రింద
విజ్ఞానపీఠం వేసుకున్నాడు తెలుగువాడు
కాలజ్ఞానం తెలిసిన కలకంఠం తెలుగువాడు
ప్రగతి వితతాది అక్షయ కాలరూపాలు
కనగలిగిన కళామయుడు తెలుగువాడు
విశాల భారతదేశం
విరజిమ్మే విప్లవహాసం
తెలుగువాడు ఈనాడు
హిందూ మహాసాగరతీరం మీద
తన గుండె గోదావరిని పిండి
శక్తిని వెలిగించే
స్నేహధారలు చిమ్ముతున్నాడు
చీకట్లను చీల్చివేసే
శివతాండవం చేస్తున్నాడు
తెలుగువాడు
కష్టజీవుల కదలి కెరటాలు
ఎత్తిపట్టిన
పిలుపు పిడికిలి
సింహాచల శిఖరంక్రింద
విశాఖ వీరభూమిలో
దారిద్ర్య పిశాచంమీద దండెత్తిన
ఉగ్ర భారతలక్ష్మికి

ఉక్కు కవచం తెలుగువాడు
శ్రీశైలం శిఖరంమీద
కృష్ణమ్మ కంఠసీమలో
విశాల భావ విద్యున్మాలలువేసి
ఆమె నయన తారాకాంతుల్లో
పచ్చలకలలు రాశులుపోసి
గంగమ్మలా గౌరవించే
త్యాగధనుడు తెలుగువాడు
రాగధనుడు తెలుగువాడు
ఇటు మలేషియా నుండి
అటు అమెరికా దాక
అటు మారీషస్ నుండి
ఇటు మాస్కో దాక
తన ఆత్మనాద వేద సంస్కృతినీ
అనంత సత్య సాహిత్యాన్ని వెదజల్లి
సోదర మానవకోటికి
ఆదరణీయుడైనవాడు తెలుగువాడు
సౌజన్య రాజన్య కేతనుడు
శ్రీకార దర్శన చిదానంద చేతనుడు
తెలుగువాడు ఈనాడు.
త్రిలోకాలనూ త్రికాలాలనూ
తన అచంచల భక్తిశక్తితో ఆతకూర్చి
ఏడుకొండలుగా మార్చితీర్చి
అఖిల జగానంద గోవిందునికి
ఆలయం నిర్మించిన
అద్వితీయ ఆగమశిల్పి తెలుగువాడు
మూగవోయిన
జన జీవన మంజీరగళంలో

నవ చైతన్యేందిర చేత
క్రాంతినాదాలు పలికించిన
కర్మవీరుడు తెలుగువాడు
ఢీకొన్నవాని పనిపట్టి
ఆకొన్నవానికి అన్నంపెట్టే
దండనాధుడూ దయామయుడూ
తెలుగువాడు.

('మనచేతుల్లోనేవుంది' అనే పుస్తకంలోనిది సం. ప్ర. తేది. 1986)

## తెలుఁగువాడు

క్రొవ్విడి వెంకటరత్న శర్మ

శిల్ప లావణ్యంబు సిరిగ్రుమ్మరింపంగ
శిలలను దొలపించెఁ దెలుఁగుశిల్పి
కల్పంపు విన్నాణ ముబ్బింప నుడి, జుంటి
తేనియ లొలికించె దెలుఁగు సుకవి
కదనరంగంబుల క్షాత్రతేజము గ్రక్క
బలదర్పములఁ జూపె దెలుగుజోదు
భక్తి వైరాగ్యముల్ ప్రభవింపఁ గురిపించె
దెసల భాష్యపు సుధల్ తెలుఁగువేత్త

తర్క మీమాంస, సాంఖ్యముల్ తరచినాడు
తత్త్వ శాస్త్ర రహస్యముల్ తడవినాడు
బ్రహ్మవిద్యను జగతిలో బంచినాడు
లలిత మర్యాద గలవాఁడు తెలుఁగువాడు

ఉత్కలాశానితం బోర్వి భాగంబుల
మిగుల నెయ్యముతోడ మెలఁగినాడు
మధ్యరాష్ట్రమునందు మధ్యాహ్న సూర్యుఁడై
దానధాప్రశస్తి దనరినాడు
కర్ణాట వేకులఁ గలిసిన సంవాసించి
కావ్యరీతుల నెల్లఁ గఱపినాడు
ద్రవిడ భూములకేగి తమిళపాటను దిద్ది
సంగీతసుధ వెదఁజల్లినాడు

తొలుతనుండియు "లా" కేత్వములును "దా" కు
కొమ్ములుంచక, స్నేహంబె కోరినాడు
తెలివితేటలతోడ నల్దిక్కులందు
తేజరిల్లినవాఁడు మా తెలుగువాఁడు

సూత్రయుగమునుండి శాత్రవులం దోలి
భరతఖండమును గాపాడినాడు
శాలివాహననామ శకమును స్థాపించి
విశ్వవిఖ్యాతిచే వెలిఁగినాడు
సత్యాగ్రహోద్యమ సవనగుడమునందు
చివ్వరపిడుగట్లుఁ జొచ్చినాడు
చీరాలపేరాల క్షేత్రరంగములందు
స్వాతంత్ర్యసమరముల్ సలిపినాడు

చిరమహోజ్జ్వల యశమునఁ జెలఁగినాడు
మంత్రిపదవులతో మహిఁబరగినాడు
బానిసతనంబు భరియింపలేనివాడు
ఇలపదవమ్మ లొత్తనివాడు తెలుఁగువాడు.

ఆసేతుహిమనగ దేశమంతట మెట్టి
అద్వైతసుధఁ జిల్కయమరినాడు

ద్రవిడ భూమిని బుట్టిరహిమించు భక్తితో
ఘనవిశిష్టాద్వైతమనిచినాడు
భక్తుల కాణాచి వంగ భూమికినేగి
భక్తిచైతన్యంబుఁ బంచినాడు
షట్ఛాస్త్రవేత్తయై సాహిత్య దీపమై
శ్రీనవద్వీప మూరేగినాడు

ఉరుదు, నరచిక్కు, పార్శీలఁ గఱచినాడు
భాగ్యనగరినేనుంగెక్కి ప్రబలినాడు
పూన, సాతారలో గెలుపూనినాడు
దిక్కులన్నిటఁదీపించెఁ దెలుగువాడు.

సర్వసర్వం సహా చక్రమంతయు వెల్గు
దివ్యతేజః స్ఫూర్తి తెలుఁగుకీర్తి
స్వారాజ్య సౌభాగ్య స్వర్గసంపదలంది
మనియెడుగాత మా తెలుఁగు మూర్తి
ప్రాచీన సభ్యత్వ పౌరసత్వము నంది
వెలుఁగు చుండెడు గాత తెలుఁగురక్తి
శమదమంబులఁ గల్గి జగతికి రక్షయై
తేజరిల్లెడుగాత తెలుఁగుశక్తి

మానవాళికి నొరవడిన్మనెడు వాడు
పాడి పంటల సుభగతఁ బరగువాడు
ఇల చతుష్షష్టి కళలను గులుకువాడు
గుణము సత్త్వంబు కలిగిన తెలుఁగువాడు.

[‘ఆంధ్రస్మృతి’ (తెలుగుపీఠులు) అనే పుస్తకంలోనిది.
సం.ప్ర. తేది డిసెంబరు 1946]

## తెలుగుపూలు

నార్ల చిరంజీవి

వేయి తరాలనాడు ప్రభవించిన
నీ మహితాంధ్ర జాతికే
దీ ఇపుడింత స్వేచ్ఛ ?
కలదే తినతిండియు గట్టగుడ్డ ? ఈ
మాయదరిద్ర జీవనము మాయదొ?
శాంతి స్వతంత్ర తాప్తికి
వే ఇక దిక్కు_రా? తెలుగు బిడ్డడ,
లెమ్ము! పురోగమించరా!

మనల గ్రమ్మి నట్టి మాయ చీకటి తీర్చి
తరళకాంతి తోడ తరలివచ్చె
ప్రాగ్దిశాగ్ర మందు స్వాతంత్ర్య భానుండు
నిలచి చూదవోయి తెలుగుబిడ్డ.

మూడు కోట్లమంది ముదు బికలగన్న
తెలుగు తల్లినెపుదు తలచుకొమ్ము
కన్నతల్లి ఘనత కలకైన మరువకు
తెలుగు మేలునీకు తెలుగుబిడ్డ

జన్మభూమి కన్న స్వర్గంబు వేరేది
మాతృభాషకన్న మధురమేది
తల్లికన్న వేరే దైవమింకేదిరా ?
తెలియుమోయి నీవు తెలుగుబిడ్డ

మాతృభూమి కొరకు మరణించినట్టి ఆ
బాలవీరకథలు పాడవోయి
వీరరసము వెల్లివిరియంగ దేశాన
దీప్తినింపవోయి తెలుగుబిడ్డ.

మధుర మధురమైన మనభాషకంటెను
చక్కనైన భాష జగతిలేదు
తల్లిపాలకంటె తనయుల కేపాలు
బలమునీయ గలవు తెలుగుబిడ్డ.

పదియునెన్మిది పర్వాల భారతమును
అఖిలదేశ చరిత్రలు ఆంధ్రచరిత్ర
సర్వమును పెద్దవాడవై చదువుకొనుము
దీక్షబూనగదయ్య ఓ తెలుగు బిడ్డ.

దేశమేదన్నచో తెలుగుదేశమనుము
జాతియేమన్నచో తెలుగు జాతియనుము
వంశమేదన్నచో తెలుగువాడననుము
తెలుగు కీర్తిని చాటుము తెలుగుబిడ్డ.

అలర పలనాటి బాలుడే అన్నయనుము
అమర రుద్రమదేవి నా కవ్వయనుము
తిక్కనామాత్యుడే గురుదేవుడనుము
ఇట్టి వీరాంధ్రజాతిలో బుట్టితనుము

కన్నతల్లివోలె కాపాడుచుండును
మూడువేళలందు భుక్తిపెట్టి
పంటసిరులనిచ్చు బంగారుగడ్డరా
తెలుగు పొలములన్న తెలుగుబిడ్డ.

తగని వైరమందు తలదూర్చగాబోకు
వైరినెదుట శిరము వాల్చరాదు
అరుల కలవిగాని ఆత్మాభిమానమే
తెలుగువారి కలిమి తెలుగుబిడ్డ.

('తెలుగుపూలు' అనే సంకలనంలోనిది. సం ప్ర. తేది 1977)

# గోదావరి

బొడ్డు బాపిరాజు

తల్లీ! గోదావరి! నీ
పిల్లలకైనెన్ని పగలు ప్రేరేచినవో!
ఇల్లూ వాకిలివెల్లువ
కొల్లలుగాఁదిని నవ్వుకొని పొంగితివే!

అల్పుల్ మానవులెంత? వారల భవిష్యంబెంత? మున్నీటిచెన్
వేల్పుంబట్టపురాణి వీవలిగి రావే కాక తీయూళ్ళ. ఈ
పొల్పుల్ పిచ్చుకగూళ్ళుగా కరగి పోవో! ఈ మహానర్థ సం
కల్పం బేటికి గల్గెనేటికి? జగత్కల్యాణ సంధారణీ!

చల్లనితల్లి! నీ చెరగుదాటున నిచ్చట పాడిపంట వ
ర్ధిల్లిన శ్రీ విహారములు తీరములియ్యవి : నేదదృష్టముల్.
చెల్లి, భవజ్జల ప్రళయలీలకు రంగములై ఎటుల్ కుమా
ళిల్లుచు నున్నవో. అవధరింపుము స్వీయ క్రుధా కథానికల్.

అమృత స్తన్యములిచ్చి, కమ్మని ప్రవాహ శ్రావ్యగీతానినా
దములన్ జోలలుపాడి, మంద పవనోద్యత్ క్రీడ జోకొట్టి, కూ
రిమివైపెంచిన క్షేత్ర పుత్రికల ధీరిన్ అన్నపూర్ణావతా
రమ్ములన్ రాక్షసవృత్తిని వరదపాల్ సల్పన్ మనస్సొప్పెనే?

వరుణ విరోధ భావములవగ్రహముల్ కలిగింప, కుంది వం
దురు టయినంతలో నిలువుదోపిడి దోచినవీ యపార దు
ర్భరములు నీ యనుగ్రహములందిక! వన్నదా రామపాద సా
గరమున నానకట్ట గలుగన్ మరిసాగునె నీ ప్రతాపముల్!

ఏ గ్రహకూటముల్ మొనసి యింతపుటిల్లినా! రాష్ట్రలోగ స
మ్యగ్రములైన ఈ శుభదినాను భవమ్ముల గుండెలాగు నీ
యుగ్రతరంగ తాండవమొహో! ఎదురయ్యెను సాధు దైవతా
నుగ్రహముల్ శమించెనె అనుంగు తెలుంగుల వార్ధి సుందరీ!

స్వాదు పయస్వినీ! మధుర సంస్కృతితోచును భావ వీధి, వి
ద్యాదయితుండు నన్నయయు తత్కృత భారత ముఖ్యల
ప్రసామోదముతోడ మా తెలుగు భూములకేదుగడైన పెద్ద ము
త్తైదువవీవు పాడియె దురాగ్రహముల్? అశుభావకారికల్!

దుడుకుం గిన్నెరసానియో, శబరియో తోడై నినుండ్రోయగా
నడుగుల్ సాగక ఎంత జాలిపడి యందం దాగియుప్పొంగినన్
కరకట్లె స్వజనోగ్ర మార్గములు ద్రొక్కన్ తప్పదోగాక, నిన్
గడు శాంతాకృతినిన్ ఎరుంగరటె అంకస్థాను లిన్నాళ్ళుగా!

జీవనమూర్తి వీవు తొలిజేసిన యేళ్ళవికోటి గాలికిం
బోవగ, నిల్చిపోవు నిక ముద్రగనీ ఒక కీడుతల్లి, గో
దావరి! నీ కృపామధుర ధారలలో విషబిందువట్లు నం
భావనసేయ ఆంధ్రుల తపఃఫలరూపము లీవు కృష్ణయున్.

నీ యడుగు పసిడి యందెలు
మ్రోయగ స్వర్ణమును విలిచె మును పానీమల్!
నీ యసివారుల నిపుడ
న్యాయముగానలిగి నరకమైనవి జననీ!

(అక్టోబరు 1968 'భారతి' మాసపత్రికలోనిది)

# గోదావరి

కంధగంటి హనుమచ్ఛాస్త్రి

త్ర్యంబకాచల దివ్యరాజీవ కర్ణికా
    స్రవదచ్ఛతర మకరందధార
భద్రాద్రి రఘునాథ పావనసేవనా
    పొందియా విష్ణుపాదోదకమ్ము
నవరత్న విలస దర్ణవ రాజరాజన్యు
    వాఙ్మయ ముగ్ధ శుద్ధాంత జనము
స్వాభ్యుదర్శన జాత హర్షభృద్గాతము
    లాలన మురియు గారాలకూచి

ప్రకట చాళుక్య వంశజ రాజరాజ
భూను పర్వాదినాథకేళీ సరస్సు
ఆంధ్ర భూ భాగనిత్యకల్యాణ వల్లి
గౌతమీదేవి మముఁ బెంచు కన్నతల్లి

ఓ గోదావరి తల్లి నిన్గనిన వేవో మాతృసాన్నిధ్య శ్రీ
లాగంధమ్ములు తోచినెమ్మదిని చల్వల్ నిండు, నీయంక పీ
ఠాగారమ్మున బాల్యమాదిగను ధన్యంబయ్యె నా జన్మ నీ
రాగానంత పయస్సమాకలన పుత్రస్ఫూర్తినుప్పొంగెదన్

నావలె నీయొడిన్ పెరిగినాడటవే భవభూతి తొల్లి త
ల్లీ, వివరమ్ముగా పలుకలేని పురాహృదయాను బంధముల్
మోవగ నిన్దలంచి పరిముగ్ధుడగున్ రసవత్కవిత్వ సం
భావన నీ మనోజ్ఞ గరిమమ్ములు మాటికి పాటఁ బాడెడిన్.

వేసవి తొడిమలవీడి జల్లలరాలు
    కుసుమ సంతతి నిన్నుఁ గొలిచినాఁడు
నీపట్టు చినుక తిన్నెల నంచయాటల
    నీతమ్మఁ బసిపాపఁ జేసినాఁడు

తల్లని నీగుండె ఝల్లన రఘురాము
    ప్రణయబాధాగాథ పలికినాఁడు
మగఱాల నీ నీట సొగయు నడవి సౌరు
    జూచి చూచియుఁ దలయూఁచినాఁడు

జననిఁ నీ చెంతఁ బెరిగిన జంతువృక్ష
ములను గూడ బంధువులందు మురిసినాఁడు
ఎంత చక్కని ప్రేముడి నిడెనో నిన్ను
తల్లిగాఁ బుట్టినిల్లుగాఁ దలఁచినాఁడు

ఓ పురాణ ప్రవంతికాఁ తుంగభద్ర
శాశ్వత కీర్తి ఓ విత స్వచ్ఛధర్మహృదయ
ఏల మౌన యత్రావిధి సేగెదమ్మ!
నిలిచి యొక మాపురాకథఁ బలుకరాదె!

శ్రీ విష్ణువర్ధన క్షితి పాలకోత్తము
    ప్రియవసద్ములు మాకు విడిచె నమ్మ,
సకలాంధ్ర సుకవితాచార్య సోముఁ డన్న
    దేశకుందేమి సందేశ మొసఁగె,
ఆంధ్రప్రతాప గ్రీష్మార్కులు మా రెడ్డి
    ప్రభువులు మాకేమి పలికిరమ్మ
కస్తూరి భోగి నాయకమిరాజు నెత్తావు
    లీను నేకవిత నీలోనఁ గదలు,

నాటి తెలుఁగుల దీపరిపాటి, మేటి
తేజమేమయ్యెనో యని తెల్లబోయి
గతమునకు బిట్టు శోకింపగాదు మాదు
చేవ చరితలు దెలిపి యాశీర్వదింపు.

('మధువని' అనే సంకలనంలోనిది. సంప్రస్క తేది 1959)

# వేదంలా గోదావరి

ఆరుద్ర

వేదంలా గోదావరి ప్రవహిస్తోందే చెల్లి
పెన్నెలవలె కృష్ణవేణి విహరిస్తోందేతల్లి

విశాలాంధ్ర నలుమూలల
వైవాహిక వైభోగం
జనుల కనుల వెలుగులలో
బాజాలు వారెడి రాగం

గెల వేసిన అరటిచెట్లు తీసుకురానా తల్లి
ఎల మామిడి తోరణాలు కట్టనా చెల్లి

గడప మీద చిగుతు పిల్ల
గరిపోడిచెను కోక
ముంగిట ముత్యాల నవ్వు
రంగవల్లి సుప్రభ

ఏరువాక పడవలాగ ఎద ఊగిసలాడునే
కోడెద్దుల బండివలె గుండెలురికి సాగునే

కల్యాణ తిలక రేఖగ
కస్తూరి బొట్టుదిద్దవే
తెలుగు వెలది బుగ్గమీద
దిష్టి చుక్క పెట్టవే

తలంబ్రాల తనిసి నటుల ధరణి తోచునే చెల్లి
వసంతాల తడిసి నటుల సంబరమెరయునే తల్లి

జనావళికి సంతతం
సంతోష ప్రాప్తి
విశాలాంధ్ర నిండా
వైవాహిక దీప్తి

తుత్తారా మాదిరిగా తుంగభద్రనాదమే.
సన్నాయికి మల్లే పెన్నానది గానమే.

['ఆంధ్రపత్రిక' ప్రథమభాగంలోనిది. సం.ప్ర. తేది 1939]

## గోదావరి

కొవ్విడి వేంకటరత్నశర్మ

విమలంబై శుభదాయియై, శరదుదావిర్భూత నైర్మల్యంబునై
కమనీయంబయి, కర్షకావళికిఁ బెన్ కల్పద్రుమంబై, సదా
సుమనఃప్రోజ్జ్వలమై, మునీంద్ర జనసంస్తుత్యంబునై యొప్పు నీ
వమలోదాత్త మనీషవై బ్రతుకుమమ్మా! తల్లి గోదావరీ!

జననం బొందిరి నీదుగర్భమున నీస్తన్యంబులేఁ ద్రావితిన్
ఘనవాగర్థము లెన్ని నేర్చితిని, ఆంధ్రాంగ్లంబులన్ నీకడన్
మును నీ వీచికలందు గ్రుంకులిడితిన్ బంగారు మిత్రాళితోన్
ఘనకీర్తిన్ వెలుగొందుమీవు జననీ! కల్యాణి! గోదావరీ!

పారావారసుసాధ్వి! నీవయిడిగర్భం బందునన్ వజ్రముల్
తోరం బొప్పు కళావిలాసములతోఁ దూగాడ నీర్ష్యన్నరుల్
వైరఁబూనికరంబు నీకడుపుఁదిప్పల్ గ్రెత్తు పెన్గట్టుచేన్
ఏ రీతిన్ జరియింపఁదప్పవు కదా! యిక్కట్లు గోదావరీ!

## తెలుగుపూలు

నార్ల చిరంజీవి

వేయి తరాలనాడు ప్రభవించిన
        నీ మహితాంధ్ర జాతికే
దీ ఇపుడింత స్వేచ్ఛ?
        కలదే తినతిండియు గట్టగుడ్డ? ఈ
మాయదరిద్ర జీవనము మాయదొ?
        శాంతి స్వతంత్ర ప్రాప్తికి
వే ఇక దిక్కురా? తెలుగు బిడ్డడ,
        లెమ్ము! పురోగమించరా!

మనలగ్రమ్మి నట్టి మాయ చీకటి తీర్చి
తరళకాంతి తోడ తరలివచ్చె
ప్రాగ్దిశాగ్ర మందు స్వాతంత్ర్య భానుండు
నిలచి చూడవోయి తెలుగుబిడ్డ.

మూడుకోట్లమంది ముద్దు బిడ్డలగన్న
తెలుగు తల్లినెపుడు తలచుకొమ్ము
కన్నతల్లి ఘనత కలదెన గురువకు
కలుగు మేలునీకు తెలుగుబిడ్డ

జన్మభూమి కన్న స్వర్గంబు వేరేది
మాతృభాషకన్న మధురమేది
తల్లికన్న వేరే దైవమింకేదిరా?
తెలియుమోయి నీవు తెలుగుబిడ్డ

మాతృభూమి కొరకు మరణించినట్టి ఆ
బాలవీరకథలు పాడవోయి
వీరరసము వెల్లివిరియంగ దేశాన
దీప్తినింపవోయి తెలుగుబిడ్డ.

మధుర మధురమైన మనభాషకంటెను
చక్కనైన భాష జగతిలేదు
తల్లిపాలకంటె తనయుల కేపాలు
బలమునీయ గలవు తెలుగుబిడ్డ.

పదియునెన్మిది పర్వాల భారతమును
అఖిలదేశ చరిత్రలు ఆంధ్రచరిత్ర
సర్వమును పెద్దవాడవై చదువుకొనుము
దీక్షబూనగదయ్య ఓ తెలుగు బిడ్డ.

దేశమేదన్నచో తెలుగుదేశమనుము
జాతియేమన్నచో తెలుగు జాతియనుము
వంశమేదన్నచో తెలుగువాడననుము
తెలుగు కీర్తిని చాటుము తెలుగుబిడ్డ.

అలర పలనాటి బాలుడే అన్నయనుము
అమర రుద్రమదేవి నా కప్పయనుము
తిక్క నామాత్యుడే గురుదేవుడనుము
ఇట్టి వీరాంధ్రజాతిలో బుట్టితనుము

కన్నతల్లివోలె కాపాడుచుండును
మూడువేళలందు భుక్తిపెట్టు
పంటసిరులనిచ్చు బంగారుగడ్డరా
తెలుగు పొలములన్న తెలుగుబిడ్డ.

తగని వైరమందు తలదూర్చగాబోకు
వైరినెదుట శిరము వాల్చరాదు
అరుల కలవిగాని ఆత్మాభిమానమే
తెలుగువారి కలిమి తెలుగుబిడ్డ.

('తెలుగుపూలు' అనే సంకలనంలోనిది. సం ప్ర. తేది 1977)

## గోదావరి

బొడ్డు బాపిరాజు

తల్లీ! గోదావరి! నీ
పిల్లలపైనెన్ని పగలు ప్రేరేచినవో!
ఇల్లూ వాకిలివెల్లువ
కొల్లలుగారని నవ్వుకొని పొంగితివే!

అల్పుల్ మానవులెంత? వారల భవిష్యంబెంత? మున్నీ దేవెన్
వేల్పుంబట్టపురాణి ఏవలిగి రావే కాక ఈయూళ్ళు. ఈ
పొల్పుల్ పిచ్చుకగూళ్ళుగా కరగి పోవో! ఈ మహానర్థ సం
కల్పం బేటికి గల్గెనేటికి? జగత్కల్యాణ సంధారణీ!

చల్లనితల్లీ! నీ చెరగుదాటున నిచ్చట పాడిపంట వ
ర్థిల్లిన శ్రీ విహారములు తీరములయ్యెవి : నేడదృష్టముల్.
చెల్లి, భవజ్జల ప్రళయలీలకు రంగములై ఎటుల్ కుమా
రిల్లుచు నున్నవో. అవధరింపుము వ్యాయత్రుదా కథానికల్!

అమృతస్తన్యములిచ్చి, కమ్మని ప్రవాహ శ్రావ్యగీతానినా
దములన్ జోలలుపాడి, మంద పవనోద్యత్ క్రీడ జోకొట్టి, కూ
రిమివైపెంచిన క్షేత్ర పుత్రికల పేరిన్ అన్నపూర్ణావతా
రమ్ములన్ రాఘవమ్మర్తిని వరదపాల్ సల్పన్ మనస్సొప్పెనే?

పరుష విరోధ భావములవగ్రహముల్ కలిగింప, కుంది వం
దురు టయినంతలో నిలువుదోపిడి దోచినవీ యపార దు
ర్భరములు నీ యనుగ్రహములంబికః వన్నధా రామపాద సా
గరమున నానకట్ట గలుగన్ మతిసాగునె నీ ప్రతాపముల్ ।

ఏ గ్రహకూటముల్ మొనసి ఇంతమదిల్లెనొః రాష్ట్రరోగ న
మ్యగ్రములైన ఈ కుటదినాను భవమ్ముల గుండెలాగు నీ
యుగ్రతరంగ తాండవమొహోః ఎదురయ్యెను సాదు దైవతా
నుగ్రహముల్ శమించెనె అనుంగు తెలుంగుల వార్ధి సుందరీ!

స్వాదు వయస్వినీః మధుర సంస్కృతితోచను భావ వీధి, వి
ద్యాదయితుండు నన్నయయు తక్కృత భారత ముఖ్యల
ప్రసామోదముతోడ మా తెలుగు భూములకేదుగదైన పెద్ద ము
త్తైదువవీవు పాడియె దురాగ్రహముల్ః అశుభావతారికల్!

దుడుకుం గిన్నెరసానియో, శబరియో తోడై నిమంద్రోయగా
నడుగుల్ సాగక ఎంత జాలివడి యందం దాగియుప్పొంగినన్
కదకిట్టి స్వజనోగ్ర మార్గములు ద్రొక్కన్ తప్పదోగాక, నిన్
గడు శాంతాకృతినిన్ ఎడుంగరదె అంతస్థాను లిన్నాళ్ళుగా!

జీవనమూర్తి వీవు తొలిజేసిన యేళ్ళవికోటి గాలికిం
బోవగ, నిల్చిపోవు నిక ముద్రగనీ ఒక కిడుతల్లి, గో
దావరి! నీ కృపామధుర ధారలలో విషబిందువట్లు సం
భావనసేయ ఆంధ్రుల తపఃఫలరూపము లీవుకృష్ణయున్.

నీ యడుగు పసిడి యందెలు
మ్రోయగ స్వర్ణమును విలిచె మును పానీమల్!
నీ యనివారుల నిపుడ
న్యాయముగానలిగి వరకమైనవి జననీ!

(ఆక్టోబరు 19౫౪ 'భారతి' మాసపత్రికలోనిది)

# గోదావరి

ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి

త్ర్యంబకాచల దివ్యరాజీవ కర్ణికా
స్రవదచ్ఛతర మకరందధార
భద్రాద్రి రఘునాథ పావనసేవనా
శాదియౌ విష్ణుపాదోదకమ్ము
సకలరత్న విలస దర్ణవ రాజరాజస్యు
స్వాత్మీయ ముగ్ధ శుద్ధాంత జనము
స్వాభ్యుదర్శన జాత హర్షభృద్గీతము
లాలన మురియు గారాలకూచి

ప్రకట చాళుక్య వంశజ రాజరాజ
భూసు పర్వాధినాథ కేళీ సరస్సు
ఆంధ్ర భూ భాగనిత్యకల్యాణ వల్లి
గౌతమీదేవి మముఁ బెంచు కన్నతల్లి

౬. గోదావరి తల్లి నిన్ననిన వేవో మాతృసాన్నిధ్య శీ
లాగంధమ్ములు తోఁచినెమ్మదిని చల్వల్ నిండు, నీయంక పీ
ఠాగారమ్మున బాల్యమాదిగను ధన్యంబయ్యె నా జన్మ నీ
రాగానంత పయస్సమాకలన పుత్రస్ఫూర్తినుప్పొంగెదన్

నావలె నీయొడిన్ పెరిగినాడటవే భవభూతి తొల్లి త
ల్లీ! వివరమ్ముగా పలుకలేని పురాహృదయాను బంధముల్
మోవగ నిన్దలంచి పరిముగ్ధతగున్ రసవత్కవిత్వ సం
భావన నీ మనోజ్ఞ గరిమమ్ములు మాటికి పాటఁ బాడెడిన్.

వేసవి తొడిమలవీడి జల్లలరాలు
కుసుమ సంతతి నిన్నుఁ గొలిచినాఁడు
నీవట్టు చినుక తిన్నెల నంచయాటల
నీతమ్ముఁ బసిపాపఁ జేసినాఁడు

తల్లిని నీగుండె ఝల్లన రఘురాము
ప్రణయబాధాగాథ పలికినాఁడు
మృగణాల నీ నీట సొగయు నడవి సౌరు
చూచి చూచియుఁ దలయూఁచినాఁడు

జనని నీచెంతఁ బెరిగిన జంతువృక్ష
ములను గూడ బంధువులందు మురిసినాఁడు
ఎంత చక్కని ప్రేముడి నిడెనొ నిన్ను
తల్లిగాఁ బుట్టినిల్లుగాఁ దలఁచినాఁడు

ఓ పురాణ స్రోతరతికిఁ దెలిగయుగాంధ్ర
శశివిశద కీర్తి ఓ భక్త స్వచ్ఛహృదయ!
ఏల మౌన యత్రావిధి నేగెదమ్మ?
నిలిచి యొక మాపురాకథఁ బలుకరాదె!

శ్రీ విష్ణువర్ధన క్షితి పాలమౌళు
ప్రియవతమ్ములు మాకు వినిచె నమ్మ!
సకలాంధ్ర సుకవితాసార్వభౌముఁడనన్న
దేశకుండేమి సందేశ మొసఁగె?
ఆంధ్రప్రతాప గ్రీష్మార్కులు మా రెడ్డి
ప్రభువులు మాకేమి పలికిరమ్మ
కస్తూరి భోగి మాకవిరాజు నెత్తావు
లీను నేకవిత నీలోనఁగదలు?

నాఁటి తెలుఁగుల దీవరిపాటి, మేటి
తేజమేమయ్యెనో యని తెల్లబోయి
గతమునకు బిట్టు శోకింపగాదు మాదు
చేవ చరితలు దెలిపి యాశీర్వదింపు.

('మధువని' అనే సంకలనంలోనిది సం॥: తేది 1969)

# వేదంలా గోదావరి

ఆరుద్ర

వేదంలా గోదావరి ప్రవహిస్తోందే చెల్లీ
వెన్నెలవలె కృష్ణవేణి విహరిస్తోందేతల్లీ

విశాలాంధ్ర నలుమూలల
వైవాహిక వైభోగం
జనుల కనుల వెలుగులలో
జాజులు వారెడి రాగం

గెల వేసిన అరటిచెట్లు తీసుకురానా తల్లీ
ఎల మామిడి తోరణాలు కట్టనా చెల్లీ

గడప మీద చిగురు జల్ల
గరిషోడిసైను శోభ
ముంగిట ముత్యాల నవ్వు
రంగవల్లి సుప్రభ

ఏరువాక పడవలాగ ఎద ఊగిసలాడునే
కోడెద్దుల బండివలె గుండెలురికి సాగునే

కళ్యాణ తిలక రేఖగ
కస్తూరి బొట్టుదిద్దవే
తెలుగు వెలది బుగ్గమీద
దిష్టి చుక్క పెట్టవే

తలంబ్రాల తనిసి నటుల ధరణి [illegible]చునే చెల్లీ
వసంతాల తడిసి నటుల సంజమెరయునే తల్లీ

జనావళికి సంతతం
సంతోష ప్రాప్తి
విశాలాంధ్ర నిండా
వైవాహిక దీప్తి

తుక్తారా మాదిరిగా తుంగభద్రనాదమే.
సన్నాయికి మల్లే పెన్నానది గానమే.

['ఆంధ్రపత్రిక' ప్రథమభాగంలోనిది. నం.ప్ర. శేది 1939]

## గోదావరి

కొవ్విడి వేంకటరత్నశర్మ

విమలంబై శుభదాయియై, శరదుదావిర్భూత నైర్మల్యంబునై
కమనీయంబయి, కర్షకావళికి పెం కల్పద్రుమంబై, సదా
సుమనఃప్రోజ్జ్వలమై, మునీంద్ర జనసంస్తుత్యంబునై యెప్పు నీ
వమలోదాత్త మనీషవై బ్రతుకుమమ్మా! తల్లి గోదావరీ!

జననం బొందితి నీదుగర్భమున నీనన్యంబులేఁ ద్రావితిన్
ఘనవాగర్థము లెన్ని నేర్చితిని, ఆంధ్రాంగ్లంబులన్ నీకడన్
మును నీ వీచికలందు గ్రుంకులిడితిన్ బొంగారు మిత్రాళితోన్
ఘనకీర్తిన్ వెలుగొందుమీవు జననీ! కల్యాణి! గోదావరీ!

పారావారనుసాధ్వి! నీవయిడిగర్భం బందునన్ వజ్రముల్
తోరం బొప్పు కళావిలాసములతోఁ దూగాడ నీర్ష్యన్నరుల్
వైరఁబూనికరంబు నీకడుపుఁదిప్పుల్ గ్రొత్తుపెన్గట్టుచేన్
ఏ రీతిన్ జరియింపఁదప్పవు కదా! యిక్కట్లు గోదావరీ!

"శ్రీవాణీ గిరిజాశ్చిరాయురను" నాశీర్వాదసూక్తంబు ము
న్నావిర్భావము నొందె నీదరుల నన్న బ్రహ్మసృష్టిప్రభన్
మా వేంగీ జనయిత్రి జీవనము క్షోణీ మాకు గోదావరీ!

దృప్తాంధ్ర పౌరుషదీప్తి ధావళ్యముల్
పాయలై, తరంగలై పారునేమొ
చాళుక్య భూజాని శౌర్యాగ్ని కీలలు
భూరిస్రవంతులై పొంగునేమొ!
నన్నభట్టసుకవి వాఙ్మాధురీ రసధునుల్
పాకమై, వాకలై పర్వునేమొ
సోమనార్యుని రాగసూక్తి సుధానిధుల్
వెల్లువలై పైకి త్రుళ్ళునేమొ!
ఘన మృకండాత్మజు గౌతమముని సత్య
తేజంబు నీలోన దించునేమొ!

వసుమతీ భాగ భూరి హర్షహేత వలన
కలతఁ జెందిన యాంధ్రలక్ష్మి తిరిగి
గాంచు తా చంద్రతారార్కమంచితముగ
భూమి వర్ధిల్లు గోదావరీసు తల్లి!

('మణిమకుటము' అనే సంపుటిలోనిది- సం.ప్రకటి 1961)

# గద్గద నదద్గోదావరి

జ్యోస్యుల సూర్యప్రకాశరావు

చల దుత్తుంగ తరంగ సంగీతము మత్స్య గ్రాహసంచార సం
కుల గాంభీర్య నినాదపూరితమునై గోదావరీనిర్ఝరీ
కలనా దార్భటీ శ్రోత్రపేయమగుచున్ కల్పించి మోక్షంబు భ
క్తులకున్ స్నాన మొనర్చువేళ, వెలుఁగొందున్ నిత్యకల్యాణియై.

మాదుగృహంబు ముంగిటఁ గ్రమమ్ముగ సాఁగు నదీప్రవాహమున్
స్వాదుత లట్టహాసములు, శారదమౌదరహాసముల్, నిదా
ఘోదయతీక్ష్ణ వాయువులు నున్నత రీతులుఁగంటిఁగాని వ
న్నేది ద్రవింపఁ జేయదుదయించిన గద్గదనాద మట్లుగన్

కొందఱు పతులను బాసియుఁ
గొందలమున చిత్తవృత్తి కుదురక క్లేశం
బందియుఁ గొందఱు, నీలో
మ్రుందిరి తద్ఘోష నీదురవమై చెలఁగన్

నిస్తుల గంభీర నిరుపమ మూర్తి వై
నీ వెంత శోభలనీనుచున్న
భరత భూమిని పాడి పంటల పెరియించి
నీ వెంత భాగ్యమ్ము నెఱపుచున్న
జల విద్యుదుద్భవోజ్జ్వల శక్తి సమకూర్చి
చీకట్ల నీవెంత చీల్చుచున్న
జలయాన సౌకర్య సాధన సంపత్తి
కీవెంత దోహదమిచ్చుచున్న

హీన జనుల సమాయత మానసు...
నీదు గర్భంబులో ప్రమింగి భేదములను
గూర్చుచున్నావు నీకిది కూడునమ్మ!
గౌతమీగంగ!! ప్రాచీ దిగబ్ధి సంగ!!!

కుతుకంబుల్ గలిగించు గద్గద నద ద్గోదావరీ వాహినీ
తతులన్ సవ్వడులవ్ వినంబడును సీతా నేత్ర పంకేరుహ
చ్యుత బాష్పాంబు చయంబులీ తరికి సంతోషంబు గల్పించుచున్
నతి హాలద్వేదనమింత యింత యగునే! చల్లారునే శాంతకున్!

('ఆంధ్రప్రతిభ' మొదటి భాగంలోనిది. సంస్కృ. తేది 1989)

## గోదావరీ! నాదఝరీ!

ముకురాల రామారెడ్డి

గోదావరీ!
నాదఝరీ!

తరతరాల స్మృతులు ఎన్ని
తలచి తలచి పాడుదువో,
మరియెన్ని యుగాలదాక
మా నేలన పారుదువో!

గోదావరీ!
నాదఝరీ!

తమ్మక్కకు మొదటిసారి
దరిసెన మిచ్చిన సామిని
ఏ వాలున దిగమంటివో,
ఎచటకాళ్ళు కడిగితివో

గోదావరీ!
నాదఝురీ!

వడ గాడ్పుల సంధ్యలలో
వచ్చిరె సీతారాములు
నీలో జలకాలాడిరె
నీదేనే పుణ్యమంటె

గోదావరీ!
నాదఝురీ!

అన్నయ్యకు, వదినమ్మకు
అంగరక్షగా తిరిగిన
ఒంటరి లక్ష్మణస్వామికి
ఊర్మిళనే తలపిస్తివా

గోదావరీ!
నాదఝురీ!

నీ సైకత వేదికపై
దోసిలించు పోతన్నకు
నీలమేఘశ్యామమూర్తి
నిజంగానె తోచెనంట.

గోదావరీ!
నాదఝురీ!

శ్రీరాములు విహరించిన
సీమలోనె గుడిలేదని
కబురులన్ని గోపన్నకు
కలలోనే చెప్పితివో

తరతరాల స్మృతులు ఎన్ని తలచితలచి పాడుదువో
మరియెన్ని యుగాలదాక మా నేలను పారుదువో

గోదావరీ!
నాదఝరీ!

(భద్రాచల శ్రీసీతారామ కల్యాణోత్సవ సందర్భం (1978)లో చదివింది.)

('హృదయశైలి' అనే సంకలనగ్రంథంలోనిది సం.ప్ర. తేది 1979)

## గౌతమి

రాంషా

ఓ దివ్య గౌతమీ ఓ భవ్యగంగ
పారకే పారకే పరుగులన్ వారి

నీ నీలినీలాల నినదించు తరగ
చిత్రించు చిత్రాల చిత్రకారులకు

నీ చిరుతరగల నృత్యవిన్యా స
మ్మానదేశుని భంగి నడకించనీవె
నీ చిరుతరగలన్ నినదించు రవళి
న్నాలోన లోలోన నదయాడనీవె

లోలోన కనరాని లోతునీదలను
అమృతమ్ము చిలికించు ఆర్ద్రగాత్రాల
పాడనీ పాడనీ పది మందికవుల
పాడనీ పాడనీ పది మందికవుల

ఓ దివ్య గౌతమీ! ఓ తవ్యగంగ
పారకే పారకే పరువులన్ వారి

వన్నుందు నీనుండి వరతెంచు మదువు
నాలోన లోలోన నదియింపజేసి
నీ నీలి తరగలన్ నిత్యకౌగిలిని
తనుమోద్యనీయవే తవినైన నన్ను

నీ నీలినీలాల నిర్మలత్వాన
ప్రసరించి ప్రవహించు ప్రతతమీ నీ ఆత్మ
మాపైన నిండార ప్రసరించుదనుక
సుడిగొని నదియించి చోద్యమ్ము గొలుపు

ఓ దివ్య గౌతమీ! ఓతవ్యగంగ
పారకే పారకే పరువులన్ వారి

విన్నల యోచనా! నిలుచుండు దాలు
మంజులమ్మగు దివ్య మకరందనదము
ఈ కవీ హృదయమ్ము ప్రవహించి నిన్ను
తకుకొత్తు భావాల తన్నివేసెడిని

ఎందుకే నను వీడి పరుగులన్ పెడుదు?
ఎన్ని శతాబ్దాల ఎరుకయే మనది!
ప్రవహించి ప్రవహించి పరుగెత్తిపోక
నా మాట నా బాధ చెప్పుకోనిమ్ము

ఓ దివ్య గౌతమీ! ఓ తవ్యగంగ!
పారకే పారకే పరుగులన్వారి

('అనంతం' అనే గేయ సంపుటిలోనిది సం ప్ర. తేది 1976

# కృష్ణవేణి

జె. బాపురెడ్డి

కన్నీరు తుడుచుకో కృష్ణవేణి! నీ
కష్టాలు ఈడేరె నమ్మా!
ఇన్నాళ్ళు కన్న కలలన్ని నిజములై
ఆనందములు పండునమ్మా!

అడవి పాలైన నీ అందాల బ్రతుకువకు
కడలి పాలైన నీ సంసార సంపదకు
మంచి నాళ్ళేతెంచె మరచిపో గతగాథ
మధుర భావిని నీకు మరిలేదు ఏ బాధ

నీవు దేశచరిత్ర గర్భాన పుట్టితివి
ఒక మహా ప్రస్థాన మెదియొ తలపెట్టితివి
ఏ నెరుంగుదు జీవనమ్మెందరికొ ఇచ్చి
ఎటులోచకీవె నంద్రము త్రోవ పట్టితివి

నీ మహాగాన నిక్వాణమ్ములో కరిగి
పోయెను శతాబ్దా లవెన్నో,
నీ సుధామయ పుణ్యతీరమ్ములో పెరిగి
పోయె సామ్రాజ్యా లవెన్నో.

కాని నీకొక ఆలయమును కట్టనెలేదు
నే నెరుంగుదు నీకు నిల్వనీడేలేదు

నీదరినె గుండె తడిలేని భూములజూచి
నీముందె ప్రజలు వస్తువడుండుటను జూచి
నిలయమ్ములేక వారికి సాయపడలేక
స్వప్రచైతన్య ధారాశక్తి యంతయున్న

అడవి గాచిన వెన్నెలాయనే యని ఎంత
గా పరితపించినావో నదీ జననీ;
నవయుగారంభోత్సవమ్ములో ఈనాడు
నవ భారత ప్రభాత ప్రభాస్నాతులై
నీ బృహచ్ఛక్తి నిర్భర హృదయము గ్రహించి
తమ జీర్ణ జీవితాలకు సౌఖ్యమాశించి
నీ ప్రజాకోటి దృఢముగ నడుములు బిగించి
నిర్మించు చున్నారు నీకు బంగరు కోట.

అపర బుద్ధావ తారుడగునాగార్జునుని
ధర్మ ప్రబోధ ప్రతిధ్వనితగిరిసీమ
విస్మృతేక్ష్వాకు సామ్రాజ్యనిర్మిత బౌద్ధ
విశ్వవిద్యాలయ కళాపునీతస్థలుల
నిర్మించు చున్నారు నీకు నాగార్జున
సాగర మహాలయము సౌందర్యనిలయమ్ము

నీ కనుల ముందె కళకళలాడి అనాడు
కాల పర్జన్య సంపాత నిర్ఘాతముల
నశియించిన విజయపురము పునర్జన్మించి
నీ ప్రాంగణాన నిత్యమ్ము శోభించు లే
అలనాటి బౌద్ధ శిల్పసుమాల మాలికల
నీ గృహమలంకరింతురు లే జనులు తల్లి!

నీ సేవచేయపడవలు తిరుగు నీ యింట
నీ భవన కుడ్యాలపై విశాల ప్రకృతి
సుందర సువర్ణ చిత్రాలు చిత్రించుచే

నీ నిలయ సౌందర్య గరిమ తిలకించగా
రసికులు, కళాప్రియులు అభ్యుదయ కాముకులు
దేశదేశాలనుండియు చేరవత్తురే
నీ చూపు ప్రసరించునంత దూరమునేల
పల్లవించు, ఫలించు నవ్య జీవనహేల.
నీలాస్య జలపాత జనిత జీవనధ్వనులు
నీహాస విద్యుజ్జనిత కాంతిరేఖికలు
పట్టణాలను పల్లెపల్లెలో ప్రతియింట
కలిగించు మోదమ్ము వెలిగించు భాగ్యాలు.

ఆంధ్రదేశమున కాళాకాంతి నిలయమై
నవ భారతాభ్యుదయమునకు సంకేతమై
బాధాదరిద్రాలపై విజయ చిహ్నమై
నీ భూరిసాగర సదనము వర్ధిల్లు లే
నీ మహాగంభీర హృదయసాగరములో
నీ తేనె కలలు అలలై ఎపుడు అడులే
కన్నీరు తుడుచుకో కృష్ణవేణీ! నీ
కష్టాలు తీరేనమ్మా!

("బాపురెడ్డిగేయాలు" అనే సంపుటిలోనిది. సం.ప్ర. తేది 1987)

# కృష్ణ వేణి

ధారా రామనాథశాస్త్రి

కలికాల కలుషముల కడుగదలంచిన నలువ
తన జనకు కరుణకై తపియించె మున్నెపుడొ
నలువ చేసిన తపము నవనవోన్మేషణమై
నారాయణుని గుండె నవనీతమై కరిగె
శశ్వ దానందార్ద్ర స్పందనాకృతి స్వామి
అశ్వత్థమై నిలిచె ఆ నలువ కట్టెదుట
తెల్లతెల్లని రావి మెల్లమెల్లగ కరిగి
చల్లచల్లని నీటిఊటలై జాల్వారె
అచట సహ్యాద్రి ఉత్తర శిఖరవాటి
మొదట ఈ కృష్ణమ్మ బొడ్డుకోసినచోటు
మూర్తిదాల్చిన యట్టి మూడు వేదమ్ములు
ఆర్తితో తపియించి అలమటించిన వేళ
ప్రత్యక్షమైనట్టి పార్వతీ విభుమూర్తి

అవతరించినదంట ఆమలక వృక్షమై
అమల నిర్గతాంతశ్ఛటావేణి యా
కోమలాచ్ఛశ్వేత నదివేణి యయ్యెనట
అచట సహ్యాద్రి దక్షిణ తీరదేశమ్ము
అమల వేణీనదికి అవతరణరంగమ్ము
నల్లనల్లని సామియై దాయలది వేణి
విష్ణుదేహోద్భూతి కృష్ణ పరవిభూతి
శంభుదేహపు భూతివేణ్యంబు సంభూతి
వెల్లివిరిసిన సిరుల పిడిది నీవమ్మా
ఎల్లనదులకు రాణి కృష్ణవేణమ్మా

కలికాల మలినముల కడుగు మోయమ్మా
కళకాళ్ల శ్రీ జన్మల క్షాపాడుమమ్మా.

౪

కుసుమ విసరము లెల్ల కొనిరి పూచినవేళ
అసమశరకథలెల్ల అహరించితివేమొ!
నవ వసంతపు వేళ నారాయణునిగాంచి
నవపద్మ పద్మముగ నాట్యమాడెద నీవు
నల్లకలువల కనుల హల్లకారుణ ప్రభల
నల్లనయ్యను కనరి మురిపింతువో తల్లి

గ్రీష్మాతపమ్మగ్ని కీలయై నటియింప
కృశిత తనువున నికతగర్భాన నొదిగెదవు
ముక్కంటి నెటికంటిమంట లంటినవేమొ
చుక్కచుక్కగ నీటి యూటవై చిక్కెదవు
రుద్రనిర్నిద్ర తాండవమూర్తియో వేణి!

ఛిద్రరూపమ్మున శీర్ణవేణికవైతి
వానమబ్బులు పగిలి వర్షించు వేళలో
గాన లహరిగ పొంగిగంతు లిడెదే తల్లి!
నారాయణుడు నీ లనవమేఘ మూర్తియై
మెఱుపుచూపుల నిన్నొరసి మైమరపింప
నురులు నురులై తిరిగి జడలు ప్రీలనటించి
కదలి దెస వడివడిగ పరుగులిడెదే తల్లి.

ఇంద్రకీలనగాన శారదేందు జ్యోత్స్న
సాంద్రమై నీనీమ చలువ పందిరిగాగ
వెండికొండల వెలుగు వెన్నెలల మది నిలిపి
గుండె పొంగుల నురుగు గున్నరించెదవీవు

శివదేవు మైజారి చిక్కనౌ తెలిసేట
శివ ధ్యాన గానమైతేలె నీతెలిసీట.

హేమంతమ్ములను మ్రింగి హిమ జ్వాలలగులజేయ
శ్రీమంతిని! నీగుండెల చిళ్ళులయ్యె చిక్కదనము
ముసక ముసక మంచుతెరల కనుగిటుల నీసరసుడు
ముసలునిపుడు తరణివోలె మరునిముసుగు హిమకరుడగు
కదలలేవు మెదలలేవు కన్నుతెఱచి కాంచలేవు
వదలని వలపుల తలపుల పదనౌ మది పీదుకట్టి
పరశివుని డమరకము జరత తాళముమ్రోసె
నటరాజశేఖరుని నాగ,హారముప్రీలె
ఒడ్డులాదిగి చరించువేణి యొడ్డున తరులు
పండుటాకులపిండు భువికి జల జల రాల్చె
నగ్నభావముతోడన వసిపోయినవేళ
నదికి నాణెములేదు నర్తనాట్యములేదు,



షట్ఛ్రత సంవత్సరోత్ఫుల్ల పంకజము
ఎన్ని యుగములనీదు విన్నాణముల విరిసె।
కాల లీలాతీత గమన హేలానీత
నీలశ్వేతాకృతీ! నీకివేనా నతులు
మల్లేశ్వరుని దివ్యశుద్ధాంత కౌముదికి
చల్లదనముల మెదుపుతల్లి! నీకిదె జోత

అమరేశ్వరారామ మాప్లావనము చేయు
అమరవాహిని; నీకు అంజలించెదనమ్మ
శ్రీశైలమల్లేశు చిత్తసీమల తొలచి
పాతాళమున కుఱుకు భవ్యగంగకు నతులు
నాగార్జునుని సీమ నాగేశుపదసీమ

వ్యాఘ్రేశ్వరుని వాద కాకుళేశ్వరు వాటి
మున్నుగా నెన్నెన్నొ ముక్తి సీమల దాటి
హంసదీవిని పరమహంసవై నిలచితివి
హరిహరాంశల కెప్పుడద్వైతమై చెల్లు
హంస తత్త్వమ్మున కాంధ్రిపుట్టినయిల్లు
హరిహరాంశలకెప్పుద్వైతమైచెల్లు
కృష్ణవేణికి తెలుగుసీమ మెట్టినయిల్లు
అన్నపానాతరుల కన్నపూర్ణవటన్న
న్యూనోక్తి నీ పట్ల నుడువ జాలసుతల్లి!
ఎల్లకాలమ్మిట్లె ఏలుకొని తెలుగులను
కడుపు చల్లనితల్లి! కాపాడుమమ్మా
నీలవర్ణాంత రాదిత్యనిర్మలమూర్తి
శ్వేత వర్ణాంతర్నీల నిర్నిద్రకాంతి!
హరిహరాంగోద్భూత రసరాజధానీ
సిరినంపదలతల్లి శ్రీకృష్ణవేణీ:

('ముక్తసస్య' అనే గేయసంపుటి లోనిది. నం.ప్ర. తేది 1'81)

# నాగార్జునసాగరము

దివాకర్ల వేంకటావధాని

తెలుఁగునేల పొలాలకు జలములొసఁగి
తెలుఁగువారల మతులకు తేజమిచ్చి
తెలుఁగుదేశమ్ము కీర్తికి వెలుగుకూర్చు
కృష్ణవేణీనదీ! సమస్కృతులు గొనుమ.

క్షీరము కన్న మిన్నయయి చెన్నలరారెడి నీ జలమ్ముల
వ్వారధినీరముంగలసి వ్యర్థత నొందఁగనేల యంచు స్వ
శ్రీరతులౌచు నాంధ్రులు రచించిరి నీవయి నానకట్ట, యీ
దారుణమైన దోషమునెదన్ నయిరింపుము వాహినీమణీ!

మును నాగార్జున పండితోత్తము మహాపూతమ్ము విజ్ఞాన బో
ధనపీయూషరసమ్ము చూఱలిడి యీస్థానమ్ము ప్రోచెన్, ఖుః వ్
ఘన కృష్ణాపగ వారిపూరముల విఖ్యాతాంధ్ర కేదార వ
ర్ధన ముంజేసి జనమ్ము బ్రోచునిపుడౌరా! యెంత ధన్యమ్మొకో.

శిలలున్నీరు సిమెంటుకాదు సుమి యీ శ్రీదమ్ముడామిచ్చటన్
వెలయంజేసిన దాంధ్ర కార్మికులమై నెత్రస్థులున్మాంసమున్
తులలేదీ పెను కట్టడమ్మునకు నెందున్ ధారుణిన్ దీని మం
గళనామమ్ము స్మరించు సర్వ జగమా కంజారితారార్కమున్.

కాదిది కృష్ణాపగకు బంధమ్ము కటిసీమరత్న మేఖలయె కాని
కాదిది వట్టిరాకట్టడమ్మాంధ్రుల పాలి బంగారు పర్వతము గాని
కాదిది జీవవైకల్య నిర్మాణమ్ము ముగ్ధ కార్మికశక్తిమూర్తి కాని
కాదిది వాస్తు విత్కల్పితాకారమ్ము మూర్తి దాల్చిన వారి బుద్ధి కాని

ఈ మహిత మూర్తి శోభ వాహిని మహస్సు
నయనముల కింపు నింపు నౌన్నత్యగరిమ
అంచితోత్తర కల్యాణ మెంచినంత
ఘనతరానందముఁ గల్గు గగురుపాటు.

వరవాస్తు ప్రతిభానిధానము సుహృత్త్వక్షీరవారాశి, వా
క్స్ఫురణారంజితమిత్ర చిత్తుఁడగు యంగోపాలరాయండు మే
దురమౌనాదర మొప్ప, రమ్యసరసోక్తుల్ మీర, వర్ణించి మా
కెఱిఁగించె న్సకలమ్ము నీశ్వరుఁడు వారిం బ్రోచుఁగా కెప్పుడున్

('కృష్ణాపత్రిక' 65వ సంపుటము, 84వ సంచికలోనిది. 8-10-66)

(17-9-66 తేది శనివారము ఉస్మానియా యూనివర్సిటి కమీషనువారు నాగార్జునసాగరము దర్శింపనరిగినపుడు డా॥ దివాకర్లవేంకటావధాని గారు అభిప్రాయముగా జెప్పిన పద్యములు)

## నాగార్జునసాగరము

ధర్మపురి సత్యనారాయణ

ఇదే ఇదే
నాగార్జునసాగరము
ఆంధ్రావని సిరుల నింపు
అమృత సరోవరము

నంది కొండపై దండల
అందనిలిచి కృష్ణవేణి
సాదరముగ తనరూపును
సంతరించు నిలయము

భారతీయ మేధావుల
ప్రజ్ఞకు తార్కాణము
వేలాది శ్రమజీవులు
మెచ్చించిన కృషిఫలము

ప్రళయ జలధినైనా
బంధింప జాలు నీ డ్యాము
కొండల్లో బంగారపు
కొండై నిలచినగోము

ఆరుకోట్ల ఆంధ్రులకు
అందించును విద్యుత్తును
ఊరూరున వెండివెల్గు
వెల్లువలై విలసిల్లును

నాగార్జున కొండపైన
జేరిన బౌద్ధారామం
భాసిల్లెను సిద్ధార్థుని
భవ్య తపోవనం

సృష్టిలోని అందాలను
సేకరించి పేర్చినారు
భూతలమున స్వర్గమ్మును
పొందించిరి తెలుగువారు

('చైతన్యస్వరాలు' అనే సంపుటిలోనిది సం.ప్ర. తేది 1982).

# మంజీర

దాశరథి

ఎవరి గజ్జెలరవళివే నీవు మంజీర!
ఎవరి కజ్జలబాష్పధారవే! మంజీర!
నీవుపారిన దారిలో ఇక్షుదండాలు
నీవు జారిన జాడలో అమృతభాండాలు.

నీవు దూకిననేల మాకు విద్యున్మాల
నీవు ప్రాకిన పథము మాకు చైత్రరథమ్ము
ఎవరి కొరకయి పరుగలెత్తి వచ్చితివి?
ఎవరి జూచి తటాకమై నిల్చిపోతివి?

జీరలువద్ద నా గళము
    జేరి నసధ్వని కాలు వార్చు మం
జీరవు నీవు: నీ వెలుగు
    జిందెడి చక్క దేశవల్లి కే
చీరలు కాన్క తేగలన
    చెప్పుము తెల్గు దీ! తెలుంగు బం
గారపురంగు దిద్దిన
    నిగారపు కావ్యమకులముల్ వినా?
ఆకలి తీర్చు కన్న మృద
    మైన మహాయశమ్ము కాన మీ
లోకమునందు: నీ మ సుకే
    నౌకనాథు తదీ ప్రతాపమ్ము బీ
కా కొనరింప వాకపయి
    కాలువవై, ఝరివై తటాకమై

మా కొరకేగుదెంచితి సుమా!
కమనీయ పయోధరమ్మునన్.

శిలగానే గిరిసీమ దాగితివొ
మంజిరా! శతాబ్దాలుని
శ్చలవృత్తిన్ పలుకేసిలేక నొక
వృక్షచాయ దుష్టాత్ము గుం
డెలలో ద్వేషమువోలె ఉంచుకయినన్
హృద్యమ్ముగా, కిష్టు క
న్నుల స్నీరై ఇటు జారినావు దయ
తోనో, ప్రేమ భావాననో!

నిను కరగించి తెచ్చిన పునీతు
డెవం? డతనిన్ భగీరథుం
డనవలె, వాడు నా తెలుగు
టంగణ మందలి ముంగ్గదుబ్బులన్
తునియలు కొట్టి ఈ చెరకు
తోటలగూర్చి హాలమ్ము గ్రుమ్మ, భూ
మిని ప్రసరింప జేసి పసిమిన్
మిసిమిన్ పెకలించె దండిగా

అతడు నేల దున్ని బ్రతు
కంతయు పస్తులు పన్నరైతు మా
పోతనయేమొ! వాని వద
పోతలలో కవితా ప్రపంచ మా
పాతమనోహరమ్మయిన
పల్కు జగద్విదితమ్ము: వాని నం
గాతము నీకు కావ్యతను
కల్పన చేసిన దోయి, వాహినీ!

ఒకట నదివయి, ఒకచోట ఒదిగి ఒదిగి
సాగరమవై చలింపక సమసియుంటి
వెంత సౌమ్యస్వభావమోయీ! పరుంగు
లిడు మనస్సు బంధింప దొడగినావు.

ఇందూరు మండలం బెందాక నీ నీటి
తడితాకి తీయని తనము గొందు
నా తెలంగాణమ్మ గీత స్వతములతో
నెందాక నిన్ను పూజించుచుండ
నెందాక నిరుషేదలంది నీ ఆలధార
పండించు కొల్లగా పెరుపంట
ఏ కవీశులు నీ మహాకావ్యత నెరింగి
శ్రమ కలమ్ములకు సౌందర్యమిడుదురు

రంతదాక మహీ మండలాంగరమున
నీ వెలుంగుకు రవ్వంగ నీరరాదు.
దివ్య గోదావరీ గృహాంతికమునందు
నీ విలాస మేనాటికి విలిభిపోదు

రుద్రవీణ శివమాద్రి ఝుం ఝుమ్మని
తరగలెత్తివచ్చు గానగీస్తు
నా మనస్సులోన నాదాలు కలిగించి
స్పందనమ్ము నేర్పజాలినావు

నా తెలుగువీణ పోయిన మూర్ఛనలు నేడు
నీవుగా పారినిండినవి భూమిలో
ఇక ఎన్ని చెరకు తోటలు పండవీ చోట?
ఎన్ని చక్కెర మిల్లు లవతరింపవు?

ఎవ్వరే యెదురొచ్చి ఏడుపాయలుచేసి
రవ్వల్ల వీణపై రాగమొత్తిరి నిన్ను?
ఏడుపాయల దుర్గ యేమన్నదే నిన్ను?
యేమన్నదే నిన్ను యేడుపాయల దుర్గ?

(మంజీరా మౌనభంగం)

ఏడుపాయల దుర్గఎదురుగా వచ్చింది
పాడుకొమ్మన్నాది పరుగులిడమన్నాది
స్వరమొక్క పాయగాసాగి పొమ్మన్నాది
బంగారు పండించి ప్రజల కిమ్మన్నాది.

(మంజీరకు విశ్రాంతి)

అదిగో హాసంతికలు, అదె సుమలలంతికలు
అదిగో సేమంతికలు, అదిగో వాసంతికలు
జయదాయకములు, సంశయ మాయకమ్ములు
ప్రియకరము లమృతపిచ్ఛిలము లుజ్జ్వలములు

మిట్టలెక్కి యెక్కి గుట్టలు దిగజారి
త్రోవగడచి వచ్చినావు నీవు
మిగులశ్రమలు గొన్న మిసి మింతురాలవు
సేద దీరు మీ ప్రసిద్ధ భూమి.

("మహేంద్రోదయం" అనే సంపుటి లోనిది సం. ప్ర. తేది 1956)

# అమృతసేతువు

వేముగంటి నరసింహాచార్యులు

(ఇది పోచంపాడు (శ్రీరామ్‌సాగర్) ప్రాజెక్టును ప్రశంసించే కవిత)

ధవిటి నేలలు పైరుపచ్చల నెసంగ
తెలుగుతల్లి కొంగున పైడి వెలుగుచెలగ
మేలుముల దొంతి శ్రీ గౌతమీస్రవంతి
వార్ధియైనిల్చె పోచమపాడువద్ద

శ్రీ గోదావరి! దివ్యభవ్య జలతా! నిత్యవాదాల వే
దీ గోష్ఠి విభవా! దయామృతరసస్నిగ్ధాత్మవై ముగ్ధ రే
ఖా గంభీరిమ చెంగలింపగ తెలంగాణమ్ము నక్షీణ ధా
న్యాగారం బొనరింప నిల్చితివి కాదా! సాగరాకారతన్.

జనక సుతాసతీస్నానపుణ్యోదక
  పావనత్వము నొందినావుగాని
భద్రాద్రి శ్రీరామ పాదపంకజమరం
  దరసమ్ము చవి జూచినావుగాని
నన్నయ్య భారతామ్నాయమ్ములోని
  విన్నాణమ్ము తెలుసుకొన్నావుగాని
తరతరాల చరిత్ర తరగలరవళి
  గానమున విన్పించుచున్నావుగాని

ఎన్నడేని నవోదయాసన్నమతిని
నిల్చితివె తెల్గుపొలము పండించు కొరకు?
నేటికిరీతి కడలివై నిలచినట్టి
నిన్నునన్నుతింతును స్రవంతిమతల్లి!

స్వాదు పయస్వినీ! విమల
భావమనస్వినీ! దిక్ప్రసారితా
మోదయశస్వినీ! భువన
పూతమహస్వినీ! గాఢదైన్యపుం
ఖేదమున్మ్రింగి డిల్పడి
కృశించు కృషీవలజీవనంబులా
హ్లాదము నొంద జేసితివి
అంబుధిరూపము దాల్చి గౌతమీ!

పిసినిగొట్టు విధాన నెసనొక్క చినుకేని
రాల్చని నీరదవ్రతతి జూచి
పాతాళలోకము లోతుముట్టగనెంచు
నూతులగోతుల రీతిజూచి
దరదమత్తడిరాని బురదచిత్తడిలేని
చెరువుల దొరువుల చేటుజూచి
కరుణమాలినవాని కరుగండియవోలె
బెమ్మగిల్లినివాగు స్థితినిజూచి

వందవారిన వరిపొలాలెండవారి
గుండెలవియింప మిక్కిలి గోడుచెంది
కర్షకుల కాన దివ్వెగా కదలివచ్చు
వరలితివిగాదె పోచమపాడు వద్ద!

కదలిరాయని కౌగిట కరగు ధన్య
గేహినీ! విశ్వమానవ కీర్తినీయు
వాహినీ! ఫేనదరహాసభాసమాన
మోహినీ! నేడు మా భాగ్యములు ఫలించె
శ్రీ పదాయినీ! గోదావరీ స్రవంతి!

కొండలు, బండలన్ గడచి
కోనలు, కానలుదాటి ఆంధ్ర భూ
ఖండము తోయ పూర్ణమగు
కాల్వల నిల్వన నందడింపగా
తొండలు గ్రుడ్లువెట్టు నెరి
దోయిడి భూములలోన బంగరున్
బండగ వార్ధివై నిలిచి
ఖానిలునిన్ను భజింతు గౌతమీ!

బీళ్ళు పచ్చని వరిమళ్ళుగా తిలకింప
మ్రోళ్ళు చివుళ్ళతో పులకరింప
నిరుపేద రైతింట సిరి వెలంది చరింప
ధాన్యమ్ము గరిసెల దందడింప
చిరుకాల్వనీటి తుంపర వరాల్ కురిపింప
చెఱుచేమలు రసశ్రీవహింప
జల విహంగావళి కలరవంబొనరింప
ఫల పుష్పవనములు పరిణమింప

పదరి ప ముల వెండి మువ్వలవిధాన
గల గల రావవీచికల్ కందళింప
జలధి వై ల్చి కాల్వలై జాలువారు
పుణ్యవాహినీ! నీకు కైమోడ్పులమ్మ!

తెలుగుం బల్లెలు పైరుల
వెలుగుం బళ్ళెరములగుచు విలసిల్ల భవత్
జల పూరము మా పొలముల
జలసారము గౌతమీ స్రవంతీ మణిరో!

అమల తుషార వారములు
హారములై చెలువారగా కులో
ద్యమ కమనీయ కాంక్ష
ఎదదన్ తదలెత్త వటిష్ఠసేతు చం
క్రమణమొనర్చి వాకవయి
కాలువలై ప్రవహించినేల త
ల్లి మొగమునందు భాగ్యనవ
రేఖలు దిద్దితివమ్మ గౌతమీ!
అటు కృష్ణాతటినీ శిరోమణి దయా
స్వాంతమ్మునన్ జీవనో
త్కట నాగార్జున సాగరాకృతి మహ
త్వమ్మూని శోభిల్ల నీ
విటు మేల్ పోచమపాడు సేతువయి
ఎంతేనొప్పగా ధాన్యసం
పుటమై ఆంధ్ర ధరిత్రి రాణిలె
యశస్స్ఫూర్తిన్ పిసాళించుమన్.

('కవితా సిందూరం' అనే కవితా సంపుటిలోనిది. నం. ప్ర. తేది 1977)

# ఉగాది

దేవులపల్లి కృష్ణశాస్త్రి

ప్రథమ వత్సరాది యెపుడొ
ప్రథమ చైత్ర రథముపైని
ప్రథమ వత్సరాదిని గని
వచ్చిన అతిథికి మానవు
డిచ్చెనెట్లు స్వాగతము?
మధురా శామ నృణకిసల
మాలిక లల్లేనా?
మహిత మనోరథ మంగళ
రంగవల్లు లుంచేనా?
దోహలమున ఊహల సుమ
తోరణములు కూర్చేనా?
ప్రథమ చైత్ర రథముపైని
ప్రథమ వత్సరాదిని గని
వచ్చిన అతిథికి మానవు
డిచ్చెనెట్లు స్వాగతము
మత్త మరుద్గరు దీప్తి
కొత్త ఉత్తరీయ మెగ
అరుదెంచిన తొలిహాయిన
మరని బ్రతుకు హాయి అనెప?
ప్రథమ వత్సరాది నాడు
నవజీవన పల్లవములు
నవ్యవాసనా లవములు
వేణువులా వివిధ పుష్ప
రేణువులా తొలి యామిని
రాణువగని బ్రతుకంత

హాయియను కొనెనా?
తన గళమే కోయిలగా
తన మనసే ఊయెలగా
మనుగడ ఎఱ్ఱని చివురుల
మావికొమ్మ అనుకొనెనా?
ఇక్షుకాండ మనుకొనెనా?
ఆ యుగాదినాడె మనకి
హాయియె యనుకొనెనా-లేక
మాయయె యనుకొనెనా?
ఉగ్గనిదా ఘాగ్రహము
వర్షాకరుణాశ్రుజలము
జడహిమర్తు నైరాశ్యము
పడివచ్చేనని తెలియక
ఏమనుకొనెనో?
వత్సర వత్సరమట్లే
వచ్చినట్లె పోయెనట్లు
అశ్రువుతో హాసముతో
అమృత హాలహలములతో
అంతకంత కలిశయించి
ఆనముపై వేగులతో!
కాని, యెట్టి వీరవరుడొ
మానవుడు
మానడు ఆనందోత్సవ
మీ నరుడు
ఆశలు కళ్ళేలురేని
గుర్రాలీతనికి
మన్ను మిన్ను కలియువరకు
తెన్ను వీనికి!
ఊరే కోర్కెలపైని న

దారి చేయుచు
లోకమెల్ల క్రమోన్మిషిత
నాకముగా మారువరకు
ఏ యుగాది కా యుగాది
కెప్పటి కప్పుడె యెదురై
ద్వారము కడ చిరునవ్వుల
హారతులెత్తునా మానవుడు
కనుక ఓయీ స్వాగతమ్ము!
మరిమరి స్వాగతమ్ము!
కావియంత బంగారపు
పంట యగును గాక
రాగల కాలము కాంతికి
తావలమగు గాక
గుండెలెల్ల కలిసి ఒక్క
దండగాగ కూరిచికొని
ముందు ముందు ఈ మానవు
లందరు ఒందురుగాక
గత చన్న యేడు రాగల యేడొకే రూపు
జీవిత మదు వింకి పోవు వాని
కీ యేడు వెనుకటి యేడుకన్నను పాడు
వయస్సస్తగిరి వైపు వాలు వాని
కే యేటి కాయేడె యేడుపే తొలిప్రొద్దు
కొత్తచూడని గూబచూపువాని
కీ యేడొ ఏయేడొ ఎవరి క్షేమో తాను
తాకున నీటి బొట్టయిన వాని
కసలు రానున్న దెప్పటి కపుడు మంచి
దినలు కావేవు చెడి ముదిసినవె పోవు
ఈ నిజము నెంచి నిలబడుం డిచట ఈ ప్ర
యాంగణాన అనుంగు తెనుంగులార!

(పల్లకి అనే సంకలనంలోనిది సం.ప్ర-తేది-1975)

# ఉగాది

గుఱ్ఱం జాషువ కవి

దరియన్ దాపునులేని కాలమను నంతర్వాత్ని నీళ్ళాదగా
పర సంవత్సర బాలకుండిపుడు సాక్షాత్కారమున్ జెంది సో
దర వర్షం బరివృద్ధమైనదని యంతర్ధానమున్ జెంది, జో
హారు లర్పించె దిగంతరాంతములు నూత్నాబ్దక్షమా జానికిన్

పట్టెండన్నము లేక శోషిలిన నిర్భాగ్య ప్రజానీకపు
న్నిట్టూర్పుం బొగలంతు వెచ్చనయి కుందెంబెక్కు వర్షంబు లీ
పెట్టన్మానిపి సర్వలోకములకున్ శ్రేయంబు చేకూర్చుచున్
గట్టెక్కించుత ఈ శుభాబ్దము భయగ్రస్త క్షమాసుందరిన్

ప్రాచిబట్టియున్న బహ్వాబ్దములనాటి
భ్రాన్వ్యదృక్పథంబు సవరికనిపి
స్వాగతోత్సవాలు-సల్పుకొందము, నూత్న
వర్షమునకు భరత వర్షమలర

నిన్నలు మొన్నలున్నరుని నీచకళంకిత వర్తనంబునం
దన్నము బెట్టలేక చటులార్తరవంబుల కాటవట్టులై
చన్నవి, వచ్చుచున్నది ప్రశస్త శుభాబ్దము, రేపులన్ని ముం
దున్నవి కట్టుకొందము సుశోజ్వల కాంతి సుధాలయాంబులన్

చిత్త సంస్కారంబు సృష్టింప జాలిన
    చక్కని సాహిత్యసరల కొఱకు
పొరిగింటి వాని సోదర భావమున జూచి
    ప్రేమింపగల ధర్మదృష్టి కొఱకు

వైషమ్య భుజగంబు వాసంబు చేయని
      మాయమర్మము లేని మనసు కొఱకు
ఆ యదార్థవాణి జిహ్వాగ్రంబు సోకని
      మాననీయుల లసన్మైత్రి కొఱకు

పుట్టెడాశతోడ బుట్టినిరాశతో
దాటుచున్న యబ్దతతికి మ్రొక్కి
చిత్తశుద్ధితోడ స్వీకరింతు మఖండ
కౌతుకమున నీ యుగాది కాన్క

నీతిపథమునందు నిత్యజీవితమందు
మాట నిరుకునందు మార్పులేక
కొత్తబట్ట గట్టుకొన్నంత నూత్న వ
ర్షంబు మహము సార్థకంబుగాదు.

("ఖండకావ్యము, ఐదవ భాగము"లోనిది సం.ప్ర తేది. 19౬౮)

## ఉగాది

యస్. టి. జ్ఞానానంద కవి

ఆ కోయిలమ్మ తీయని గొంతులోనుండి
      ఉబికివచ్చిన పాట కూహుఁజేసి
ఈ జాజి పూరెమ్మలో జిమ్ము చిటిదేని
      యల ముత్తములను ఖాద్యమ్మొనర్చి
ఆ రసాల కిసాలయము నిగ్గులు రహింప
      ప్రత్యగ్రమగు మేలిరంగు పూసి
ఈ వనేందిర నవ్యలావణ్య రుచులలోఁ
      గోమర్థార నరిధి భాగమునుఁ గొనుచు

కదలికనుఁ జెంది నిదురించు పుడమి సతిని
నింతలో నెంతగా గిలిగింత వెట్టు
కలికి చిన్నారిదేవి యుగాది లక్ష్మి
రమ్ము దర్శనీయము మహేంద్రమ్ము నీకు.

మలచెన్ గాలపు శిల్పకారి మన సామ్రాజ్యమ్ములన్ సార్వభౌ
ముల నుత్తుంగ పరాక్రమాధిపుల నీ యూగర్భమందున్ దర
మ్ములు దాటన్ గనిపింప లేదొకటియున్ జో! హే! ఉగాదీ! సము
జ్జ్వల సౌందర్య కళాస్వరూపిణీ! నినున్ వార్ధక్యముం దాకునే!

వలపులు గ్రుమ్మరించి రసభావ పరంపర లూతనిచ్చి పే
శల సుమనోజ్ఞమౌ నవసంత వధూటికి వింతసోయగ
మ్ముల నులికింపఁజేసి పరిపుల్ల వికస్వరమూర్తివై తెలుం
గుల దరిసించు నీకు శతకోటి నమస్సులుగాది సుందరీ!

ఈ యాకురాలిన వృక్షమ్ము చివురించె
చిన్నారి వన్నెలే చివురుటాకు
ఈ బాటనెండి పోయిన గడ్డిమొలక ప
చ్చని స్వరూపమునకిం జెల్వమమరె
ఈ పూవుగుత్తుల కృశియించు గంధమ్ము
మరల కమ్మనిపరిమళముఁ జిమ్మె
ఈ షట్పదమ్ము నిన్నెంతయో తపియించి
ప్రియమార నేడుఝంకృతులసలిపె

శిశిరమేలు వాని శీతకన్ను కతాన
వికృత రూపమయ్యె ప్రకృతి శోభ
నీ మహోదయాన నేల వికాసించె
కనుల విందుగా నుగాది లక్ష్మి!

ఈ నవమాధురీఝురులు హేలగమించిన నింతలోనె పెం
పూనగ దివ్య జీవకళలూరిన మేల్మి వసంతకాల చై
త్రాన మహేంద్ర జాతికి నితాంత చిరంతవసంత సౌఖ్య సం
తాన మనుగ్రహింపుము సుధాసము పేత! ఉగాది దేవతా!

సవరింతువా? తెల్గుజాతి కేదారాన
నగుపించు ద్వేష బీజాంకురమ్ము
వివరింతువా? తెల్గుభవన రంగస్థలిన్
రాటాల ముని శాంతినాటకమ్ము
నడపింతువా? తెల్గుపుడమి మేల్ మార్గాన
సమతారసార్ద్ర వాసంత లక్ష్మి
వెలయింతువా? తెల్గు విశ్వతోముఖమైన
పరమ మోహన దివ్యవాఙ్మయమ్ము

స్వార్థపరతయైన జగతిఁ బ్రగతి పంచ
శీల సహిత శాంతి జీవనమ్ము
నేర్పరింతువా? యదృష్టమ్ము నీరాక
కారణాననో జగా యుగాది

కలకలలాడు నీ ప్రకృతిఁ గాంచగ సృష్టికి నేదియో మహో
జ్జ్వల శుభ సూచకమ్ములు ప్రశాంతికి దోహద మిచ్చునట్లుగాఁ
దెలియును లేత నవ్వులు విదిర్చిన నీ పెదవుల్ చిగిర్చె నీ
తొలకరిలో తెలంగులకు తోషణ మబ్బుత సుందరీమణీ!

ఇట వాసంతమ నూఱు పాళ్ళయి గమాయించెన్ బరాయించె ది
క్తట వంక్తిన్ కలుగమ్మ కీర్తియికనుగ్రగై ర్విషమ్మ శీష్ణత్విషా
స్ఫుట సంరంభ విజృంభమాణ విలయంబున్ డాయబోనీక మా
రటఁ గల్పించు ము మాకు శాంతిసుఖదోలా శ్రీలలాలింపుచున్.

(9-4-1959 ఆకాశవాణి, విజయవాడ కేంద్రం కవి సమ్మేళనంలో చదివింది
'విజయాభిషేకము' అనే సంకలన గ్రంథంలోనిది సం.ప్ర. తేది 1913)

# తెప్పతిరునాళ్ళు

కందుకూరి రామభద్రరావు

రండమ్మ రండి. రవలవెలుగులతోడ
తెరలి రారండి తెప్పతిరునాళ్ళ!
శ్రీ నృసింహస్వామి శ్రీదేవితోగూడి
కార్తికీ జ్యోత్స్నలో కదలి కరదులపైని
ఉయ్యాల లూగగా ఊరేగివచ్చేను........ రం॥

వెన్నెలంతా నింగి వెలిగొడుగు విప్పింది
హరితాంకురాలతో అవని పులకించింది
వేయిదివ్వెలతోడ వేంచేయు సామికై
హాయిగా సాగు నన్నాయిమేళము రండి ....... రం॥

వెండి తళుకుల చీరవ్రేలాడు కుచ్చెళ్ళు
గొప్పింటి ఒయ్యారి గోదావరీ గంగ
ఆదరికి ఈదరికి ఒదుగుతూ తావచ్చి
నిజనాథు పజ్జనే నిలిచి మ్రొక్కింది...... రం॥

సాగరుడు చేపట్టి చదలంటగా లేచి
పరవళ్ళు త్రొక్కుతూ పాల్కడలి తానెయై
గోదావరీదేవి కొంగు కొంగూ కలిపి
స్వామి కెదురుగ వచ్చి స్వాగతం బిచ్చేను ...... రం॥

వల్లెపదుచుల నగవు పాలెల్ల చిందగా
తెల్లపూదెప్పపై తేలి సాగును సామి
జేజేలు పద్దెనలు చేరి మ్రార్మోగేను
క్షీరసాగర శయను సేవింపరారండి ....... రం॥

సాగరుడు శరణమై నంతరించెడువేళ
మేళాలు తాళాలు మిను బాణసంచాలు
కోలాహలమ్ముగా కొలువు దీర్చెను స్వామి
అభయహస్తము నెత్తి ఆశీర్వదించేను.

('పీయూషలహరి' అనే సంపుటంలోనిది. సం.ప్ర. తేది 1955)

# అట్లతదియ

కాటూరి వేంకటనరసింగరావు

పరువిడి పొమ్మనంగ పొలువంబుగ పశ్చిమవార్ధి వీచికా
శిరముల పాటల ప్రభల జిందుచు చిందులు త్రొక్క నా హృదీ
శ్వరి చరణ ప్రవాళ విలసన్నర రేఖలబోయి లాక్షనీ
యరుణిమ కాలదన్ను, క్షణమాగిన తజ్జలదాంచలమ్ములన్.

ఇది నా ప్రేయసి నోము నోచుకొను వేళ పూర్వదిక్కామినీ
మృదుగండస్థల పాండు దీధితి నమున్మేషోజ్జ్వలంబౌ నిశా
వదనం బెంతయు పావనంబు, తరియింపంజాలవా వేగముల్
పదిలంబౌ హృదయంబు భ్రాంతుల జలింపంబోక ధ్యానింపుమా!

ఇంకను కోరలీనుచు దయింప వదేమి శశాంక! దీక్ష నా
పంకజగంధి భక్తి చిరబారెడు చూపులమెల్లమెల్ల నీ
వంకకు చల్లగా బరువ, వత్సలతన్ మెయినిండ నూత్నపు
లాంకుర మాలికల్ నిగుడ గాఁరు దేరవదేమి చోద్యమో?

తొలుతటి మూడు నిద్దురల గోరఁ బ్రీతియుము ఏరికొంచు తొ
య్యలియును నేను, ఒకమ్మెనైన గతింపగ లేదు నేటికిన్ ;
వలపు కవుంగిటన్ గరుగవల్చి కలిర్చిన యీ నిషంజమా
తుల చిరు నాల్కలన్ బిలుచు కోపలిపై దయసిన్ సుధాకరా!

కలుముల నిను నిండుతెలిగప్పుడు కాయలు కాచునేమొ, నె
చ్చెలి సుకుమారి వేచిన శశీ వలవంతల నేది వేచు నీ
తొలి చిరహంపు రేసెగలు సిగ్గుజాచుట కెట్టులోర్చునో,
తలపవు చిత్తమందు గల తత్తర మేదెద విడ్లె క్రొత్తదిన్

నాననఁబోడి దారువదనంపు సిరిన్ తలయెత్తి చూడఁగే
నా నిబిడాంబుదాంతరమునందటు తారెదు నిర్గమించి తా
నిరత నామె పాదయుగళిన్ గరణాళిన్ స్పృశించి గైరిక
స్నానమొనర్చు, పద్య చరణమ్ముల నొత్తెద మేని రక్తిమన్.

ఉ. అనువయశీల, బాలకుచదార్ఢ్య సమున్నమ్మున కళావళిన్
చనవునుఘుబ్బగించి, పతనమ్మగు పాయసంబులో అన్నమ్ము క
మ్మని మనుద్రేకులన్ గుడిపి, మాధురులన్ మరపించు నమ్మ నీ
యనుపమ దుగ్ధ వార్ధి జనితామృత సారరుచి ప్రపూరముల్.

అభ్యంగనము సేసి యారవైచిన సోగ
కురుల క్రొన్నిగనిగల్ గునిసియాడ
భువన మోహనమైన ముద్దుమొగమ్మున
తిలక దీప్తులు కల కళలనీన
తనలీను దేశీయ వస్త్రాల మాటున
నంగసౌష్ఠవము సయ్యాటలాడ
కాటుక కావుల పరిమళించు విశాల
లోచనమ్ముల తొంగవిచులూగ

విరహమింత భక్త్యావేశ భర మొకింత
అందమొదలంత నొలుకగ నల్లనల్ల
నీకు లోకి నిరీక్షించు సీతమూర్తి
సరసి చల్లగ ధన్యుడ వైతి చంద్ర!

నవధాన్యంబుల ముద్దు దోసి సిబులనింతన్ బట్టి, పాలింద్ద గౌ
రవమూపన్, మహాలక్ష్మి మీరమునతారన్ కోసికుయ్యారు, "తన్
ధవు కారల్, తనవారు, నాథుడును సౌఖ్యంబెల్లగాంచి కర్తను మ
త్కృప చాలించెదు కాదటియు మతితో గున్ ప్రేమకాలాలోన్.

('పీయూషలహరి' అనే సంపుటంలోనిది సం.ప్ర. తేది 1955).

## విజయదశమి

గుడిపూడి ఇందుమతీదేవి

శ్రీకరము శుభకర జనమో
దాకరములు వివిధ గుణసముచిత సుమమో
దారకములు లలితాంబా
ప్రాకట పూజావసర శరద్దినవరముల్

వచ్చె మృదు పారిజాతము విచ్చె చంద్ర
కాంతములు సహా పుష్పముల్ కాంతిమీఱ
కొలకులందు నవులిందుక కలకదేశ
నాశ్వయుజము ప్రశాంత్యానమగుచు వచ్చె.

యోధవీరులు మహోత్సాహమున నాయు
ధాళిని సవరింతు రా దినములు
ఆయుధములు వాహనాళి రాజులు పూజ
సంతర్పతి యొనర్చు శుభదినములు
మహిషాది దానవ మద గర్వ మడగించి
శ్రీదుర్గ విక్రమించిన దినములు
బాల బాలికలు విల్బట్టి రాకొమరుల
నేసలవలె సంతసిలు దినములు.

పిల్లలకు పెద్దలకు మనం బుల్లసిల్ల
నుత్సవములు దేవళములు నొప్పుచుండ
వెలిగి దేవి కలంకృతుల్ సేయుచుండ
విజయ సూచకముగ వచ్చె విజయదశమి

రంగారు పొంగారు బంగారు కరిగిపో
　　సిన రీతి వసుధనింపె నయనలంది
తంపుల పొదిరీతి సొంపారు కుంకుమ
　　ముద్దార చుక్కలు దిద్ది తీర్చి
కుతికంటు దంతల గతిని మామిడియాకు
　　పచ్చగ తోరణాల్గుచ్చి గట్టి
పలురంగులల రువల్యాలరీతి పలురంగు
　　లలరగా తలుపుల కలయబూసి

పెద్దముత్తైదువల వలె నొద్ది కలర
నెల్ల విధములకై సేయ నెల్లవారు
ద్వార బంధంబులెల్ల నందంబు గులుక
విజయదశమి శరద్వేళ వేత్క్రమించె

పూంచె నొవ్వ తీగల పొలుపుగా న
లంకరించి పుణ్యాంగనల్ పొంకముగను
పోవుచుందురు పేరంటమునకు విజయ
దశమి పండుగనాడు నుత్సాహగరిమ.

పండిత ప్రవరులు పటిమ దేపి బాగ
　　వత మహద్గ్రంథంబు పఠనసేయ
దీపారతిని మించి దేవి సుఖాకృతి
　　నుంచి భక్తులను పూజించుచుండ
వేదవేత్తలకు కవిప్రకాండులకు గృ
　　హస్తులు సత్కృత లాచరింప
యచ్చట జూచిన నెలమి సరస్వతీ
　　పూజల్ ప్రజానీకములు నొనర్చ

యుల్లరును కలిగిన యంత నెలవి జల
రక్కసుల నెల్ల జక్కాడి రణమునందు
విజయ మొందిన లలితాంబ విజయ చిహ్న
మైన దశరా శుభదినంబు లందమొలకె

విజయ సంవత్సరములోన విజయదశమి-
ఆంధ్ర రాష్ట్రావతరణంబునందు గలసి
ప్రజల కానందదాయియై భాసిలుచును
వచ్చె జయజయ నాదముల్ హెచ్చె దిశల

అరయ గోదావరీ నదీ వరదలిట్టు
లకట ధన ధాన్య రాసులనవని గలిపి
యనుజులకు బాపె నరపశు విసరములను
చింతజెందుచునైనను సంతసంబు

నొందుదముగాని సంతృప్తి యొనరునెట్లు
ఈసుడికనైన దీనుల నేలుగాక
మానిత గుణాళి ప్రజకిడి మనుచు గాత
కోరికలు మంచి విల నమకూడు గాత

ప్రజలకు ప్రధానులకు మైత్రి ప్రబలుగాత
ప్రజలకును నాయకులకును భావమొకటి
యగుచు న్యాయైక రీతితోడ నలరుచుండ
భారతాంధ్రంబులకు కీర్తి వరలు గాత

("మందారమాల" అనే సంకలనంలోనిది స.ప్ర. తేది 1972)

# దీపావళి

దాశరథి

పాపావళి బుగ్గిచేసి
కోపావళి నగ్గిద్రోచి
దీపావళి జరపండోయి
దేశదేశ జనులారా
తెలంగాణ [illegible]

వ్యక్తులు పరిపాలించే [illegible]
శక్తి నశించింది నేడు
రక్తంలో అణువణువూ
శక్తిగళించింది నేడు

చీకటి దయ్యంపోకడే
లోకానికి రాత్రైతేను
ఆకాశం నిలువ [illegible]
అర్ధరాత్రి విలువలేదు

కోటి కోటి దీపాలను
తోటలలో కోటలలో
నాటండి ప్రజలారా!
వేటాడండి తమస్సును

కాలపు కళ్ళెమును లాగి
కదం వెనక్కు త్రొక్కించే
మనులంతా నముంచిరిగి
కదల్లేక నశించారు

శ్రీమహావీర జినుఁ డహింసా మహన్న
దెసలఁ బ్రసరింప సిద్ధిపొందినది నేఁడె
వచ్చెనిదిగో సౌవర్ణ శోభాప్రపూర్ణ
సర్వజనము॥ దీపావళీ పర్వదినము

తోటాలు గాల్చి ముందునకు దూఁకెడివేళ
        క్రుద్ధులౌ ఫాలనేత్రులవిధాన
దివ్వెటిల్ గిగిర త్రిప్పి పర్విడు వేళ
        కలియుగ భీమసేనుల విధాన
విష్ణు చక్రాలను వెలిగించు నవ్వేళ
        చెలువొప్పు బాలకృష్ణుల విధాన
చివ్వున అవ్వాయిచువ్వ రువ్వెడవేళ
        విలుదాల్చు వీరార్జునుల విధాన

ఔట్లు రాకెట్లు పేల్చెడు నట్టివేళ
ప్రళయ భీకర వీరభద్రుల విధాన
రైతు బిడ్డలు పౌరుష జ్యోతులైరి
ప్రథిత దీపావళీ మహాపర్వవేళ

పడుచు కోడలు సిగ్గుపడుచు ముత్యాల పూ
        వత్తికాల్చెను మొగమెత్తకుండ
దీప పంక్తుల దిద్దితీర్చునమ్మకు నూనె
        గిన్నియ నందించె చిన్నిబిడ్డ
పొరలిపోయెడి చిచ్చుబుడ్డి కాంతులలోన
        చెల్లి క్రొత్తచీర కాంచెను మగండు
గుమ్మమ్ము గడపలోఁ గూర్చుండి తాటాకు
        గుమ్మటాల్ త్రిప్పె అమ్మమ్మగారు

కారు చీకట్లు చరచర పాఱిపోవ
ఇంట బయటను దీప్యాల పంట పండె
తళుకు లొలుకు నక్షత్రమండలముతోడ
ఇక సమునేన వయిదిగనట్లు తోఁచె!

అత్తవారింట క్రొత్తల్లుఁడు గుట్టు మ
ట్టు లెఱింగి చెట్టు చెట్టుగ చరించె
బావగారిని చెవుల్ పట్టి యాడించు చె
ల్లిని పిల్చి బుగ్గగిల్లినది అక్క
'గుడిసెపై జారిన క్రొంగొత్త సొరపిందె
పానెమ్ము కోసమై కోసెకాపు
తియపడు వదినమ్మపై చిచింద్రీవై చి
కిల కిల నవ్వె ముద్దులమఱింది

కర్షకుల కార్మికుల మః హర్ష బాష్ప
వర్ష బిందువు లట్టు దీః పుల మెఱసె
వీథివీథుల నింటింట వె విరిసె
నవనవోన్మేష కౌతు కా ందలహరి

రావమ్మ చెల్లి! దీపావళీ ఇవె అందు
కోవమ్మ మా స్నేహ భావనలను
లేవమ్మ తల్లి! శ్రీదేవి! హాయింటికి
తేవమ్మ నీమేలి చీవనలను
పోవమ్మ దౌర్భాగ్య దేః తా! యిక వెళ్ళి
పోవమ్మ మాయ ౦రి పొలముదాటి
ఈవమ్మ ఫలము భూదే౦! పంటలరాణి!
క్రిమి కీటకమ్ము౭ు నమసిపోవ

దీపములనెత్తి దివిటీలు త్రిప్పి త్రిప్పి
త్రోవ చూపించితిమి పితృదేవతలకు
దివ్య లోకమ్ములను ప్రసాదింపుమయ్య!
అయ్య! యమధర్మరాజ! నమోస్తు నీకు!

('ఉదయశ్రీ' అనే సంకలనంలోనిది. సం.ప్ర. తేది 1979)

## సంకాృంతి

రాయప్రోలు సుబ్బారావు

వచ్చింది వచ్చింది పచ్చ సంక్రాంతి
వచ్చింది వచ్చింది లచ్చి సంక్రాంతి
తేనెవాకలు పాఱు తెనుగు వాదలకు
అంబాలు పొంగేటి ఆంధ్ర భూములకు

వచ్చింది వచ్చింది పచ్చ సంక్రాంతి
వచ్చింది వచ్చింది లచ్చి సంక్రాంతి

పంటరాసులపైన పవళించి లేచి
తేట తటాకాల తీర్థమ్ములాడి

వచ్చింది వచ్చింది పచ్చ సంక్రాంతి
వచ్చింది వచ్చింది లచ్చి సంక్రాంతి

వన్నెముగ్గులు వెట్టి వాకిళ్ళముందు
పూదేనెతో చారుపోతాముర్వాతె;
వెల్ల జాదుల వెల్లువీధి వేదికలు
గంపలతో పండ్లు నింపేమురారె

వచ్చింది వచ్చింది పచ్చ సంక్రాంతి
వచ్చింది వచ్చింది లచ్చి సంక్రాంతి

అరటి స్తంభాలతో అందగింతాము
బంతి పూదండలన్ బాగించుదాము
తామరాకులతోడ దళ్ళల్లుదాము
కలవకాడలతోడ మెలికలేతాము

వచ్చింది వచ్చింది పచ్చ నంక్రాంతి
వచ్చింది వచ్చింది లచ్చి నంక్రాంతి

చందనం బవరంటి బిందెలన్ నింపి
వసుపు కుంకుమ లాకు పళ్ళాలలోనీ
పొన్నాకు విస్తళ్ళ భోగంబు పెట్టి
అరగింపు మటంచు అమరింతాము.

వచ్చింది వచ్చింది పచ్చ సంక్రాంతి
వచ్చింది వచ్చింది లచ్చి నంక్రాంతి

కళ్యాణకంఠి ఈ కన్నె నంక్రాంతి
భోగాల బాల ఈ భోగి సంక్రాంతి
వేదకల్ విప్పార తోడి తెత్తాము
ప్రియమైన పాటలన్ పిలిచివత్తాము

రావేమె రావేమె రాగాల కొమ్మ!
రావేమె రావేమె రతనాల బొమ్మ!

('పీయూషలహరి' అనే సంపుటంలోనిది. సం.ప్ర తేది 1955)

# సంక్రాంతి

దేవులపల్లి కృష్ణశాస్త్రి

ముని వాకిట నిల్చిరే కౌఫన్
మునిరే చీకటి నీడలూర్చుచున్
జరతచ్ఛద వక్ష్మ విస్రవ
త్తరళాజ స్రహిమాశ్రులొద్దుచున్.

తోచె నింబ తరువు, తోచెను దూరాన
భోగిమంట చుట్టి మూగునీడ
లరుణ దారుజ్వాగ్ర హాట్టహాసము రేష
మునిరిపోవు వంత మనకలట్లు;

అంతమెత్తని చేయి నాయంస పైకి
తాకినట్లయ్యె మరియు మెత్తన్ని రవమ్ము
ఊదినట్లయ్యె చెవిపొంత ఉండి ఉండి
నీతువున దోచు తాలి చైత్ర గీతివోలె;

“ఏమండీ! ఇకలెండి! వాకిటికి రానే వచ్చె సంక్రాంతి,-ఏ
మేశ్లా ఎన్నడు యోచనల్ సెగవు మీ, కీలాగు కూర్చుందు రం
డీ! మానండి దిగుళ్ళు మీ మనసులో! ఈలోక భారమ్ము మీ
రే మోసేరె? సుకమ్ముగా నడపలేరీకాస్త సంసారమున్!

ఉందువా ఊదునో మరెపుడో విలయావనరమ్మునందు బ్ర
హ్మాండములంచు వేడుకలు మానుదురా ఇపుడెవ్వరేని? ఏ
పండువులో ప్రతిక్షణము పర్వములో ఇటురావా అనలున్
పండిన కోరికల్ పసిడి స్వప్నములున్ పసి వాడిపోవవా?

మన చిన్నసీత లేవనెలేద, గోమయ
హిమవారి కలయంపి యెవ్వరిడిరి?
కూర్చున్న తప్పడే కొలువులో గొబ్బిళ్ళు
వన్నెవన్నెల రంగవల్లులందు.

ఎందుకో తొందర లీ బంతి పువ్వులకు
కొమ్మల రవ్వంత కునుకురాదొ?
ఎలమావి లేతయాకుల తోరణాల గు
మ్మాల బుట్టాయి కాబోలు కూర్చె!

పండుటాయెను ఎటులూరకుండు మాయ
మసక లెరుగని పసికందు మనసులాయె?
కలలో కోరికలో పూలుకాయ లగుచు
ప్రాకి కొనిపోవు ఆ బీరపాదులట్లు

మెడచుట్టి మంచులో తడిసి పోయినముద్ద
బంతి కడాని లలంతికలును
బుజములపై గుత్తముగ నొత్తియుండని
తెలిచీర చెరగుల మిలమిలలును

పచ్చపచ్చనిపైరు పరికిణీ మడతల
సగము కన్పడెడు సెనగ పువులును
కెంగేల జారువాగిండిలో బునబున
మని పొంగుమైరేయ మాధురులును

కేతనముపై హనంతిక, శీతవాత
పీచికా సైంధవమ్ములు, వెదలివచ్చె
సుందరమ్ము సేవంతికాస్యందనమ్ము
పైని సంక్రాంతి నాటి ప్రాభాతలక్ష్మి!

తలయెత్తి చూతును గదా దవులందు పొరున్
ధలికారు ఈదర హూమాయి వయిన్ బయళ్ళన్
వలివంపు మంచు ముసుగంచులు తేలిపోగా
ధలియించు లోధ్ర సుమ మేఖల తూలిపోగా।

దవులన్ దోచెను నవ మా
దవమూగధ గీతులంత, తరుణి పెదవులన్
మివులన్ జూచిన మంకెన
పువులన్ తొలినాటి వండువులు స్ఫురియించెన్।

నా యింటి ముంగిటను, నా
ప్రాయపు వాకిట, వలగ్న లగ్న శ్రీదాం
పేయ మధుపాత్రతో సతి
తీయని సంక్రాంతి లక్ష్మితెరగున తోచెన్।

“మున్ను హిమవేళ పొద్రోలుచున్న వగరు
పొగలు, మృగమదపీటికా ఘుగఘుగలు ప్రి
యాంగనాలింగనాలు, నే డవసరములు
కుంపటులు దుప్పటులు మాకు కుప్పనములు”

మనరు సరసాలంత మగువ చెవిలో నుంత
గునగునలు గానెవోకొసరితినా లేదో
మినమినల యెలనగవు లొనవరి పెదవిదాచి
విసరు కొను చిల్లాలు ఏటి లోవలి కేగె।

('పల్లకి' అనే సంకలనంలోనిది. సం ప్ర. తేది 1975)

# సంక్రాంతి

తుమ్మల సీతారామమూర్తిచౌదరి

కొసరి నూటిన పచ్చిపసుపు పూఁత మొగాన
గుమ్మడి పూదుమారమ్మునద్ది
కందరేగడ నారబంది కన్పిందువై
పొలుచు మిర్యపు బందు బొట్టువెట్టి
వలిపెమ్మునకు నొక్కవాసి హెచ్చయినట్టి
నును మంచు తెరచీర నూలుకొల్పి
బంతిపూవులకు జేమంతి నెయ్యము గూర్చి
కబరీభరమ్ము చక్కనకుదిర్చి

పంట కళ్లాలు మును బరాబరులు సేయ
గూడు కట్టిన తెలిమబ్బు గొడుగునీడ
కదలివచ్చెను భాగ్యాల కదలిబోతె
మకరసంక్రాంతి లక్ష్మి హేమంత వీధి

నెలదప్పినట్టి కోడలి చేత నొకయత్త
భోగి పొంగలిపూజ పూజచేసె
పుట్టినింటికి వచ్చినట్టి కూతు గులాబి
చెక్కిళ్ళనొకతల్లి చెనకిపుణికె
మాఱువడ్డించెడి మరదలి కెంగేలు
పట్టికవవల్దనెనొక్క పెంకిబావ
వంగి ముగ్గులు దిద్దు వదువుపై నీర్చల్లె
గడపీడి చనునొక్క గడుసు మగడు

అపుడె వచ్చిన ప్రియుని సోయగము గనుచు
దలుపు చాటున నొక్క పైదలి చెమర్చె
మధుర మధురానురాగ సామ్రాజ్య పీఠి
జగము కొలువుండె మకర ధ్వజంబునెత్తి.

తెగడి పాలలో గ్రాగిమాగిన తీయ
      తీయకప్పుర భోగి పాయసంబు
చవులూరు కరివేప చివురాకుతో గమ
      గమలాడు పైర వంకాయకూర
తరుణ కుస్తుంబరీ దళమైత్రి మైనాల్క
      త్రుప్పుడుల్చెడు నక్కదోసబజ్జి
క్రొత్తబెల్లపు దోడి కోదలై మరిగిన
      మధుర గుమ్మడిపండు ముదురుపులుసు

జిడ్డుదేఱిన వెన్నెలగడ్డపెరుగు
గర గరిక ఱాటు ముంగారు జెఱకురసము
నంతరించితి విందు భోజనము సేయ
రండు రండని పిలిచె సంక్రమణలక్ష్మి.

లే బొట్టతోఁ బిసాళించు నామునకు న
      క్కోరు దూడలు వెండి కొండలయ్యె
నిముసాన కొకసారి నిండు నక్షయ పాత్ర
      గానిచే సాతానిగజ్జెవిప్పె
కల్లు పెల్లాని రంగము పెట్టెఁ గాకలి
      నాదమ్ము పంట యేనాది ఇంట
ప్రాఁజీరవిడి మాలపడతి క్రొత్తలు దాల్చె
      సూచించె శిశిరర్తు సుదతిరాక

క్రొత్త కుసుమ కూడు కుత్తికబంటిగా
బిచ్చగాని కుక్క పెచ్చరిల్లె
చేవ తనివి వేడ్క చెలువంబు కావరం
బగ్గలించె నుత్తరాయనమున

("పఁగవంట" అనే సంకలనంలోనిది సం.ప్ర. తేది 1944)

# సంక్రాంతి

దేవులపల్లి రామానుజరావు

చిగురు చెక్కిళ్ళ ముంగురుల్ చిక్కువడగ
మొల్ల చిఱునవ్వు మోమున మొగ్గదొడుగ
అగరు తిలకంబు బొమ్మలనందగింప
చిలుకపలుకులు పలికెను చిన్నచెల్లి.

"అన్న, యెక్కడి కేగెదు నన్నుఁ జూడ
సకియ, సంక్రాంతి వచ్చెడు సమయ మయ్యె
క్రొత్తబొమ్మల నీవిప్డు దెత్తువేని
ఇచ్చెదను నీకు ముద్దులనెన్నియేని"

బాల సంక్రాంతి తోడ మేలమాడి
వత్సరం బయ్యె నెచ్చెలి వచ్చెనంట
ఎప్పుడో యెప్పుడోయని యెదురు చూచు
ఈడు కన్నెలంతోగూడ యాడుకొనఁగ

కుంకుమంబులు చల్లి గొబ్బిముద్దలు వెట్ట
పగడాల సొగసును పరిహసింప
పక్షివ్రాలిన భంగి వన్నెపు ముగ్గులు దీర్ప
పుష్యరాగంబుల పొలుపుమీఱ
రంగార దీర్చిన రంగవల్లిక గుంపు
కన్నెతీగలవోలె వన్నెగుల్క
జదఱగొని వల్లెలు జాతి ముడిచిన చోటు
ముత్యాల సొగసుతో ముచ్చటాడ

చీర కుచ్చిళ్ళు పదముల చిందులాడ
తెనుఁగు వాకిండ్లఁ దిరిగెడు తీఁగఁ బోండ్ల
సరసల్లాపములు సేయు సమయమందు
పుట్టినింటికి వచ్చెను పుష్యలక్ష్మి.

కాళ్ళ కడియాలు కరముల కంకణాలు
మధుర మధుర స్వరంబుల మాటలాడ
ఆంధ్రగృహముల గారాబుటాడుబిడ్డ
వనిత సంక్రాంతి యల్లన వచ్చునపుడు

గంపనెత్తిన బెట్టి సొంపుగాఁ జూచుచు
చిన్న చేసున కేగువన్నెలాడి
కొదవలిచేఁ బూని కులుకు కులుకుచు
కాశెగడ్డినిగోయు కాఁపుకన్నె
పసుపు చీరనుదాల్చి బంతి పూవులమాల
లందంబుగా గ్రుచ్చు సుందరాంగి
కమ్మ సంపఁగి తోట చెమ్మచెక్కల నాడు
చిన్నారి పొన్నారి చెలులగుంపు

ఎదురుగానేగి "ముద్దుల వదినె, రావె
మేన గోడండ్రు నిను జూడ మిరప తోట
పొంత కనువందు వొనరించు పొగడచెట్ల
విరులు గ్రహియించి తెచ్చెదు వేళయయ్యె"

అనుచు నాహ్వాన మొనరించు నవసరాన
ఎవరు పిలిచిరి చెల్లెలా, యెందుకింత
సంబరంబుగ వచ్చు సంక్రాంతి యనుచు
తియ్యతియ్యగ పలికెడు తొయ్యలులును

ఉల్లమలరఁగ మా చిల్క తల్లికిపుడు
పసుపు కుంకుమ లర్పించి పంపవలయు
ననుచు వచియించు నాప్తులునలరు చుండ.

('పచ్చతోరణము' అనే సంపుటంలోనిది, సం.ప్ర, తేది 1981)

# స్వాగతం

రాయప్రోలు సుబ్బారావు

నమస్తే సమస్తాంధ్ర నవరసాలంకృతీ!
మృదుమధుర, రుచిరుచిర ప్రియ తెలుగు భగవతీ!
నవరసాలంకృతీ! నమస్తే.

• •

తేనెలో మాగిన తియ్య మామిడి పండు,
పన్నీట పెరిగి పాల చెఱకురసంబు,
కలిసి కమ్మదనాలు, మెలసి మెత్తదనాలు,
మందార మాకంద మకరంద పాకమై

స్తన్యమాయె మహాంధ్ర సంతతికి తెలుగు.
మురళికని వీణె నను శ్రుతి సరళి నేర్పు,
భ్రమర పిక కంఠములను రాగములు నింప
పాటకును పద్యమునకును పదిలిదిద్ద
స్తన్యమాయె మహాంధ్ర సంతతికి తెలుగు

• •

జాజిపువ్వు నాజూకు, జాజాము నవకంబు
మల్లెపువ్వుల పరిమళ పరీవాహంబు,
జాజారు సెలయేండ్ల సన్నాయి గానంబు
ఎలకోయిల మిటారి యెలుగుల విలాసంబు

తెలుగు నుడికారమున సమ్మిళితమాయె;
మురిసి బాసాడి ముద్దులాడిరి నృపాలు
రును శ్రీకృష్ణదేవరాయలు నుతించె
దేశ భాషలందు తెలుగు లెస్స.

• •

బౌద్ధధర్మాచార్య సిద్ధ నాగార్జును
బహుశాస్త్ర వైదుష్య పారమెంచి
ప్రథితమాంధ్ర సామ్రాజ్య భాగ్యదేవతలైన
శాతవాహనుల శాసనము లరసి,
దిగ్విజయ స్తంభ మెత్తిన కృష్ణరాయల
నాగర పరిపాలనము తలంచి
రాగ తాళ విధాత త్యాగరాజస్వామి
నాదకళోపాసనము స్మరించి

పిలిచినారము వినసొంత తెలుగుతల్లి
పుట్టి పెర్గిన మహాంధ్రభూమి, కి ఉ
గాది పండుగనాడు శుభోదయముగ
యావదాంధ్ర సమైక్యకళ్యాణమునకు.

• •

తల్లి బిడ్డల ప్రాణ తంతు తంత్రంబైన
నాభినాళమును ఆనాడె తెగకోయుదుము,
తల్లి నుడికార బంధము తెగదు త్రెంచినను,
ఉసురులు గొంతులో ఆసియాడునందాక.

ఈ జీవిత రహస్య బీజబాంధవ మెంచి
అమంత్రణించితిమి అయిదుకోట్లాంధ్రులము
స్వాగతము మీకు దూరాగత సజాతీయ
తెలుగు సోదరులకు, అతిథిమహాభాగులకు

అందుకొనరయ్య ప్రీతి, సర్వాంధ్ర జనస
మైక్య సమ్మేళనాపేక్ష నవధరించి
ప్రజలలో ఐక్యధర్మదీపము వెలుంగ
తెలుగుతల్లికి సాంగమంగళము పాడ,

అందుకొనరయ్య ప్రీతి మా స్వాగతంబు.
నమస్తే! నమస్తాంధ్ర నవరసాలంకృతీ!
మృదుమధుర శుచిరుచిర ప్రియతెలుగు భగవతీ

('తెలుగుతల్లి' అనే సంకలనంలోనిది సం.ప్ర. తేది 1975)

## పుణ్యక్షేత్రాలు

విశ్వనాథ సత్యనారాయణ

తూర్పుగోదావరం — దున అన్నవరమున
సత్యనారాయణ స్వామి వెలసె
భద్రాచలమురామ — భద్రుని క్షేత్రమై
భక్తకోటికి దివ్య భాగ్యమయ్యె
గోదావరీజిల్ల - కోటిలింగాల్మతి
కోడుకొండయు భక్త - కోటిధనము
నరసింహదేవుని - పరిశుద్ధనిలయమై
వెలుగునంతర్వేది - తెలుఁగు భువిని
భీమవరమునందు - భీమేశ్వరుని గుడి

సుప్రసిద్ధమునైన - కోటదనరు
ద్వారకా తిరుమల - దంతి దేవళమౌర!
భక్తకోటికి దివ్య - ప్రాప్తినొసఁగు
వేలాద్రినరసింహ - విదిత దేవళమౌర
జగ్గయపేటలో - చెన్నుఁదనరు
విజయవాడ్దుర్గాంబ _ విదితాలయముఁ భక్త
కోటి కోర్కెలఁదీర్చు - కొండగృహము
ఉండవల్లికొండ - దంతి శిల్పములందు
శ్రీరంగనాదుడు - వెన్నుఁదనరు
కోరికల్ దీర్చెడి _ మేరి దేవళమౌర!
గుణదలవైభవ - మణిమకుటము
రామ కోటిక్షేత్ర - రమ్య గుంటూర్పురి
క్రిస్తాలయముల - ప్రశస్తపురము
మతభేదమెంచని _ మస్తానయాఉర్సు
గుంటూరు సౌభాగ్య - కూర్మిఁజాటు
వరఫిరంగిపుర - మరియమ్మగుడి మహా
వైభవోపేతమై - వఱలుసతము
నర్సరావ్పేట వి - న్నాణమౌ కోటప్ప
కొండ శివాలయ - మండితంబు
మాచర్లపురమున - మహిమాన్వితంబైన
చెన్నకేశ్వరగుడి - సన్నుతంబు.

హిందు ముస్లిము క్రైస్తవా - నందమొసంగు
దేవళాలు మసీదులు దివ్యముగను
వెలసి యుండిన తెలుఁగు - భూ వెలదిమాత
నమిత సౌభాగ్యసంపదల్ దాటు వెలుఁగు.

('ఆంధ్రప్రశస్తి' అనే సంకలనంలోనిది సం.ప్ర. జీవి 1961)

# ఆంధ్రకన్నడ విద్యానగరవైభవము

విశ్వనాథ సత్యనారాయణ

శ్రీకర తెల్గుకన్నడ వి - శిష్టవసుంధర కృష్ణరాయనిన్
ప్రాకటమైన వైభవము - భాసురప్రజ్ఞ వివేకసంపదల్
వీఁకతనంపు టేలుబడి - వెల్గుల నీనిన విద్దియనగర్
తేఁకున తెల్గుభూసతి ప్ర - తీతినిఁగాటు ప్రభాతశోభహో!

శ్రీకృష్ణరాయని - చెన్నారు సభయందు
తెలుగు సాహితికన్య - తేజమొందె
అష్టదిగ్గజకవు లమృతకృతులతో
తెలుగుసాహితికన్య - తేజమొందె
సంగీతనాట్యాల - భంగిమల్ చెలరేగి
తెలుఁగు కులుకు సొంపు - తేజమొందె
సరిగమపదని సం - సక్తసప్తస్వర
కంఠమందున తెల్గు - కళలు వెలసె
వివిధ భంగిమశిల్ప - విజ్ఞాన శోభతో
తెలుఁగు దేవళకీర్తి - తేజమొందె
రంగారు నవరత్న - రాసులచ్చటవెల్గి
తెలుఁగు సంపద నిత్య - తేజమొందె

కవిత సంగీత నాట్య వికాస గరిమ
వరవసంతభాసనల్ మురిపమొప్పి
నవ్వువెన్నెల విరపిన - పువ్వుఁదోట
విజయనగరము తెలుఁగు పవిత్రవెలుగు

కృష్ణరాయనికైత - కీర్తి చంద్రికలీను
ఆముక్తమాల్యద అమృతఝరము
అల్లసాన్పెద్దన - అద్భుత వర్ణనా
ఘనుచరిత్రము మహామణిసరళ్ళు

రామరాజ్యాభూషణున్ - రసవసు చరితము
భాషావిభావ సం - భారపేటి
తెన్నాలిరాంకృష్ణ - దివ్యమౌ పాండురంగ
మహాత్మ్యమెనలేని సాహితినిధి

నందితిమ్మన రచితమై - సత్ప్రణయ
పారిజాతాపహరణ సం - పద కలశము
ఆంధ్రభాషా వధూటి పంచేంద్రియములు
తెలుఁగు భూమాత విజ్ఞాన - దివ్యధనము

ఆంధ్ర రాష్ట్రావతరణ పూర్వాంధ్ర భువిని
మహిత బళ్ళారి మండల మలరెనందు
సరస బళ్ళారి రాఘవాచారినటన
తెలుఁగు భూమాత సల్లాస్య వెలుఁగుతళుకు

('ఆంధ్రప్రశస్తి' అనే సంకలనంలోనిది. సం.ప్ర. తేది 1981)

## హంపిక్షేత్రము; దేవాలయములు

కొడాలి వేంకటసుబ్బారావు

ఏ దేవి చిలికెనో ఈ పాలమీగడ
    విఠలాలయ శిలావేదులందు
ఏ జోదు చిందెనో రక్తగంధము
    నరసింహ దేవు పేరురముమీద
ఏ శిల్పి దిద్దెనో ఈ కారు మబ్బులు
    ద్వారకాలకరాము తేరుమీద
ఏ రాజు తూగెనో ఈతలాడోలలో
    తులసి బంగారు మొక్కలకు మ్రొక్కి

ఏ మహా భక్తుడిట జపియించినాడొ
దివ్యకోదండరామ పవిత్ర నామ
నయన శబరీఫలాపేక్ష నియతుడగుచు
కాల వృందాటులందు సంకరములన్ని

ఆంధ్రాది పాతపత్రాచ్ఛాదనాచ్ఛ వై
రూపొకనాడు కర్పూరపుకాంతి
సరిగమపదనిస స్వర పల్లకితుల్య
రసవిశేషా నంత రాగఫణితి
కోదండరామ సాంగోపాంగనీలలో
దీప్రసారార్ద్ర శిలాప్రతిష్ఠ
ద్వారదేశాధిష్ఠ శ్రీరామ దేవాల
యస్థ శిలాచిత్ర యక్షవాటి

పన్నగస్వామి శయ్యాన పాండురారు
జచ్ఛవి ప్రసన్న ప్రశాంత ప్రమోద
పద్మనాభ మహాదేవు ప్రతిమగాంచి
విస్మయాధిక్యమున దేహవిస్మృతులము.

## హంపీక్షేత్రము : నర్తనశాల

కొడాలి వేంకట సుబ్బారావు

కాళ్ళపారాణి చిక్కన నృత్య వేళల
చెమటలో కరగి పోసినది “దార”
చక్రభ్రమణవేళ జలతారు తలకట్టు
తెగిన ముత్యాలు దిద్దినది “ముగ్గు”

విశ్రామ కేళికావేళ వాదించి వ
    ల్చీసులో నెంచి కచ్చినది "పావు"
నృత్యగాన పరీక్ష నెరిగి దినాఖ్యాన
    మునకు ధరించి విప్పినది "గజ్జె"

రేగిపోలేదు, చెరగను లేదు కదలి
వంటగదితప్పలేదు నర్తన్వరాల
కనుగుణంబుగ బ్రమోయ మానినదిలేదు
నేటికిని గిన్నరాంగనాని చయమాంధ్ర
రాజకన్యానుసరణ పరత్వమందు
తెలుగునర్తనశాలలో తిరుగుకతన

వెన్నెల రేల మా తెలుగువీరులు కిన్నెరకామినీ వయో
ద్యున్నతి కొల్లగొందురట పూర్వము తమ్ములరాచకన్నియల్
మన్ననచేసి ప్రేమమున మంచిగాధల జ్ఞప్తి నాకమం
దున్నను వాడుకల్ విడువనోపరు నైజము లిట్టివేగదా.

నర్తనశాలలో ప్రణయ నాట్యమొనర్చిన భీమబాహువై
వర్తన మప్పు కీచకునివంతితిహాసములోన తెల్గు భూ
భర్తపసింది సాలవయిజారిన మ్లేచ్ఛుల కంటి చూపులన్
వర్తిలు కీచకత్వముల వంతున కొక్కడు లేడె భీముడై

గురుపూజలో తృప్తి కుదురని సన్యాసి
    చిరునవ్వుమొలక వంచించెనేమొ
సింగర్వమున దృష్టి చెదరిన సిద్ధాంతి
    గుణకారలబ్ధి సంకుచితమేమొ
కవిరాజు పద్యసంకల్ప హర్షంబున
    విషమాక్షరంబు కన్పింపదేమొ
దాసియయ్యు పతివ్రతాత్వతంగము కోడి
    నిట్టూర్పులో నగ్గినిలిపెనేమొ

తెలుగు రాజుకు పుట్టిన తెగులు పరువు
తొలిచెనోయేమొ ఆంధ్రుల తొలకరిసిరి
కానిచో ఎన్నదనుకోని దీన చరిత
కాస్పదంబయి పోవునే ఆంధ్రమాత!

('మణిమకుటము' అనే సంకలనం లోనిది. సం.గ్ర. తేది 1961)

## హంపీక్షేత్రము : దశరాదిబ్బ

కొడాలి వేంకటసుబ్బారావు

కురిసిన దిచట కాకుత్స్థుల బృంహణములోన
కవిరాజు పైన బంగారువాన
సలిపిన దిచట ధూర్జటి దివ్యరేఖిని
సత్యకారంగనా నర్తనంబు
తొడిగిన దిచట నిస్తులరాజహస్తము
కవిపితామహుకాలి కంకణంబు
విరిసిన దిచట ప్రవీణ వాచస్పతి
రామలింగని హాస్యరస సమృద్ధి.

అది శిలలదిబ్బ దసరాలకైనదిబ్బ
తెలుగు లలిత కళాదేవి తీర్చినట్టి
కొలువు కూటపుదిబ్బ వన్నెలకుదిబ్బ
మా మహర్నవమీశాల మంటపంబు

ఆడుచున్నది రెక్కలార్చి గరుత్పతి
తెలుగు జెండాకఱ్ఱతీసిరేల
పిలుచు చున్నది పాలపిట్టరాయల పేళ్ళు
వరుసగా గద్దెనెక్కరధియేల

పాడుచున్నది రిచ్చపడి కోకిలాంగన
　　అష్టదిగ్గజము లేమైరి రారు
విలుచు చున్నది నెమ్మి విసిగి వన్నెలరాళ్ళ
　　తళుకమ్మదేల వర్తకులగుంపు

ఆంధ్రసామ్రాజ్య నాటకా భ్యంతరమున
చివర తెరజారిపోయిన చిన్నెలరసి
మంగళంబును బాడిన మాడ్కి నేమొ
తిరిగొంతెత్తు చున్నదీ ద్విజకులంబు

('మణిముకుటము' అనే సంపుటంలోనిది. సం.ప్ర. తేది 1961)

## హంపి - విజయనగరము

క్రొవ్విడి వెం: ట రత్నశర్మ

"మందార మకరంద మాధుర్యముల" జుట్టి
　　నక్కవిరోలంబ సంభ్రమంబు
గగనభాగమునంటు కలధౌత, గాంగేయ
　　ఖ్యంబిత సౌధాళిడంబరంబు
భటయూధ, రథచక్ర భయదభుండాదండ
　　ఘీంకార హయహేషసంకులంబు
ప్రాగ్దేశ, పాశ్చాత్య వరిమహంసాదార్య
　　తీర్థసంవాన ప్రోద్దీపితంబు

ప్రకృతి లావణ్యలాస్యప్రభాసితంబు
"భువన విజయాఖ్య" దర్ప ప్రపూరితంబు
భూరిగేహంబు శ్రీ జగన్మోహనంబు
"విజయనగరంబు" వగరకు తికరంబు.

ఏ వంకఁ జూచిన నిందిరా మందిర
        చందనగంధుల సరసగోష్ఠి
ఏ తట్టుగనిన వాక్ స్వాతంత్ర్య మేపారు
        భూసురప్రవరుల సంబోధనమ్ములు
ఏ వైపుఁ బరికింపఁ గేవల ముగ్ధ లా
        పుష్పలావికల సమ్మోహ గోష్ఠి
ఏ వీథి కేగిన నావంతఁ జేరని
        రత్నవర్తకుల బేరముల మురుపు

ఎచటఁ జూచిన "కృష్ణ" శబ్దేతిహాస
వీరగాథలు రోదసింబోరుఁ గొలువఁ
బరగుఁ బ్రావీదిశాంగన భర్మ్యశాల
విజయనగరంబు శుభముల విలసనంబు

సురచిర మాణిక్యశోభలఁ దొలుదీవి
        పద్మరాగైక సంపద్విభూతి
సరిలేని పలిము తైనరుల కరాటంబు
        నానా విధారామ నందనంబు
శోభిత సౌందర్య వైభవో పేతంబు
        స్వర్గలక్ష్మిని( జిమ్ముపట్టఁగొమ్మ
కాంతసీ గభీ రసరసుల కావాల
        పండిల సద్విజకోటి కావరణము

శుద్ధ్య, కుట్టిమ, తోరణ, గోపురంబు
మంగళాలయ, మయసభా మంటపంబు
సప్తప్రాకరముల మధ్యస్వర్ణపురము
విజయనగరంబు కల్యాణ విలసితంబు

పారిజాతసుమాళి భూరి మాధురులొల్క
    సత్కారరంగముల్ కానలేకట!
మహితకాంచన మణి మయవేదికలఁగ్రాలు
    సౌధసంభృత మహావీథులేకట!
పద్మరాగోపల ప్రాకారరుచులదే
    వఱలెడు రాజమందిరము లేకట!
రమణీయ సౌవర్ణ-రత్న భాండారముల్
    తవణిల్లు కొలువుకూటంబు లేకట!

లలిత పీఠాన దళవాయి కొలువుఁదీర
వంది, మాగధ, తూర్యకైవారములును
ఛత్ర, చామర, వేత్రహస్తాళి వెలయు
విజయనగరంబు వైభవ విలసితంబు.

గుండెల్ నీరగు, మేను చాల వడఁకున్ క్షోభించుఁ జిత్తంబు, హా!
గండూషీకృత భోగ భాగ్యములతోఁ గన్పట్టు నాహంపినిన్
జెండాడంగను శత్రుసేనలకు నాజ్ఞన్ జేతులెట్లాడెనో!
భండారంబునఁ గొల్లఁ గొట్టిన సిరుల్ భావింపనో ఆంధ్రుఁడా.

('ఆంధ్రస్మృతి' అనే సంకలనంలోనిది. సం. ప్ర. తేది 1946)

# ఓరుగల్లునంది

విశ్వనాథ వేంకటేశ్వరులు

మోము మలంచి దుఃఖమున మున్గిన నీయెదఱాయి కాగనే
బాములఁద్రవ్వుకొంచుఁగడఁ బెట్టెదవో! యల యోరుగంటి రా
ట్ప్రేమహనీయ హస్తమున చెందిరదాకిన గంగడోలు బా
ష్పామిత వారినల్లబడి ప్రాకుడు వట్టినదే వృషేశ్వరా!

స్థాణుఁగ నమ్మి శివత్వభావములనుఁగ స్థాణుత్వముంజెంద ని
ద్రాణం బైనది యోరుగల్లు బసవా! త్రయ్యంతనాదాకృతుల్
శ్రేణీమంజులముల్ శ్రవఃప్రియములుఁ ఝల్లత్కృన్నృత్యోన్మిష
త్ప్రాణోత్తేజకముల్ శివద్గళస్థ నవఘంటనాదల్ లేమిచేఁ

వేయి కంబములందు వేయిజోతులు వెట్టి
    ఆరాత్రికల నెత్తి నాంధ్ర శిల్పి
ఖడ్గధారాంచలోగ్రానల ప్రభఁబెట్టె
    నీ రాజసము తెల్గునేల తేఁడు
వీరమాహేశ్వర విక్రమాత్మార్పణ
    క్రమసిద్ధిగనె నోరుగల్లునగరు
కవితా సరస్వతీ క్రమనృత్యోన్మిష
    ద్భృగంబులిడె నాంధ్ర భూతలకవి

ఓరుగల్ రుద్రుకంటఁ బెల్లుబ్బు సెకల
శివనాదుల కడిమి యుష్టీకరించి
లీలనాడిట శ్రీశివలీల లెన్నొ
నేఁడికిట్లైతి వెట్లుగాని, వృషేంద్ర.

నీ కకుదంబు నాంధ్ర రమణీయ కిరీటమణీకుచంబుగాఁ
జేకొని తాఁజెమర్చెనొకొ చిత్రమునన్ శివుఁడొక్క నాఁడు, దీ
నా కమనీయ మూర్తి విటు కాలుకదల్పవు వేయియేండ్లకే
నీ క్రియనుండు మెప్పటికినీ శివమూర్తికి వెష్టపుట్టునో!

ప్రోలుఁడు మింటి కెత్తి నల పువ్వుల దీపిక తెల్గునేల వె
ల్గె లలితంపు వల్లులయి, కాకతి వంశ్యుల దీవ్రశౌర్యపుం
దైలముచే నుపుష్టమయి, తావక శృంగయుగాంతరస్థలీ
నీలిమణి ప్రరోహమయినేఁటికి మాసెనుగా వృషాధిపా!

నీ ఱంకెగర్జయై నెఱియలు వాఱిన
పర్వతంబులు వజ్రపటలికురిని
నీవు కాల్ద్రివ్విన బావమ్ము లిగిరించి
పుడమి దేనువు వంటపుల్కలంది
నీఱనకొట్టుటన్ నెగసి వాయువులాది
యరి సైన్యములు నంతనంతబాఱె
నీవు కొమ్మునఁ జిమ్మ నెగడియోగ్గలు హేమ
శిఖరి బంగారు వర్షించి మించి

నీదు మయమై చెలఁగుఁ దెల్గునేల యెల్ల
నీవు నిద్రింప నీలోననిద్రఁజెందె
వృషభలోకేశ త్వత్తనూవృత మహాగ్ని
కుండలముల నూది దాని మేల్కొలుపరాదె!

గణపతి రుద్రదేవు లెల కావరులై నినువోరుగంటి వ
చ్చని బయలందు మేపుకొన సాముగవంగిన మూపురంబు గో
మునఁగరుఁగుఁన్ నవాంధ్ర గపిముగ్ధ రసాకృతియౌచుఁ బల్కరిం
చిన యెద మాదునిర్ఝరులు చిందినదయ్య పహోక్ష చంద్రమా!

క్రుమ్మిన కోర కొమ్ము కొనఁగ్రూర తురంగమరా[illegible]
చిమ్మఁగ పూత్కృతుల్ నెఱపఁ జెంగున దూకిన గిట్టతాకునన్
దుమ్ము తుఱంగలించి శివద్రోహులు తుత్తుమురై చెదరంగ ను
గ్రమ్మగు నీదు మూర్తి కనరాదు తెలుంగులు చిన్నవోవఁగన్.

శివుఁడు శివానియు శాపురే యని మెచ్చ
నోరుగల్ గవనిలో హుంకరించి
యరిసైన్యముల కంటికఱగవ ఖడ్గ ధా
రాలంకృతమ్ములు హరతనువులు
శతసహస్రమ్ములోఁ ప సమయాంతపుష్కలా
వర్తకాళవిపాత భయదములయి
శతశృంగ ఘట్టనల్ శాతవాలోక్షిత్రి
వహ్నిస్ఫులింగముల్ పట్టికాల్పః

శాయవడియును ఐద్వియుఁ జేయుకాల
వార్పనేరక శివశివయఁచు నుఱిగి
యాంధ్ర వైరులు నీదాని కాఁగలేక
శరణుకొచ్చిరి ఐనవః పుచ్చరములుడిగి

ప్రతవసంస్థితిలయ ప్రపంతముల్ శాను వి
ష్ణుగిరీశ మన పరంజ్యోతులెదుట
జ్యోతిర్మయంబైన శుద్ధాకృతిందాల్చి
త్రైలింగ శిల్పవిద్యామహస్సు
శత సహస్రస్తంభదర్పణ ప్రతిబింబి
తాంధ్రప్రతాపదివ్యార్చిఁగూడి
కొలువఁ గాకతిదేవి తెలి కన్నుగవకాంతి
పద్మాక్షి నవతసూత్రపతలు కలసి

ఘోరతులు దిద్ద నప్రతిహతము నద్వి
తీయమప్రమేయమ్ము జ్యోతిస్సు వగుచు
ఆంధ్రమ్మున స్వర్గ తేజమ్ములలరఁ జేసి
యేకశిలమున శిలవైతివే వృషేంద్ర,

తెలుఁగు శిల్పులు ఱాయిమలచి ప్రాణమువోయు
        శిల్పవిద్యాధ్వరానల్ప విధికి
తెలింగ రాజ్య కేదారఖండమ్ముల
        సస్యేందిరా నృత్యసవన విధికి
తెలుఁగు నరేంద్ర హేతి జ్వాల దీపించి
        యరిహవిస్సుల వేల్పు హవన విధికి
తెలుఁగు రాజ్యోద్ధిర తులనక్రమాతీత
        సౌభాగ్యమిదు విశ్వసత్ర విధికి

గలమి నధ్వర్యుఁడవయో గనకవృష్టి
కృత మహావభృథస్నాన కేళిగాంచి
సర్వమభవుని కోటకుఁగా సన్న్యసించి
యచలమూర్తిని గొంటి వోయాదివృషభ!

ఇది యాగంబు శివార్థమై జరిగె నిందెవ్వారి కెట్లైననున్
దుదినోంకార మహాగ్రపీఠమున సంస్తుత్యప్రభాజ్యోతివై
చిదతీతస్థితి నుండు పూర్జిత జగజ్జేగీయ మానుండవై
మది నాంధ్రంబు కృతంగు చుండుత భవన్మాహాత్మ్యదివ్యాబ్ధిలోన్.

('మణిమకుటము' అనే సంకలనంలోనిది. సం. ప్ర. తేది 1961)

# తెలుగు వెలుగు

గుర్రం జాషువ

జననం బందె నపూర్వవైఖరులతో, సంగీత సాహిత్య మం
దన! నీ తెల్గుమిటారి చెన్నపురి వీటన్ గజ్జెమ్రోయించుచున్
దనువుప్పొంగఁ బురాత నాంధ్ర విభవోద్యానంబు రేకెత్తె, మో
హన గానంబుల నాలపింపగదవయ్యా! ఆంధ్రయోధాగ్రణీ!

ఒకనాఁ డాంధ్రుని కత్తి, శాత్రవ బలవ్యూహాల పై రక్తనా
టకమున్ సల్పుట విస్మరింపకుము, గాఢంబైన పాశ్చాత్య శో
భకు నీ విప్పుడు లోబడైతివి, ప్రదీప్తంబైన నీ ప్రజ్ఞ నూ
రక పోనీక సముద్ధరింపు కొను మాంధ్రా! వీరయోధాగ్రణీ!

బోళావాఁడవుగాన నీదు విభవంబున్ సత్కళా మర్మముల్
జాలాబాగము కొల్ల బెట్టితివి నీ శాస్త్రప్రపంచంబులో
మేనెల్లన్ గబళించినారు పరభూమిశాగ్రణుల్. నేటికిన్
బోలేదేమియు దిద్దుకొమ్ము బలగంబున్ స్వీయ విజ్ఞాన నో

తలికోట యుద్ధానఁ గూలియ రాముని వల్ల
చిద్దిలిపోయినదె నీ శిరదట్టి
మాయనాయకురాలి మారాముడుల చేత
మాయరచె నీ బాలచంద్రరేఖ
దిల్ బుద్ధిమాలిన చిన్ని పొరపాటుకతమున
వితమయ్యె నీ కొండవీటి పటిమ
ఉత్సాహయుతమైన యుడుకునెత్తురు లేక
ప్రాప్తింపలేదు రాష్ట్ర ధ్వజంబు

తరువు దూరిన నీ యనాదరణ కతన
ప్రజ నీ భాష పొలిమేర దాటలేదు
తరుల విజ్ఞానమునకు సంబరముపడక
కరగి యొత్తుము నీ వీర కాహళంబు

దీనాపెగోడాల నిగమీది పువ్వుమై
పొదమె నీఖాతి చెక్కడపు చెణుకు
అరవ పాటకుల తంబురకు ప్రాణమువోసి
కులికె నీ చిన్నారి తెలుఁగుబాణి
హిమవదిరులదాక జృంభించి వగవాని
తరిమివెన్నాడె, నీ కఱకుటలుగు
మొగలు రాజుల నవా భూములనూరేగె
నీ జగన్నాథ పండితుని పలుకు

ఎందుఁ జూచిన నీ యశస్స్యందనములు
నడచిపోయిన జాడ లప్పుడును గలవు
దిక్తటంబుల యలర నెత్తింపవోయి
తెలుగు మన్నీల వనుపు నిగ్గుల పతాక.

తెలుగుం గేసరులుజా మహర్షులును గాంధీ శాంతిసేనాపతుల్
గలరాంధ్రప్రముఖుల్ త్వదీయులు భుజస్కంధంబు నందింత్రు నీ
బలము శ్రేయములీనమోచినవి రాష్ట్రార్థంబు యత్నించి నీ
జయముంగొంచియు మాకళించుకొనరా! ప్రఖ్యాత వీరాంధ్రుడా!

("ఖండకావ్యం" అనే సంకలనంలోనిది మూడవ సంపుటము సం. ప్ర. తేది 1956)

## ఆముఖము

ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి

శ్రీగిరి మల్లికార్జున గరిష్ఠ మహేశుడు దక్షవాటికా
భోగి విభూషణుండు నెలపూఁదలతాలుపు కాళనాథుఁడున్
మూగురు తెల్గు భూజనుల మున్నెపుఁ బ్రోవులు, భక్తవాంఛిత
త్యాగులు, భక్తియుక్తి కుసుమాంజలి నెత్తుదమోయి! వారికిన్.

రావోయీ! అధునాతనాంధ్ర కుమారా! రమ్ము ప్రాగంధ్ర భూ
శ్రీవాల్లభ్య కథాకలాప విలసద్దృశ్యమ్ము లీనేల నా
లో వీక్షింపుము కంట బాష్పజలబిందుల్ చింద నీ యాత్మలోఁ
భావుంధావులు మాకరంద ఝురులుప్పొంగన్ రసజ్ఞాంకమై

ఈ తను వెన్ని జన్మములనెత్తినదో! విశాలాంధ్ర మేదినీ
మాతృ పవిత్ర గర్భమున. మానసవీధిని వెల్లి వైభవ
శ్రీ తలవంగ మేన్నులకరించును ; మద్గళమందపూర్వ సం
గీతములుప్పతిల్లి తొనకించు సుధల్ మధురానులాపమై.

మన రాజన్యులు శైవ పాద జలజ న్మారాధనైక స్ఫురద్
మన సామ్రాజ్య మహామహీ విభవసాంద్రప్రజ్ఞులై సత్కళా
వినిబద్ధస్పృహులై, యశోలతికలుర్విన్ మల్లె పూలో యఁగా
తెనుఁగుం భూమినలంకరించిరి మహా దేవాలయౌఘమ్ములన్

ప్రథమ చళుక్య భీమనరపాలకుఁ డెత్తిన కీర్తికేతనా
స్పదమది ; పూర్వ సంస్కృతులు పావనలో నవసౌరభమ్ములన్
విదలుప మెల్లఁగా నడుగువేయుము కౌతుకమార, దక్షిణా
పథవిచరన్మహేశ్వర సువర్ణ శిఖోజ్జ్వల సౌధసీమకై.

('దక్షారామము' లోనిది నం. ప్ర తేది 1971)

# దర్శనము

ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి

అదిగో దక్షపురమ్ము! శ్రీసుశివ హర్మ్యాళింద సౌందర్య సం
పదుపన్యాసక గోపురమ్మదియె! సప్తర్షి ప్రభావక్రమా
భ్యుదితమ్మై, దురితౌఘసంతతులనుజ్జీఁపంగనౌ నాపగా
ప్రతితోద్దేశము నయ్యదే! నయనపర్వమ్మా విలోకింపుమా!

ఈ పట్టణావణ హేమ వేదికలందు
విశ్రాంతిఁ గొనిరంట విబుధు లలని
దినరాజు దివిసుంతి దిగివచ్చి శ్రీమేరుఁ
జేఁతేత నిటఁ బ్రతిష్ఠించెనంట

శ్రీమయ్య దేవుండు వేంచేయు పందువు
సురలు లేకమై చూచిరంట
విష్ణు వక్షశ్శయ్య విడివచ్చి శ్రీదేవి
కలయంపి నీ పీటఁ జిలికెనంట.

త్రిపుర దైత్యావలేప నాదీప్రియదఁవ
నగశరాసన ఠంకారనాద మదర
గోగులాంబిక తన్ను పిడ్యాలుపఁ బూని
శ్రీమనాయకుఁడిట బయల్వెడలెనంట!

అణువణువందు దైవతము లగ్రములై మోపిన పుణ్యరేఖలే
కనఁ బడునయ్య దక్షపురిఁగాలిడగన్, శితికంఠ-పర్వసే
వనమున కేఁగుదెంచు సుర వారవధూ కబరీభరంపుఁ గ్రొ
వ్విరులన్ల పరీమళమ్ము గ్రమ్ముచునున్నది తోఁచెడినోయి! నేటికిన్,

కైలాసాచలసాను సౌధనివసత్ కృద్రూనుతాకల్పుఁ డా
ప్రాలేయాచలకన్య కాగ్నిభవ హేరంబాది బృందంబుతో
లీలామానుష లోకయాత్రమెయిఁ ద్రైలింగోర్వికిన్ భీమనా
థాలోకోత్సవ మూఁదవచ్చెనఁట! దక్షారామపున్ వీథులన్.

ఈనునఁగాశివతీ తన
రోనము నింగంటి కెంపు రునరున బలిమిన్
ద్రోసిన నిలువని వేద
వ్యాసున కీ దక్షువాటి స్వాగత మనియెన్.

భారత గ్రంథ గుడివన పండితుండు.
బహుళ పావన సంహితాఖ్యానసుకృతి
వ్యాస కవిసార్వభౌముఁడీ బాటలందు
నడుగు లిడెనంట యెంత ధన్యమ్మొ పురము

మిథ్యాచారము నుజ్జగించి శివ చిన్మీమాంసలోఁబండి తా
రాధ్యప్రక్రియ నీశ్వరైక్యమును సంప్రాపించు నా పండితా
రాధ్య శ్రీగురుమౌళి జన్మమున భద్రంబై, ప్రతాపీకనం
సిద్ధ్యాప్తిన్ చిరవిశ్రుతంబగు శివక్షేత్రమ్ము వీక్షింపుమా!

సామముఁ జూడు,చో నమృత సారమటంబయి, కోవరేఖలో
భీమధనం జయ స్ఫురణ వెల్గి ప్రమత్తధరాధి నాయకో
ద్దామ గజాంకుశంబగుచు ధన్యుఁడొకండు వెలింగె నిద్దియా
వేములవాడ భీమకవి వీరయశోలతి కాలవాలమౌ

సంద్రమున కేతమెత్తు నిస్తంద్ర మతిని
భారత క్షీరనారాశి పట్టితిగిచి
తెలుఁగు పొలములఁ బోయంగఁ దలఁపనేమి!
విధివశమ్మున గంటమ్ము విడిచినాఁడు.

శ్రీమయ జాడ జూడఁపదవీనదవీయని చంద్రరేఖ య
ద్భామృత శీకరమ్ముల దయస్ కవితల్ పలియింప శబ్దశా
స్త్రామిత తేజులైర కవిరాక్షసుఁడున్ గవి వల్లటుండు, ని
ట్లీ మహి నెన్నియేని స్ఫురియించుఁ బురాకథలెంచి చూచినన్

హాలుఁడు శాతవాహన వరాంధ్రధరాధిపమౌళి, సింహళ
ద్వీపలలనాధి నాయక కుమారిని నవ్య సువర్ణగాత్రి 'లీ
లా' లలితాహ్వయన్ వలచి, లాలితసప్తముని స్రవంతికా
కూలమునన్ వివాహమయి క్రోలెనిట న్నవ జీవమాధురుల్

హాల చక్రవర్తి అమృత స్మితమ్ములు,
రాచకన్నె నీల[illegible]లోచనములు
కలసి తీయనైన కథలు కట్టిన చోటఁ
దెల్ల నల్ల కలువలల్లె నిపుడు

(దాక్షారామము లోనిది. సం. ప్ర. తేది 1971)

# కథాద్వారము

ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి

కాకతీయ విభులు కట్టిన తొలినాటి
ఆంధ్రధాని యద్ది హనుమకొండ
మనకునిల్చు నెండమావుల తళ్కులో
నేమి కందు విచట నెంత వెదకి?

చతురులు కాకతీశ్వరు లేన్గుటంబార్ల
ఈ ద్వారములు త్రొక్కి యేగినారు।
తెలుగుం బతాకకాంతులు బిమ్మిరాజువల్
పోయె నీ దారినే పుడమియద్రువ।
ఉక్కు తున్కలు తెగ్గుయోధుల జయగాథ
లీ తోరణల పె లింప బడియె
సరన కాకతి నృపాద ంకై పళ్కువుల్
అరిగి రీనెన ము ప్రటా శుకొనుచు।

బాలవృద్ధులతో గూడ పె నులెన్న
ముఖర వాద్యరవమ్ములు రు కొనగ
ఈ పురాధ్యమ్ము గోసతో కొపుంది
కదగి పద్మమ్మ పూజకై నడచినారు.

ఒక వేయేండ్లకు పూర్వగాథయది । నా యూహాపథంబందు పొం
దికగా — ఉత్రవటాంత చిత్ర సమరీతిన్ దృశ్యకావ్యమ్ము లీ
విక గైకొన్న విధంబుగా కనులలో వేలున్; పురాంధ్రావనీ
ప్రకటోదంత మనోభిరామము కవీంద్రానంద నారామమున్.

మున్నూఱేండ్లు తెనుంగు కత్తి కెదిరింపుల్ లేని సామ్రాజ్య రూ
పౌన్నత్యంబున భద్రపీఠమున యందాసీనులై కీర్తి సం
పన్నానేక చరిత్ర సౌరభ పరివ్యాప్తాఖిలాశాంతులై
యున్నారలై చలమర్తి గండ నృపులై మన్నారలాంధ్రేశులై

అతడు కాకర్త్య గుండ్యన నామధేయుండు
ఎఱిగినంతకు మూలపురుషుడతడు
అతని కులకలశాబ్ధికి చంద్రులై
ప్రభవించినారట రాజగుణులు
కొందఱు; వారిలో గుణగణనీయుండు
తొలి బేతరాజు వీరులకు తేజు
ఏలెను 'నఱిసాయిరమును' కొఱవి దే
శమ్మును బహు బాహుశాలియతడు

మొదటి ప్రోలయ యాతని పుత్రవరుడు
పేర్మి పశ్చిమ చాళుక్య విభుని సోము
దనిపి ప్రజ్ఞా ప్రకర్షల ననుమకొండ
రాజ్యముం గొన్న భువనైకరాయ దతడు.

("కీర్తితోరణము" లోనిది. నం. ప్ర. తేది 1978)

# తెలుగు మినుకులు

గుత్తివల్లి సత్యనారాయణరాజు

కనుము కనుము రసాల పల్లవ
కలితతోరణ మింటికొక్కటి
వినుము వినుమదె తెనుగు గానముల
విజయనాదము పూర్వదిక్తటి

తెనుగు జనములు తెనుగు మనములు
తెనుగు వనములు తెనుగు వనములు
తెనుగు వనములు గాన బుధనములు

లలిత లలిత చళుక్య చంచ
ల్లాంచనములు స్ఫురించె నదుగో
పిలుపు పిలుపున కాకతీయో
జ్జ్వల చరిత్ర ధ్వనించె నదుగో

పలుకు పలుకున రెడ్డి నాయక
కలతవమ్ముల కలరవమ్ములు
మలపు మలపున విజయనగర స
కల కలా కిలికించితమ్ములు

మేలు మే లమరావతీ శి
ల్పాల పాల సరస్సు లూరెను
జాలు జాలుగ నోరుగల్లురి
రాల మధుర పయస్సు నిండెను
లీల లీలల పానుగంటి శ
లాలయాల తపస్సు పండెను

తర తరాల తెనుంగు శిరముల
సిరులు వేణి పరీమళించెను
ఇరుగు పొరుగుల బొరలి స్నేహపు
ఝరుల 'తుంగ' తరంగలించెను

తరళ తరళ రసాల గోదా
వరి వరాల్మొలిపించె నురళిగ
పరుగు పరుగున 'పెన్న' సింగులు
బిఱచి విరులను బంచె విరివిగ

పూవుపూవునఁ గ్రొత్త తేనియ
పొంగి పొంగి స్రవించె దేనికి ?
తీవతీవకు తెనుగు తీపిని
దెచ్చిముచ్చట బెంచుటానికి

తావితావికి దివ్యమరు దుప
ధాన మాననమేల గలిగెను ?
జీవి జీవికి యాంధ్ర జగదుప
జీవ భావసుమాలు మొలిచెను

('నిర్మాణగానము' అనే సంకలనం లోనిది నం.ప్ర. తేది. 1946)

# వైభవము

కొండూరు వీరరాఘవాచార్యులు

తన బౌద్ధగురుని మతవ్రత దీక్షగా
 సింహళంబున స్తూప చిహ్నముంచి
తన సర్వశిల్ప విద్యానిదర్శనముగా
 "దావంగు" విశ్వవిద్యాలయమిడి
తన యహింసకు మేలి తార్కాణగాఁ బ్రాణి
 వితతికిఁ గారుణ్య భిక్షపెట్టి
తన కళారాధన కొసలేని ఫలముగా
 జగమెన్ను స్తూపరాజంబుగట్టి

తనదు బౌద్ధధర్మ తత్పరతకును దృ
ష్టాంతములుగ మేల్విహారములను
నెక్కు వెలయఁజేసి పేరుగన్న దమరా
వతి మహోజ్జ్వలాంధ్ర పత్తనంబు.

ఆ కృష్ణాతటినీ తరంగముల నొయ్యారంబుగా నాడు మా
నౌకాశ్రేణులు తెల్గు వర్తకుల విన్నాణంబు సూచించెడిన్
నైకాశ్చర్య మనోజ్ఞ వస్తుయుత నానా కర్మశాలావళుల్
మా కర్మారుల హస్తనైపుణిని దార్కాణించు వేరీతులన్.

ఈ తెలుగుం బొలాల వెలియించిన సంస్కృతిస నవ్య సంపదల్
భూతలమెల్ల నిండినవిపో, మన భారత ధర్మకేతన
స్ఫీతరుచుల్ ప్రజాహృదయనిర్మల నాంధ్యముచిమ్మి కాంతి వి
ద్యోతిల నేలనేలిన మహోజ్జ్వల చిహ్నములున్న వెన్నియో.

సింహళ ద్వీపప్రసిద్ధ శిల్పంబులో
     నమరావతీరీతి హత్తుకొనియె
చీనా జపాను విజ్ఞాన కాంతులలోన
     తెలుఁగు తళ త్తళల్ తేజరిల్లు
జావా సుమిత్రాది దీవులలో మన
     తోలుబొమ్మల వినోదాలు చెలఁగు
కాంబోడియా ప్రముఖమ్ముల హైందవ
     మత సంస్కృతులు సువిస్తృతములయ్యె

చెంగటగనున్న దీవులఁజెప్పనేలఁ
'అమెరికా' యందె మన శిల్ప మడుగువెట్టె;
అనియాజ్యోతి వెల్గి లోకాద్భుతముగ
మర్త్యజగమున చీఁకటి మాంద్యమణఁచె

దక్షిణా పథమునకుఁ బ్రధాన బౌద్ధ
పీఠ మీ యమరావతి విస్తరించె
నవని నెల్లెడ బౌద్ధవిహారములను
నద్భుతములగు శిల్పవిద్యాలయముల

సింహళద్వీపమున మున్ను సృష్టిచేయు
స్తూపసందర్భమునకు భిక్షువ్రజంబు
నాల్గు లక్షల "పైచిల్కు" నడచినార
లాంధ్రదేశమునుండి నాఁ డబ్బురముగ.

తెలుఁగు వారపుడా మహాదేవ భిక్షు
నాధిపత్యముతో ననూరాధపురము
వాడ వాడలఁ "గిటకిటలాడ" జూచి
పొరుగుదేశములెంత మచ్చరము గొనెనొ.

అప్పుడు వీరి మూలమున నాంధ్రుల నాగరికత్వ సంపదల్
కుప్పలుగాఁగ సింహళములో దిగెనందురు; తెల్గు శిల్పపుం
జొప్పులె కానుపించునట స్తూపమునందున బుద్ధమూర్తిలో
జెప్పెడి దేమి తెల్గువస చేరెనురా! చిఱుదీవు లందునన్.

["అమరావతి" అనే ఖండకావ్యలోనిది. సం. ప్ర. తేది 1950]

## శాలివాహనుడు

కొండూరు వీరరాఘవాచార్యులు

ఇచ్చట శాలివాహన కవీంద్రుడు ప్రాకృత భాషలో కవుల్
మెచ్చెడు తీయ తీయనగు మేలిమి గాథల నేడునూర్లు వా
క్రుచ్చి సరస్వతీ రుచిరరూపము తీరిచిదిద్దెనంట ; యా
సచ్చరితాగ్ర గణ్యనుతి సల్పరె యాంధ్రులు నేటికేనియున్

ఆంధ్రుల సేవగా రసమహత్తరమంజుల కావ్యగాథ తీ
యాంధ్రనృపుండు కూర్చుకొని ప్రాకృతవాణి మనోజ్ఞభావ నీ
రంధ్రనొనర్చి పర్చెనిది రమ్య యశోనవచంద్రకాంతిలో
నాంధ్రము ముంచి యెత్తె బళిరా! పులకింపదె మేను సోదరా!

["అమరావతి" అనే ఖండకావ్యంలోనిది. సం. ప్ర. తేది 1950]

## నాగార్జునుడు

కొండూరు వీరరాఘవాచార్యులు

అతఁడు నాగార్జునాచార్యుఁ డతులశక్తి
సిద్ధులనుగాంచి యోగ విశిష్టుఁడగుచు
అరయ నాగార్జునాభిఖ్య నలరు మేటి
గద మహాయాన బౌద్ధశాఖాప్రణేత।

ఈ నాగార్జున భారతీయముని యే యేసత్కృతుల్ వ్రాసి వి
జ్ఞానంబుల్ వెదచల్లె లోకమున నా సద్గ్రంధముల్ శ్రీహరీ,
యే నాఁడో చనె నగ్ని సాత్కృతముగా నివ్వేళ నవ్వానినే
చైనాయం దొటిబెత్తునం దొకని హర్షంబందరే హైందవుల్.

['అమరావతి' అనే ఖండికావ్యం లోనిది. వం. ప్ర. తేది 1950]

## ఆంధ్ర విశ్వవిద్యాలయము

కొండూరు వీరరాఘవాచార్యులు

అదిగో! పూర్వాంధ్ర విశ్వవిద్యాలయమ్ము
శారదాదేవి రమ్య విహారశాల
కళల కణాచి, చదువులఁగన్నతల్లి;
అరయుమొక వరిస్మృతి నేత్రమట్టివిప్పి.

అల 'టిబెట్టు' న నిర్మితమై తనర్పు
నట్టి "దాపంగు" విశ్వవిద్యాలయంబు
దీని నాదర్శముగఁగొని తీర్చిరంచె
యాంధ్రుల గురుత్వమునకు చిహ్నంబుగాఁగ,

ఎనిమిది వేల శిష్యులిట నెప్పుడుఁ బాయక శాస్త్రముల్ కళల్
మననమొనర్తురం టె; మతిమంతులు గీష్పతులట్టి దేశికా
గ్రణులు శతాధికంబుగ నిరంతర చర్చలఁబు చ్చువారఁటే!
ఘనులగు శిల్పులుఁగా గవులు క్రమకళార్చన సేయుచుందు్రం.

(దాక్షారామము లోనిది. సం. ప్ర. తేది 1971)

# స్తూపశ్రీ

కొండూరు వీరరాఘవాచార్యులు

మూడు వందల యేడు లమోఘతపము
చేసి సృష్టించి రీ స్తూప శిల్పకృతుల
సిద్ధహస్తులు మన తెల్గు శిల్పవరులు
తమకళా శక్తులన్నియు ధారవోసి.

చైత్యక సంప్రదాయ మిట స్థాపితమైన కతమ్మునన్మహా
చైత్య మటంచు నీ యది ప్రశస్తి వహించి మహేంద్ర పాంషిక
స్తుత్యపవిత్ర పీఠములు సొంపులసలారిన దా ధరాధిపా
దిత్యుల పాలనంబున నతి ప్రతిభాకృత శిల్పకావ్యమై.

అద్ది కారుణ్యమూర్తి బుద్ధాంఘ్రి దివ్య
పూజకెత్తిన రత్ననీరాజనమ్ము!
అది జగద్భ్రాంతిదూత బివ్యాపకారు
వర్ణనము సేయు శిల్ప పుష్పాంజలి పుటి!

ఈ చలువరాల బండాల నెన్ని రసము
లూరినవి, యెన్ని కథలు రూపొందినవి, మ
రెన్ని జగములు కళల సృష్టించవ, బడిన
వహహ! యీ యాకృతీశ్వరులంటు కతన

ఏ యమృత క్షణమ్ముల సృజించిరొ శిల్పకులీను లీ జగ
ద్గేయములైన శిల్పములఁ; దెల్గుకళాప్రతిభల్ చరిత్రలో
మాయనికీర్తి వెల్గినవి మంజుతరాంధ్ర విశిష్టశైలికిన్
మా యమరావతీ కళకు మంగళగీతముపాడె లోకముల్.

సృష్టించి రిట శాక్య సింహస్వరూపంబు
    కరుణారసము పొంగి కాల్వగట్ట
కల్పించి రిట బుద్ధ జీవిత చరితముల్
    శిలసంస్కారముల్ చిగురువెట్ట
చెక్కినా రిచట విచిత్ర జంతువులను
    స్వాంతముప్పొంగి హర్షమునఁదేల

సృజన యొనరించి రిచట నచ్చెఱువు గదుర
నాంధ్ర సంస్కృతినంత మహత్తరముగ
తెలిమెఱుంగుల నెలఱాల ఫలకములను
భువనములు మెచ్చఁ దమ కళాద్భుత చరిత్ర.

"సూచీ శిల్పము" లందుఁ జెక్కిరి జనస్తుత్యంబులౌ నేన్గులన్
బ్రాచీనాంధ్ర జనావళి వైఖరులఁ దెల్పంజాలు మేల్మూర్తులన్
వాచాతీత మనోజ్ఞపద్మముల శుంభద్దివ్య శిల్పైక వి
ద్యాచాతుర్యము ఖండఖండముల జోహార్లంది వెల్గొందఁగన్.

('అమరావతి' అనే ఖండకావ్యంలోనిది. సం.ప్ర. తేది 1950)

# ఆంధ్రప్రతిభ

గురజాడ రాఘవశర్మ

ఆంధ్రుల కేమి యీ యరవలకేమి చ
    క్కని యొరవడియె, త్యాగయ్యగీతి
పండితులకు నేమి—పామరులకు నేమి
    వెన్నబెట్టినది పోతన్న పలుకు

చిన్న వారలకేమి పెద్దలకేమి తా
    పాల ద్రావినది గోపన్న భక్తి
వీరులకేమి తాభీరులకేమి, ర
    క్తమయమ్ము ఖడ్గ తిక్కన్న పోటు

అలమున గృహమందు నిత్యము జపించు
మంత్రరాజమ్ము. మేటి తిమ్మరుసు యుక్తి
జన్మతోగల్గినట్టి, మా స్వాంతధనము
లాంధ్రమాతా! నమస్కారమమ్మనీకు!

అవలింపఁగ బ్రేవులవలీల నమలు గం
    ధర గండడైన 'పట్టాభి'చురుకు
కుప్పించి యెగసి ఢీకొను సింహరాజమ్ము
    సమరదుందుభి 'ప్రకాశమ్ము'ములుకు

అడిగిన యంత సర్వార్పణ జేసెడి
    త్యాగియౌ 'వేంకటప్పయ్య' పలుకు
గిరిగీచి వైరులనరికట్టి నిల్పు వీ
    రాధి వీరుడు "వరహాగిరి"చఱుకు

సౌఖ్యమెఱుగక స్వీయదేశంపు సేవ
మునుగు రాజర్షియౌ, సాంబమూర్తి తఱుకు
భాగ్యమై వెలయ నీకు లోపమ్ముగలదె ?
యాంధ్రమాతా! నమస్కారమమ్మ నీకు.

('స్వాతంత్ర్యపథం' లోనిది. నం.ప్ర. తేది 1978)

## తెలుగుతోట

కందుకూరి వీరభద్రరావు

ఎంత చక్కనిదోయి! ఈ తెలుగు తోట
ఎంత పరిమళమోయి! ఈ తోట పూలు

ఏ నందనము నుండి
యీ నారు తెచ్చిరో!
ఏ స్వర్ణదీ జలము
లీ మడుల కెత్తిరో!

జంత వింతల జాతు లీ తోటలో పెరుగు
ఈ తోట యేపులో నింత నవకము విరియు!

ఏ యమృత హస్తాల
ఏ సుతలు సాకిరో
ఏ యచ్చరలమురువు
లీ తీరు దిద్దెనో!

ఈ పూల పాలలో నింత తీయందనము!
ఈ లతల పోకళ్ళ కింత ఒయ్యారమ్ము!

ఏ మహత్తర శక్తు
లీ తోటలో గలవొ।
ఏ దివ్య తేజమున
కీ పూలలో నెలవొ

ఈ తోటపై గాలి యింతమెయి సోకెనా।
ఈ నీరనిలు బ్రదుకె యింత చిగురింపనా।

జవరాలి వలపు వలె
రవి బింబ దీప్తివలె
హిమనగోన్నతి వోలె
ఋషివాక్కు మహిమవలె

నా యెదందను రేపు నా తెలుగు తోటలో
పాడుకొన నిందోయి। పలవింపనిందోయి।

('తెలుగుతల్లి' అనే సంకలనంలోనిది సం.ప్ర. తేది 1975)

## శ్రీపర్వము

ఎక్కిరాల కృష్ణమాచార్యులు

పిడుగునిప్పులు రాల భీమస్మ దక్షుఁడై
యపరసంధ్యానాట్య మాచరింప
చటులదంష్ట్రికోటి చంద్రరేఖను దెగ్గు
భువియెత్త హర్యక్షభూధ్ర మోణి
భద్రపీఠికపైన భద్రాద్రిరామయ్య
తెనుగుసీమను బ్రోచి తెచ్చి నిలుప

విజయవాటిదుర్గ విజయోత్సవమ్ములోఁ
　　జటులసింహము రేగినటుల విద్రుప
ఏడుకొండలరేడె యిలవేల్పు తానౌచు
　　పాయకుండెద నని బాసనౌనఁగఁ

గౌరి ముక్కోటి దేవతల్ కొలువుదీర్చి
దివ్యమందార దృష్టి చిందించుకొంద్రు
కార్మకాశ్లిష్టలగ్న దృక్కాంతులందు
నాంధ్ర గురుశక్తి శుభవాక్కు లందఁజేయ.

('తెలుగుతల్లి' అనే సంకలనంలోనిది. సం ప్ర. తేది 1975)

## భువనవిజయము

మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి

నాడు రాయల పరిపాలనమ్ము నాఁడు
'భువన విజయ' మహాసభా భవన మలరెఁ
బరికృత నిబంధ రసభావ బంధు రాంధ్ర
సుకవితేందుముఖీ పాణిముకుర మనఁగ.

సాతవాహన ధరానేతృ ప్రవర్తిత
　　సరస సాహిత్య సంసన్మహస్సు
రాజ రాజ నరేంద్ర రమ్యావసథ విద్వ
　　దమృతాయమాన సభాంతరమ్ము
కాకతీయావనీకాంత మహాస్థాన
　　హర్మ్యాగ్ర రచిత విద్యాసదస్సు
రెడ్డి భూమీపతి ప్రీణిత సుకవి రాట్
　　'త్రైలోక్య విజయ' సౌధతల గోష్ఠి

స్వస్వ రుచిరాంశముల సమర్పణ మొనర్చ
సొంపు గడియించి చతురస్రశోభఁ గాంచి
భావరసపుష్టమై కృష్ణదేవరాయ
నృపతి కొలువు మహాంధ్ర చరిత్ర నేలె.

('తెలుగుతల్లి' అనే సంకలనంలోనిది. సం.ప్ర. తేది 1975)

## తెలుఁగు వెలుఁగులు

కరుణశ్రీ

నాగార్జునాద్రి నున్నని పాలరాలపై
శ్రీలు చిందించె మా శిల్పబాల
విద్యానగర మంజులోద్యాన వీథుల
నవ్యతల్ నెరపె మా కావ్యకన్య
త్యాగరాయల ప్రేమరాగడోలికలలో
కన్నుగామూగె మా గానలక్ష్మి
ఏకశిలాపురి ప్రాకార శిఖరాల
విహరించె మా వీరవిజయరాజ్ఞి

దిక్కుదిక్కుల కీర్తి చంద్రికలు నింపి
వెలుఁగులు వెలార్చుకొనియె మా తెలుగుతల్లి
నా పురావైభవానంద నందనమున
నవ్వుకొన్న వినవ వసంతమ్ము లెన్నొ ॥

('ఉదయశ్రీ' అనే సంపుటిలోనిది. సం.ప్ర. తేది 19'9)

# గోల్కొండ

సురగాలి తిమోతి జ్ఞానానందకవి

ఈయశః కిరీట మెవరమ్మ! తెలుఁగమ్మ!
నీ శిరమ్ముపై నిలిపినారు
అతికి పోవనాటి కుతుబుషా సుల్తాను
లాత్మలన్ని యొక్క యాత్మ కాఁగ

తెలుగున్ గొల్లలుగాఁ జరిత్రములు నందీపించి విశ్వాంతరా
స్థలమున్ గీరితి నాచికొన్నయది నీ సామ్రాజ్య ఖానూదయో
జ్జ్వలరేఖారు చిరాంశువుల్ కుతుబుషా సమ్రాట్టు లౌదార్యపున్
జలువన్ గల్గినవంచు, జూచెదిని దత్ప్రైతిల్య దివ్యాకృతుల్.

అది షానషీను సింహాసనాస్థానమ్ము
సుల్తానులెల్లఁ గూర్చుండుచోటు
అది శిలాహిఖాస అరుల గుండెలు చీల్చ
కఱకుఁ గత్తుల సాముఁ గఱచు తలము
అది భక్తుడైన రామయ్యకుందిన యట్టి
చీకటి నజరుబందీ కొటారు
అది కళాపోషకుండైనట్టి యిబ్రహీమ్
కుతుబుషా కట్టిన గొప్ప గోరి

అది మనీషులైన యక్కన్న మాదన్న
తెలుగు జాతి దివ్య దీప్త శక్తు
లున్న నిలయమిపుడు గన్నఁ గన్పట్టదు
నాటి గోలకొండ మేటి మహిమ

ఏమి దీవన లిచ్చెనో రామదాసు
రెండు వందల యేండ్లయిన నిందలేదు
గోలకొండ నవాబుల శ్రీ లతాంగి
తళుకు మెఱపించు రంపాలతా విధాన

యోగ్యమొ? కానిచో నది యయోగ్యమొ? ఈ విపులాంధ్ర పూర్వపున్
భాగ్యమొ? మూడు కాలముల పాటు ప్రపంచ చరిత్రలోన ఈ
భాగ్యమతీ సఖీ ప్రణయ భావుకుఁడౌ సుల్తాను వల్ల నీ
భాగ్యపురమ్ము నిల్చుట శుభస్థితిఁ దాల్చుట తోషణంబగున్.

ఏ శిల్పి మలచినాఁడీ ఖండ జాతిని
వేద్యమై దేవతావిగ్రహమ్ము
ఏ మనీషి సృజించె నీ దివ్యతరమౌ మ
హోజ్జ్వలంబైన పేరోలగమ్ము
ఏ సిపాయి యెదిర్చె నీ ఫిరంగుల తోడ
వచ్చి శత్రులకు దుర్బుద్ధిఁ గొట్టి
ఏ వాస్తు శాస్త్రజ్ఞుఁ డీ మట్టి గొట్టాలఁ
బ్రవహింపఁగాఁ జేసె స్వచ్ఛగంగ

ఇచటి శబ్దయంత్ర మెవ్వాని ధిషణాశ
ఖణకు బిరుదు లిచ్చు పనితనమ్ము
ఢీలు పడియెఁ గుతుబుషాల యుచ్చస్థితి
బెల్లుబికిన నాటి గొల్లకొండ

గొల్లలు మేటులై పసుల కోసుల నీ పెనుజాతి గుట్టపై
దొల్లిఁట మేపిరంద్రిపటఁ డోరపు సంపద రాశి దోఁగ రా
జిల్లెదు రాజకీయమున సిద్ధి వహించి కులీకుతుబ్బుషా
యుల్లము పల్లవింపనిటులున్నది జెండెను గొల్లకొండగా.

కుట్మలించిన దిట కుతుబుషా కృపచేత
మధురమౌ నాంధ్ర వాఙ్మయపుఁదీవ
అమ్మబడ్డవి యిట అత్యమూల్యములైన
వజ్రాలరాశి విపణులయందు
బులిపించుకొనెనిట మొగలాయి పాదుషా
రత్నరాసుల సమర్పణము కొఱకు
నిలువఁబడ్డది యిట తుల లేని మత సహి
ష్ణుత మన్న దేవతానూనశక్తి

పొంగి పొరలి మిన్ను ముట్టఁగాఁ బాటెడు
ప్రహదము జలము శూన్యమైన యపుడు
నొడ్డుమీద దొరకు నుజ్జ్వల మణి గణ
మన్న గాథ లిపుడు సున్నలయ్యె.

అన్నకు వెన్ను సూపి పిత యంతముఁ గన్నులఁ గాంచి జీవితం
బున్న నెదో భుజించి మను టొప్పని మల్కిభరాము రామ రా
జన్నెఱజోదు నాంధ్రుల యశో విభవమ్ముల నేలు వాని మేల్
కన్నుల నన్నలన్ మెలగు గాథలు విన్న మనస్సు పొంగెడిన్.

గోల్కొండ కుతుబుషాలకు
మల్కిభరామయు నతని కుమారుడు హాయిన్
జిల్కిరి కవితా వాణికి
మేల్కట్టుగ భూరి ధనమమేయము దమ్మున్.

ఈ గోల్కొండ చరిత్రతో నిలచి పోయెన్ భిన్న సంసారవున్
భోగ శ్రీలిన చంద్ర తారకముగాఁ బూర్ణేందు బింబాస్యమా
బాగెమ్మన్ దెలుఁగింటి బిడ్డను కుతుబ్షా వేడ్కఁ బెండ్లాడి యెం
తోగారాబముఁ [illegible]కొంథదరి సంతోషించుటల్ చిత్రమా.

అతని సాహసమ్ము పితయైన కుతుబుషా
మెచ్చుకొనుచుఁ దెలుఁగు మచ్చెకంటి
భాగ్యమతి నొనంగి పరిణయం బొనరించి
దాచెఁ గుతుబుషాల సహృదయతను.

నిరతము రక్తపున్ ఝురులు నించిన నీ గృహమందు నేఁడునుం
దరి యగు తెల్గుదాన చరణమ్ములు మెట్టిన యంతనే యెదో
మెఱసెఁ దళుక్కు మంచుఁగడు మిక్కుట మైనులతానునాత్మలో
బరువిడె నొక్క యూహ తన పట్టపురాణి భవిష్యదర్థమై.

గాదిలియింతిపైఁ గలుగు గాటపుఁ బ్రేమకుఁ దారకాణగా
ఈ దయితుండు సర్వజగ మెల్ల ప్రశంసలఁ గొల్లఁగొట్ట మూ
సీదరిఁ గ్రొత్త పత్తనము సృష్టి యొనర్పఁగ జేయ దానికై
శ్రీ దయివాణ భర్చొనరిచెన్ బ్రియ పేరిట నాత్మ తృప్తికై.

మూసీతీరముఁ జేరినారఖిల శిల్పుల్ వాస్తు శాస్త్రజ్ఞులున్.
దీనంపన్నులుఁ బండితోత్తములు జ్యోతిశ్శాస్త్ర పాండిత్యవి
ద్యాసారజ్ఞులు వంది మాగధులు సుల్తాన్ కల్పభూజా శ్రయో
ర్చానుల్ మంత్రులు దండనాధిపులు నంతన్ మ్రోఁగె ఘంటాధ్వనుల్.

సులతానాగ్రణి పట్టరాని ముదమున్ సూచింపఁగా భూరి మం
గళ తూర్యధ్వను లీన సాగినవి చొక్కంబైన యత్నాన శో
భిలె నూత్నాకృతిఁ దాల్చు, సౌధములు ప్రవేశ్యైన్దిగ్గిగంతమ్ము లాం
ధ్రుల గోల్కొండ నవాబు లబ్బురపు బంధుత్వంపు చారిత్రముల్.

తన ప్రణయైకమూర్తిని నిల్పఁగాబోలు
భాహిరించెను దొడ్డ భాగ్యనగరి
తన కళాసాహిత్యమును చాటఁగాబోలు
రచియించె నుత్తమ గ్రంథమొండు

తన పురోగమున పద్ధతిఁ దెల్పఁగాఁబోలు
    కట్టించె చార్‌కమాన్ కట్టడమ్ము
తన భక్తి తాత్పర్యమును జెప్పఁగాఁబోలు
    మమతఁగట్టించె జుమ్మామసీదు

చారుమినారు గోపుర ద్వారములగు
కట్టడమ్ములు ఘన కళాఖండములను
గొనలు మీఱ మహమ్మదు కుతుబుషాహి
స్థాపనము జేసెఁ దనపేరు జగతివెలుఁగ.

ప్రణయిని పై ననురాగపు
ననలు మొనయఁజేయ నూతన నగరమును సృ
ష్టిని గావించి నిజ సఖీ
ప్రణయాంకితముగ నిలపెను భాగ్యనగరమున్.

ప్రణయ సామ్రాట్టు కుతుబుషాపాదుషాహి
భాగ్యమతి పేరఁ గట్టిన భాగ్యనగరి
తెలుఁగు సౌరభ్యవీచికల్ పొలుపుఁగాంచి
రత్నరాజిధగద్ధగల్ రాశియయ్యెఁ.

('గోల్కొండ' అనే సంపుటంలోనిది. సం.ప్ర. తేది 1978)

## ఆంధ్రప్రశస్తి

తిమోతి జ్ఞానానందకవి

ఒకనాడు శాత్రవనికర గర్వముఁ జీల్చి
      ఢింద్రించె దెసలు మా తెనుఁగుకత్తి
ఒకనాడు దివ్యరాజ్య కవాటములు విప్పి
      తేనెలొల్కించె మా తెనుఁగువాణి
ఒకనాడు పెరభూములకు సోయగము దిద్ది
      మనతఁగాంచినది మా తెనుగులక్ష్మి
ఒకనాడు ప్రకటశౌర్యైకశౌజ్జ్వలతఁ జాటి
      ప్రణతులందినది మా తెనుగుశక్తి

ఒక్కనాడుర్వి నత్కళాభ్యుదయమంద
నాణెమగు వేద మధుర భాండములనించి
గౌనబుదేశాలఁ బంచిన తెలుగుతల్లి
శారతుల నీయరండు రండాంధ్రులార!

శబ్దశాసనుని భాషా జీవరసధుని
      జలబిందువులయందు జలకమాడి
ఉభయవాఙ్మయ ప్రవీణోద్దండుహోమకుం
      డాన దీక్షము పొందనముఁవైచి
ప్రౌఢసాహిత్య సామ్రాజ్య ధూర్వహాని యొ
      య్యారంపు రచనకు నంజలించి
నహజ నత్కవితా విశారదు శక్తిమో
      హన భావపంక్తికి తనువు మఱచి

జిగిబిగిన వ్రాయు సుకవి విశేష రచన
యసదృశంబగునని దాని వసనెఱింగి
దేశదేశాల్ సవాల్ జేయు తెనుగు తల్లి
కంజలి ఘటింప రండు రండాంధ్రులార!

కాకతీయుల వీర గాథాప్రబంధ శౌ
ర్యాంకితంబైన ప్రఖ్యాతి పడిమ
కృష్ణభూపుని కళారేఖాముఖ స్ఫూర్తి
బెరగు హొట్నూరు దిగ్విజయ ఘోష
రఘునాథ భూజాని ప్రజ్ఞా విశేషంబు
వినుచు తంజాపుర తెనుగు ప్రతిభ
పాపరాయని వినిర్వ్యక విక్రమపుష్టి
గణియించు తత్కథాగౌరవమ్ము.

వీరరుద్రాంబికా లసదీరచరిత
ఖడ్గతిక్కన్న పౌరుషకాయబలము
తెలుగు దాసరి పాటలో పలుకరించు
నా మహాశక్తి కిదుము జోహారులాంధ్ర!

పాషాణములకు జీవముఁబోసి చివురించి
చేవనందినది మా శిల్పరచన
స్వర్గంపు రససిద్ధి సరిగాదు నాకంచు
పలికిపోయినది మా తెలుగు కవిత
కమనీయ చిత్రాలు ఘంటికా ముఖమున
వెలువరించినది మా తెలుగు కుంచె
కటికిరాళ్ళనునైన గఱగించి గాంధర్వ
మున బేరువడసె మా తెనుగు గీతి

ఖండఖండాతరముల నఖండకీర్తి
తేజరిల్లి వర్ధిల్లె మా తెలుగుతల్లి
అదె కనంబడు స్తూపాలయందు నెక్కు
పరమ భాగ్యమ్ము పూర్వాంధ్ర వైభవమ్ము.

వెలయింపవలె నాంధ్రి విమల గాంధర్వవి
ద్యా వైభవైక విన్యాసదీప్తి
దాటింపవలె నాంధ్రి సాహిత్యసంపద
నఖిల భూవలయమ్మునవఘళింప
కొండాడవలె నాంధ్రి నిండారు శిల్ప క
ళా ఖండములు సముల్లాసమంద
మెఱయింపవలె నాంధ్రి మేల్మి చిత్తరువులు
పెడ దేశములవారు పెదవి గఱువ

మిన్నుముట్టగవలె కళోన్మేషమూర్ధ్ని
భావశబలతా భావ విభానమాన
సంపదౌన్నత్యమపుడు విస్తరితమయిన
తెలుగుసీమ యుప్పొంగి సత్కళ భజించు.

('విజయాభిషేకం'లోనిది. సం. ప్ర. తేది 1966)

## మాతల్లి

అనుముల కృష్ణమూర్తి

నీ వొక జీవజ్జ్యోతిని జనించినవాడవు-విస్మరించ కీ
భావము ! నీచరిత్ర బహుపౌరుష గాథ-స్మరించుకొమ్ము ని
ర్జీవములైన జాతులు నశింపక తప్పదు, మేలుకొమ్ము! నీ
వే విజయధ్వజ మ్మెగురవేసెడివాడవు-లేచి రమ్మురా !

పరిణతమైన సాంస్కృతిక భారతమందు కళాపురోగతుల్
జరిగెడివేళ మ తెనుగు చక్కదనాల ఒయారిజాణ ని
బ్బరపు నడల్ గతమ్మునకు భావికి వన్నెలు దిద్దగావలెన్
గురుతర కార్య భారమున గ్రుంగెడి తల్లి కెదింగినట్టి కూ
తురువలె, చేతకౌ పనుల తోడ్పడి మక్కువ నందగావలెన్.

('తెలుగుతల్లి' అనే సంకలనంలోనిది. సం.ప్ర. తేది 19 8)

# నా పాట

జె. బాపురెడ్డి

నా తెలుగు వెలుగు వీణలు మీటి పాడెద
నా తెలుగు జాతి ఉన్నతి గీతి పాడెద.

వాడ వాడల చెలిమి
మేడలను కట్టి
తెలుగు తల్లికి భావ
దీపాలు పెట్టి ॥నా తెలుగు॥

నిన్న మొన్నటి స్మృతులు
నేటి అనుభూతులు
రేపటి మసక కలలు
నే పాటలుగ అల్లి ॥నా తెలుగు॥

ఆనందముల తేలి
ఆవేదనల సోలి
ప్రణయగీతులు కొన్ని
ప్రగతి పాటలు కొన్ని ॥నా తెలుగు॥

లోకాన చైతన్య
రేఖలే కురియగా
శైశిరము లేని వా
సంతాలు విరియగా ॥నా తెలుగు॥

('తెలుగుతల్లి' అనే సంకలనంలోనిది. సం.ప్ర. తేది 1975)

# తెలుగు సంస్కృతి

ధారా రామనాథశాస్త్రి

వెలుగు జిలుగుల తెలుగు చరితము
వేయిరేకుల తెల్ల తామర
రేకురేకున పేరుకొన్నది తేనె
పెరల వలెన్.

తెలుగు చరితపు వెలుగు జిలుగులు
వెలికితీయగ వేయిపడగల
గాలిమేవరిచేత గాదని
గర్వపడుచుందున్.

ఆంధ్ర శబర పులింద మూతిబు
లందులై ఋషివస్యానతి
అహంకృతి నెదిరించినారని
అబ్రపడుచుందున్.

శౌర్య ధైర్య స్థైర్య గాంభీ
ర్యమ్ము లౌదార్యమ్ము నందున
రంగరించిన బ్రహ్మక్షాత్రపు
రాజ ఆంధ్రులదే.

శాతవాహన చక్రవర్తులు
చళుక్యాన్వయశక్రమూర్తులు
కాకతీయులు రెడ్డు విద్యా
నగర సామ్రాట్టుల్.

కలిసి కట్టిన మేడనున్నవి
కళలు విరిసిన పసిడి జాడలు
భువన మోహన దివ్య భావా
కృతుల క్రీనీడల్.

పలుకు పలుకున తేనె లొలికెడు
కండ చక్కెర తెలుగు కావ్యము
రాగ తాళలయాశ్రయమ్మగు రక్తి
తెలుగుల రమ్యగానము.

దివ్యమౌ శిల్పము ఆంధ్రా
నల్ప కల్పన గళకు సేవధి
సహజ సౌందర్యార్థ భావన
ఆంధ్ర చిత్ర కళార్ద్రి భూమిక.

ఖండ ఖండాంతరము లందున
అందుకొనె జేజేలు నాట్యము
సార్వకాలిక సత్కళాకృషి మా
సంస్కృతిని జీవత్తరంగము.

దాపకూడుల బ్రహ్మనాయుడు
క్షాత్ర శాంభవి రాణిరుద్రమ
పూత చరితలు విన్నవేళల
మిన్నువాకగ పొంగిపోవుదు.

కులము బలముల క్రుమ్ములాటలు
రాజకీయపు రట్టు గుట్టలు
విన్న వేళల తలను వాలిచి
మిన్ను లోతుల క్రుంగిపోవుదు.

మనసు వెన్నగ మాట తిన్నగ
మనలుకొను మా తెలుగువారికి
మనసు విఱిగినవేళ మమతలు
కలతలగున్.

తెలుగువాడు త్రి జిహ్వుడని తన
చేతితో తన కనులు తానే
తెలివిమాలి చిదుమం గలాడని
సిగ్గుపడుచుందున్.

పొరుగువారల మంగళమ్మును
ఇరుగువారల ఇంగళమ్మును
మెచ్చుకొని మైమఱచిపోవుట
అచ్చమగు ఆంధ్రత్వ చిహ్నము.

మొన్న మొన్నటిదాక మాకి
తెలుగు తెన్నుల ప్రీతి నున్నయె
నిన్న నేడుగ నేర్చుకొంటిమి
తెనుగు పోడుములన్.

కవివరేణ్యుల కావ్యకాంతుల
కాంచినప్పుడు కనులు మూయుచు
మాతృభావము చేసి మరలెడు
అపర ప్రహ్లాదులము మేమే.

తెలుగు నదులకు జలము మెంతని
తెలుగు పొలము పసిండి పంటని
ఆంధ్రమాతయె అన్నపూర్ణని
అగ్గుదుము కవితల్.

సత్యశోభముల రాష్ట్రశ్రీ సౌభా
గ్యోన్నతిని సాధించుటకునై
ఆంధ్రులెల్లరు పూనవలెనని
ఆశపడుచుందున్.

("ముక్తసన్య" అను గేయకావ్య సంపుటిలోనిది. 1981 వ
సంవత్సరంలో ముద్రింపబడినది.)

## భువన విజయము

రూపనగుడి నారాయణరావు

'భువనవిజయ' మను పేరఁ
భవనము తనరిల్లె నిందు బహుళోన్నతమై
కవిగాయకులుం గడు వై
భవముం గని వెలసిరిచట భవనమునందుఁ.

దీనారటంకాల తీర్థమాడింపఁగ
శ్రీనాథుఁడెనఁగిన స్థానమిదియె
మనుచరిత్రం బందుకొని తేఁడు పెద్దనన్
మన్నన చేసిన మనికి యిదియె
ఆస్థాన కవుల శ్రేష్ఠాంధ్ర కావ్యంబులు
పఠియింపఁ బడిన దిప్పట్టునందె
పెద్దనకవి, గండపెండేరమును గొన్న
దీ రమ్యమగునట్టి యిరువునందె

ఆంధ్రభాషా వధూటి నాట్యంబు సలిపి
తనదు సత్కీర్తి దశదిగంతములఁ బంపి
కృశము జృంభించిన యది యీ యిక్కయంతె
ఇప్పుడివి చింతలవృక్షము వేఁచుచుండు...

('పంపాపురి శతకము' లోనిది. [illegible] తేది 1964)

# ఆంధ్ర

తిరుమల శేషాచార్యులు

క్షాత్రశౌర్యస్ఫూర్తి చాటె దిగ్విభుల
    రాజనరేంద్రు సంగ్రామ భేరి
రాట్కుల విక్రమరాజి పెంపొనరించె
    కృష్ణరాయని జయశ్రీవిభూతి,
వీరాంగనాయశో విభవంబు వెదజల్లె
    రుద్రమాంబిక పట్టభద్రగాథ
ప్రభువుల సామ్రాజ్య పటిమ వెల్లడిజేసె
    కాకతీయుల బాహుకౌశలంబు

రెడ్డిరాజుల ధాటికి నడ్డు లేదు
వెలమశక్తికి నెదురైన బలమె లేదు
తెలుగ నాయల కీర్తికి నిలుగు లేదు
పార జూడుమో యాంధ్ర! నీవారి గరిమ.

ప్రౌఢప్రబంధంబు భారతాకృతి దెల్పె
    శబ్దశాసనుని వాక్సౌష్ఠవంబు
శాంతిసత్తకము శత్వత్ స్థాయిగా నిల్పె
    తిక్కయజ్వ కవిత్వ ధీశక్తి
భక్తివైరాగ్య భావంబు చిగిర్చె పో
    తసుకవి భాగవతంపు సొంపు
కావ్యకన్నియను చక్కని సొమ్ములం దీర్చె
    కవిసార్వభౌము శృంగార పణితి

తెలుఁగు చెలువకుఁ గులుకుల వలపుఁదెలిపె
గూచిమంచి తిమ్మకవీంద్రు గొనబు పలుకు
కడచి చన్న చరిత్రార్థ గర్భములను
పారజూడుమో యాంధ్ర! నీవారిగరిమ,

ఏ పితామహుని కావ్యేందిరారమణి భూ
    పాలు బంగరు పల్లకిల నెక్కె
నేకవి కుసుమ విజృంభిత వాసనల్
    కృష్ణరాజన్య సత్కీర్తి నిలిపె
నే వికటాక్షధారా విభాసుప్రశస్తి
    కవి శిఖామణుల నంజలనె తుడిచె
నే కావ్యతీర్థు నస్తోక కావ్యము గాదె
    శ్లేషవచః పరిభాషణంబు

నట్టి దిగ్దిగంత వ్యాప్తమైన యశము
మూటగట్టిరి మును నినుబోలు వారె
కాదనంటివి దుష్కాలగతికి చిక్కి
పారజూడుమో యాంధ్ర! నీవారి గరిమ.

శ్రీమదాంధ్రావనీ సేవ జేయు శుభము
యావదాంధ్రాళి గొల్చు నంబావనంబు
పూర్వ మహిమంబు స్మరియించు పుణ్యఫలము
దొరికె నాంధ్రప్రదేశావతరణ గరిమ.

("ఆంధ్రావతరణము" అనే సంకలనంలోనిది. నం. ప్ర. తేది 1956)

# ఆంధ్రాభ్యుదయం

వై.సి.వి. రెడ్డి

శాతవాహన శౌర్యసార హుంకారమ్ము
అరివీర భయద నిష్ఠురమౌ పతాకమ్ము
ఆశాంత ధవళ సంకాశాచ్ఛ పరిమళము
లాంధ్రమాతకు మంగళాశీస్సులందించె
అది మహోదయవేళ అది శుభోదయ హేల

వాసంతమై వచ్చెనూ - మా భూమి
సీమంతమై తోచెనూ.

ఆదిరాజన్య సంపాదితము గర్వమ్ము
అదిగంతమ్ము శౌర్యాగ్ని కీలల జిమ్ము
రాజాధిరాజులై రాజరాజుల బోలి
రమ్యాక్షరమ్ము భారతము ప్రకటించెడి
వ్యాకృతల పుణ్యగణ్యంబైన దీగడ్డ

తెలుగు కావ్యపు సొంపులూ వాసించె
జిలుగు వెలుగుల కెంపులూ.

అందాల చందాల కుందానిలాతయై
అమల వాఃపూర సర్వాంగిణియై లేచు
జలదాంగనల తోడ శర్వరీ రసఝరుల
గలగలని శబ్దముల కమనీయభావముల
భారతము హరివంశ పర్వసంకాశమ్ము

కుసుమించి వాసించెరా రసలోక
విసరమై భాసించెరా.

రెడ్డిరాజుల ప్రోవలద్ది శస్త్రానేక
సంగీత సాహిత్య సౌహిత్యముల శాస్త్ర
సారకల్హార కాసార లహరుల దేల్చి
రాజహంసలతోడ రాయబారములంపి
రాజనముల ట్టిపడ రమణీయ కావ్య శం

పాలతల్ విరియించెరా శ్రీనాథు
పరువమే వికసించెరా.

యమునా నదీతీరయామినుల వ్రజకాంత
లక్రాంతగమన వేగాతురలు వేణుగా
నామృతమ్ముల గ్రోలి అలసి పొదరిళ్లలో
అమరించుచు సొక్కి అవ్యయానందముల
పోలుదృశ్యమ్ము మాపాల సుఖసారమై

తలపించె రమణీయమై భాగవతు
వలపు కన్నుల కందమై.

ఆంధ్రభోజునికి భావావేశమెక్కుడై
ఆముక్తమాల్యదము నందుకొని సాహితీ
సమరాంగణానతా చక్రవర్తిగ అల్ల
సానివారికి చేయిసాచి మదగజముపై
ఎక్కించుకొని కీర్తి నెక్కించె దశదిశల

పదబంధములు గుంఫనములై సాహితీ
పదములయ్యెను బంధనములై.

ఆంధ్రనాయక రాజు లరిది కావ్యావగల
యామవతి వలపించి యవనికాభ్యంతరము
లీలావరారోహ లేలిపోనము లెంచి
సాహిత్య విజయ విలాస సౌఖ్యము నించి
అమర వైభవ పరివ్యాప్త భోగములాచి

తెలుగు పదముల పంచిరీ మానేల
వెలుగు కలువల నించిరీ.

అరలేని మదుల నంబరము లందించి మా
కందమ్ములొలచు నాట్యారంభముల్ సూపి
సరిగమల పదనిసల సరస సౌఖ్యములిచ్చి
సరస సంగీత నిర్ఝరఝరా పూర్ణమౌ
కాసారతలుల చిక్కని భావరూపముల

రసవట్టు లందించెరా రసిక జన
రాజ్యమ్ములే తోచెరా.

భావకవితల బాడి భావలోకములేల
రసమయంబైన శర్వరుల జ్యోత్స్నవగల
తేనె సోనల సొక్కి తెలుగులకు వెలుగులై
రాష్ట్రగానములతో రక్తికట్టించుచూ
స్వాతంత్ర్య సమరమ్ము సాగించు ప్రజలకై

సందేశములనిచ్చిరీ కర్తవ్య
కార్యదీక్షల దెచ్చిరీ.

పోరాట దీక్షలను బోధించి విప్లవో
న్ముఖముగా జనసేన ముందుకురికింపగా
ప్రళయ భీకర భావబంధురమ్ముల సామ్య
వాదమ్ము సాధింప ప్రస్థానముల వేసి
కార్మికోద్యమ జయము కదలబారగ దిశల

కాహళమ్ముల నూదిరీ తీవ్రమౌ
ఊహలే వెదజల్లిరీ.

('పారిజాతం' అనే గ్రంథములోనిది. సం.ప్ర. తేది 1978)

## నంది

పి. యస్. ఆచార్య

కూర్మశైలంబు తొలిపించి గుహ్యకట్టు
పనికి యెవరేని నాటంకపరతు రనుచు
పగతుగుండెను నీర్జేయుపగిదిగాను
నూరిజయలున కావలియుండు నంది.

మరుని మరలునపడి కంటిమంట వేల్పు
గిరిజ పెండ్లాడ లేపాక్షి కరుగుదేర
బరువుమోయుచు బదలిన బసవరాజు
విశ్రమించెనొ నా సంది వెలయునిచట.

నంది అగ్రున వెలసెడి నాణ్యమైన
చిరుతగజ్జెలు గంటలు చిందు ద్రొక్క
శిల్పనైపుణ్యమున్ దాటి శిఖరమెక్కి
మందరస్థాయి మ్రోగు నానందగీతి.

శివుడు తాండవమాడగ చిత్రగతిని
ప్రమధగణములతోడ లేపాక్షి బసవ
రాజు వాద్యసంగీత సరళిని నాట్య
మాడి తన్మయుండయి నిల్చె నద్రిదరిని.

('లేపాక్షి' అనే పుస్తకం లోనిది. సం. ప్ర. తేది 1977)

# తైలవర్ణ చిత్రములు

పి. యస్. ఆచార్య

చికిలి మెరుగులదిద్ది విచిత్రగతిని
కుంచెతో నమరత్వమున్ గ్రుమ్మరించి
వన్నెచిన్నెల చిత్రాలనెన్నొవ్రాసె
నమర చిత్రకళాచార్యుడతడెవండొ।

చిత్రలేఖనోపాసనాచింతదగిలి
ఆర్తియై చిత్రలక్ష్మిని ఆత్మదలచి
కుంచె చేపట్టి రంగుల గ్రుమ్మరించి
దివ్యమంగళ మూర్తుల దిద్దెనెవడొ।

ఉలిరవళి యూహమెలవడి యురకలిడగ
కుంచెపడి భావవిస్ఫూర్తి కూడియాడ
శిల్పశోభలు చిత్రవిచిత్రములును
కలసి విద్యుల్లతంబలె వెలయునిచట.

మొగ్గతొడగిన చిరునవ్వుమోముతోడ
పాదపద్మంబు నోటను పట్టియుంచి
మర్రియాకున శయనించు మంగళాంగు
దివ్యచిత్రనిర్మాత చిత్రించె నిచట.

అమరజీవి మార్కండేయు డార్తితోడ
యముని పాశము తప్పించు మనుచువేడ
అభయహస్తు లింగోద్భవుడైన శివుని
చిత్ర మహావర్ణ చిత్రత చిత్రమదిగా,

మాయజంగము వేద కుమారు బంపి
వండి వంటకమును చిరుతొండనంబి
దంపతులు పుత్రశోక సంతప్తహృదయు
లయ్యు శ్రద్ధతో వడ్డించిరతిథికపుడు.

జంగము శపించునోయని బెంగపడుచు
తనయు గోల్పోయి దీనులౌ దంపతుల వె
తకి తెలియని బాధల ప్రకటితముగ
చిత్రితము చేసె నెవడౌ విచిత్రగతిని!

కన్నుగవ నిప్పుగ్రక్కుచు గాఢముగను
శూలమును త్రిప్పి పోరు త్రిశూలధారి
గాండివము చేతబట్టి ప్రచండముగను
బాహుబలశక్తి ప్రకటించు పార్థుతోడ.

భీకరరణంబు సల్పెడి వీరభద్ర
పార్థులన్ మండపోపరిభాగమందు
రంగులన్ రంగరించుచు వ్రాసి యెవడౌ
తైలచిత్ర ప్రదర్శనశాల నిల్పె!

('లేపాక్షి' పుస్తకంలోనిది, నం. ప్ర. లేది 1977)

# కవితాధ్వజం

తిరుమల శ్రీనివాసాచార్యులు

కవితాధ్వజ మెగురవేసి
గళమ్మెత్తి పాడుతాను
వెలుగువీథియలను మీద
తెలుగుపాట పాడుతాను.

కలతల వలయాల చిక్క
కళ్లను కన్నీళ్ల నాక్క.

నిష్ఠురనిబిడాంధకార
నీరసమౌ శిలలపైన
శిథిల శాసనాలలోన
చెదరిన అలనాటి తెలుగు
బ్రతుకులోన వసంతాల
పరిమళలహరులు నిండగ
బంగారుకలలే పండగ
నింగిదాక పొంగులెత్తి
నిలిచిన శుభసమయంలో
విశ్వసభల శిరస్సెత్తి
వీక్షించిన తరుణంలో

కవితాధ్వజ మెగురవేసి
గళమ్మెత్తి పాడుతాను
వెలుగుతోటలను నాదీ
తెలుగుపాట పాడుతాను.

రాజరాజ నన్నయ శ్రీ
రాజధాని నున్నారట।
మనుమసిద్ధి తిక్కనతో
మనలో కూర్చున్నాడిట।
"దేశభాషలందు తెలుగు
లెస్స"ని చాటిన ప్రభువే
ప్రబంధాల తెలుగు వెలుగు
ప్రసరించిన తీరుచూడ
అల్లసానివాని తోడ
అరుదెంచెను అదిగదిగో।
దిగ్గజ కవులందరు ఒక
దిక్కునకే చేరినారు.

పోతరాజు త్యాగరాజు
శ్రీనాథ క్షేత్రయ్యలు
వేమన్నయు రామన్నయు
చేమకూర వెంకన్నయు
ఎందరెందరని చెప్పదు।
అందరుందు రిట ఇప్పుడు.

హిందూ సంద్రమ్ము దాటి
హిమగిరి శిఖరాలు మీటి
ఆంధ్ర సంస్కృతి పరిమళ
మఖిలదిశల ప్రసరింపగ-
తెలుగుదీప్తి విశ్వంలో
నలుచెరగుల ప్రజ్వలింప-

కవితాధ్వజ మెగురవేసి
గళమెత్తి పాడుతాను
వెలుగు వీణియలను మీటి
తెలుగుపాట పాడుతాను.

('తెలుగుతల్లి' అనే సంకలనంలోనిది. సం. ప్ర. తేది 1975)

## తెలుగు వెలుగుల రథం

పోతుకూచి సాంబశివరావు

కదులుతోంది తెలుగురథం
జగం నలుచెరగుల అశ్వాలను కట్టి
సంస్కృతి నవ చైతన్యం బాటలనుపట్టి
కదులుతోంది తెలుగురథం.

మేదిని సలుమూలల
ఒదిగియున్న తెలుగుల
తెలుగుదేశ రాజధాని
వెలుగుజిలుగులై వరల
వస్తున్నది ఉగాది పండుగ
తెస్తున్నది యుగాది, జాతికి.

ప్రశితకు గీటురాయి
ప్రగతికి మైలురాయి
ప్రపంచ చరిత్రకు
ప్రచండ దివ్యమూర్తి
తెలుగువాని కీర్తి
దశదిశల దాటగల
దర్శాతినం వస్తున్నది పర్జన్యంలా.

శతాబ్దాల రజతోత్సవం
ముత్యాలల్లాంటి కాంతులతో
తెలుగుజాతి దివ్యరథం
వెలుగుపోత బాటలతో
జరుగుతోంది మెరుగులతో
జరిగి హాయలు కదులుతుంది.

తెలుగుజాతి చరిత్రకీర్తి
తెలుగుజాతి ఘనతమూర్తి
తెలుగుజాతి ప్రగతి ఆర్తి
తెలుగుల పండగ వెలుగులు
ప్రపంచ తెలుగు మహాసభలు.

('తెలుగుతల్లి' అనే సంపుటంలోనిది. సం.ప్ర. తేది 1975)

## కుమారా !

వేదుల సత్యనారాయణ

నాలుగు సముద్రముల తరంగాలపైన
జాయలూలసెడు విజయధ్వజమ్ములాడ
యశము వెహార మూసె నొకప్పుడాంధ్ర
నౌకలను మాట తలపోయుమో కుమార!

తెలిగొడుగునీడ మగధ సీమలకుగూడ
కాంతిఁ జేకూర్చిన మహాంధ్రజాతి పౌరు
షోదయ చరిత్రకీవు దాయాదివగుట
యెంత భాగ్యమ్మొ గ్రహియింపుమీ కుమార!

కోవెలల గోపురమ్ములఁ గొండగుహల
విశ్వవిద్యాలయములఁ గావించి దేశ
దేశములకు సంస్కృతి ప్రసాదించినట్టి
యాంధ్రవిజ్ఞాన మెఱుగుమయ్యా కుమార!

తేనె యుగ్గుతోఁ గైతకుఁ దెలుఁగు దిద్ది
శిల్పలక్ష్మికి గ్రొత్త క్రై సేత దీర్చి
గౌతమీకృష్ణల తరంగగీతి దాటు
నాంధ్రనాగరికత నెంచుమా కుమార!

కుంచములతోడ ముత్యాలు కొలుచుకొనిన
రత్నగర్భ యీ యాంధ్రధరామతల్లి
యాపురాణ మహైశ్వర్య మంతరింప
నేమి కతమొ యోచింపుమోయీ కుమార!

["ముక్తఝరి" అనే సంపుటిలోనిది. సం. ప్ర. తేది 1968]

# నావాల్లభ్యుదయము

వేదాంతకవి మల్లె దావీమ

తొలిశాతవాహనులు, నొద
యులు పల్లవులెల్ల, శక్తి యుక్తులు నిక్ష్వా
కులు, సాలంకాయన రా
జులు పాలించిరి ప్రశాంతిఁ జోకొట్టంగన్.

విలసిల్ల విష్ణుకుండిను
లలరంగఁ గళింగ రాజులల గజపతి భూ
పులు, పలు తూరుపు దాళు
క్యులు నేలిరి రామరాజ్య యుగమహిమ మనన్.

మన కాకతీయపాలకు
లును, విజయనగర నరేంద్రులును, రెడ్డినృపుల్
ఘన నైపుణ్యసుపుణ్యం
బునఁ బాలననల్పిరాంధ్రఁభువి శేంద్రమనన్.

అక్కన్నయు, మాదన్నయుఁ
దిక్కన, పూర్ణయ్య, శివయ, తిమ్మరసాదుల్
చక్కని సచివోత్తములన
ముక్కుపయిని వ్రేలుబెట్టఁ బోరెవ్వారున్.

['ఆంధ్రమాత' అనే సంకలనం లోనిది. ~~. ప్ర. తేది 1952]

# ఉగాది—యుగాది

మండలి వెంకటకృష్ణారావు

ఇలా తలంపై
వెలుగు దివ్వెలను
వెలిగించిన మన
తెలుగు సోదరులు
తెలుగుతల్లి కిట
వెలుగు పూలతో
మాలిక లిచ్చి
మన్నన లిచ్చి
పూజ చేయుటకు
భక్తిచూపుటకు
వచ్చినారదే! వెల్లువలాగా!
ఉగాదివండుగ పర్వదినాన!
ప్రపంచమంతా విపంచికాగా
తెలుగు పాటలే పాడాలి!
వెలుగుబాటలే వేయాలి!
గతచరిత్రలో కానము వినము
వివిధ రాష్ట్రముల వివిధ దేశముల
వివిధ సంస్కృతుల విన్యాసంలో
తెలుగువన్నెలను తేనె రుచులనూ
తియ్యగ కలిపి, తేటగ నిలిపి
ప్రపంచ గీతికి ప్రణవంలాగా
ప్రసాద రీతికి పరువంలాగా
తరతరాలుగా తరంగాలుగా
విలసిల్లే మన తెలుగువార లోక

వేదికపై నడయాడే ఘట్టము
గత చరిత్రలో కానము వినము ।
భవిష్యత్తుకే ఇదియొక వరము ।
శాతవాహనులు చళుక్యరాజులు
కాకతీయులూ కృష్ణరాయలూ
తెలుగునేల నొక గొడుగునీడలో
నిలపాలని కృషిచేసినవారే ।
ఆంధ్రరాష్ట్ర సముపార్జనలోనూ
విశాలాంధ్ర నిర్మాణములోనూ
ఆంధ్రజాతిలో అనాదినుంచీ
అమరంగా అభివృద్ధి చెందుతూ
ఆకృతి దాల్చిన ఆశయ మదియే ।
తెలుగువార మొక వెలుగువాకలా
కలసిమెలసి జీవించినప్పుడే
భారతమ్ములో ప్రతిష్ఠ నిలుచును ।
భవిష్యత్తులో భాగ్యము పెరుగును ।
సమైక్య శక్తికి నిదర్శనంగా
సమాన దృష్టికి దృష్టాంతంగా
తెలుగువార మొక బాటన నడిచీ
తెలుగుభాషలో రాజ్యము నడిపీ
కష్టజీవులకు కలిమిని పెంచీ
కళామతల్లికి కానుక లిచ్చీ
ఆంధ్రప్రదేశ రాష్ట్రాన్నంతా
ఆదర్శంగా అలంకరించీ
అఖిల విశ్వమున భరతఖండమున
ఆంధ్రజాతినే అమరం చేద్దాం ।
ఇలాతలంలో ఏ ప్రాంతంలో
ఎక్కడనున్నా ఎన్నాళ్ళున్నా

తెలుగుభాషనూ తెలుగు సంస్కృతిని
మరువలేరు మన సోదరు లెవ్వరు ।
కలసియుండు మన తెలుగుజాతికై
కలతలు మానిన స్నేహశాలికై
కలలుగన్న మనజాతి జీవితము
తెలుగు మహోనత ప్రతిబింబించును ।
ప్రపంచమంతా ప్రతిధ్వనించును ।
మరువలేని ఈ మధుర ఘట్టమును
చిరకాలము మనజాతి చరిత్రలో
సువర్ణ పంక్తుల నలంకరిద్దాం ।
శుభోదయంగా గానంచేద్దాం ।
ఎప్పుడు వచ్చే
ఉగాది కా దిది
విశ్వదృష్టికే
యుగాది । నిజ మిది ।

["తెలుగుతల్లి" అనే సంకలనంలోనిది. సం. ప్ర. తేది 1975]

# ఉపయుక్త గ్రంథసూచి


1. ఆచార్య, పి యస్ : లేపాక్షి (శిల్పకళాక్షేత్రము), పి. యస్. ఆచార్య, "హిందు" విలేఖరి, శ్రీకాకుళం 532001. ప్రచురణ తేది 4-11-1977.

2. ఆదర్శసాహిత్యమాల హైదరాబాదు : ఆంధ్రావతరణము; ఆదర్శసాహిత్యమాల, స్వతంత్ర బుక్ సెల్లర్స్ అండ్ స్టేషనర్స్ సుల్తాన్ బజారు, హైదరాబాదు - 1. ప్రచురణ తేది 1-11-1956.

3. ఆంధ్రసారస్వత సమితి మచిలీపట్నం : స్పృహ (కవితాసంకలనం); ఆంధ్రసారస్వత సమితి, మచిలీపట్నం. (ప్రచురణ తేదీ లేదు)

4. ఇందుమతీదేవి, గుడిపూడి : మందారమాల జి. ఇందుమతీదేవి స్వతంత్ర ఆర్ట్ ప్రింటర్స్, విజయవాడ-4. ప్రచురణ తేది - 1972.

5. కృష్ణమాచార్య, ఎక్కిరాల : పీయూషలహరి: ఎక్కిరాల కృష్ణమాచార్య సాహితీ సమితి, గుంటూరు, ప్రజావాణి ప్రెస్, గుంటూరు. ప్రచురణ తేది-1955.

6. కృష్ణమాచార్యులు, : మణిహారము: రొంపిచెర్ల కృష్ణమాచార్యులు భీమునిపట్నం. వేదవ్యాస పవర్ ప్రెస్, విజయవాడ 2. ప్రచురణ తేది - 1971

7. కృష్ణమూర్తి, చిట్టిప్రోలు : తరంగిణి; సరస్వతీ గ్రంథమాల, గామాలపాడు (B.O.) (వయా) దాచేపల్లి S O, గుంటూరు జిల్లా; ప్రచురణ తేది - 1966

8. కృష్ణశాస్త్రి, దేవులపల్లి : పల్లకి; కృష్ణశాస్త్రి సన్మాన సంఘం తరపు కార్యాలయం. 14, సుంకురామశెట్టిస్ట్రీట్, మదరాసు - 1. ప్రచురణ తేది-1975.

9. చిత్తూరు జిల్లా రచయితల సహకార ప్రచురణ సంఘం : కవితామంజరి : చిత్తూరుజిల్లా రచయితల సహకార ప్రచురణ సంస్థ. చిత్తూరు: ప్రచురణ : క్రాంతి ప్రెస్, 12 ప్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మదరాసు-1. ప్రచురణ తేది_1975.

10. చిరంజీవి, నార్ల : తెలుగుపూలు: నార్ల చిరంజీవి; క్రాంతి మాల బెజవాడ, 12వ ప్రచురణ-1977.

11. జగన్మోహనరావు, మాన్యం : ఉదయరేఖలు : శారదా పబ్లికేషన్స్, 241 ఎప్, టైప్-11 బి. హెచ్ ఇ. ఎల్. టౌన్‌షిప్, హైదరాబాదు - 500032. ప్రచురణ తేది-1978

12. జాను, గర్నెపూడి : తెలుగు వెలుగు; తెలుగు వెలుగు గ్రంథమాల, C/o గర్నెపూడి జాను, ఆనంద తీర్థ అగ్రహారము, గుంటూరు - 4. ప్రచురణ తేది - 1978.

13. జాషువ కవి, గుఱ్ఱం : ఖండకావ్యము (1, 3, 4, 5, భాగములు); వేంకటేశ్వర అండ్ కో, గుంటూరు.

ఓంకార్ ప్రెస్, గుంటూరు. ప్రచురణ తేది-1956.

14. కోగారావు, యస్వీ : పంచకల్యాణి, ఆంధ్ర రచయితల సంఘము హైదరాబాదు, అజంతా ప్రింటర్స్ - సికింద్రాబాదు ప్రచురణ తేది-1958.

15 జ్ఞానానంద కవి. యస్.టి : విజయాభిషేకము, యస్. టి. జ్ఞానానంద కవి రసజ్ఞ పబ్లికేషన్స్, కాకినాడ – 3. ప్రచురణ తేది-1966.

16. జ్ఞానానంద కవి యస్.టి. : గోల్కొండ, యస్. టి జ్ఞానానంద కవి రసజ్ఞ పబ్లికేషన్స్, కాకినాడ-3. ప్రచురణ తేది-1978.

17. జ్ఞానానంద కవి, యస్.టి. : రాజధాని, యస్. టి. జ్ఞానానందకవి; రసజ్ఞ పబ్లికేషన్స్ కాకినాడ 3. ప్రచురణ; తేది – 1967.

18 తిరుమలరావు, పి. : కెరటాలు; కల్చరల్ రినైజాన్స్ సొసైటి అవ్ ఇండియా 263, సంజీవరెడ్డి నగర్. హైదరాబాదు-38; ప్రచురణ తేది-1982

19 దాశరథి దాశరథి కవిత మహేంద్ర ప్రచురణలు, 13 (సి) రాజారామ్ కాలనీ, కోడంబాకం, మదరాసు 24.

20. (అ) దావీదు, పల్లెం ఆంధ్రమాత (ఆత్మకథ); విజయవాడ ఆంధ్ర గ్రంథాలయ ముద్రాక్షరశాల యందు ముద్రింపబడినది. ప్రచురణ తేది-1952.

20. (ఆ) ధర్మారావు, తాపీ : పాతపాళీ అమరావతీ ప్రెస్ తిలక్‌రోడ్డు హైదరాబాదు-ప్రచురణ తేది 1960.

21. నరసింహాచార్యులు, వేముగంటి : కవితాసింధూరం సాహితీ వికాసమండలి సిద్ధిపేట శ్రీనివాస బుక్ డిపో, మెయిన్ రోడ్డు. సిద్ధిపేట.

22 నారాయణరావు, తూపనగుడి : పంపాపురీశతకము 'సాహితీ శ్రీ' విజ్ఞానవల్లి గ్రంథమాల అనంతపురము ప్రచురణ తేది 1964.

23. నారాయణరెడ్డి, సి. : దివ్వెల మువ్వలు క్వాలిటీ పబ్లిషర్సు విజయవాడ 2. ప్రచురణ తేది 1959.

24. నారాయణరెడ్డి, సి. : మరోహరివిల్లు సరోజాప్రచురణలు త్రివేణి వివేకనగర్. హైదరాబాదు-20. ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్ సికింద్రాబాదు. ప్రచురణ-1969.

25. ప్రభాకరశాస్త్రి, కూచిబొట్ల లక్ష్మీనరసింహశాస్త్రి పుట్టి : ఆంధ్రప్రతిభ [ప్రథమ భాగము] లక్ష్మీ పవర్ ప్రెస్, తెనాలి. ప్రచురణ తేది-1939

26. ప్రభాకరామాత్య కవి, అదిపూడి ఖండ కావ్యములు–ఉపన్యాసములు-చాటువులు; ఎ.వి.యస్. సుబ్బారావు, 1_8–165/బి మెండెలేలేన్, ప్రెండరుగాస్టు రోడ్డు, సికింద్రాబాదు–3 ప్రచురణ తేది-1971

27. పాపయ్యశాస్త్రి, జంధ్యాల : ఉదయశ్రీ; న్యూ స్టూడెంట్స్ బుక్ సెంటర్, ఏలూరు రోడ్డు, విజయవాడ–2 ప్రచురణ తేది-1979

28. పురా. శ్రీ : మణిమకుటము; శోభాప్రచురణలు [సాహి
త్యోద్యమ సంస్థ], విజయనగరం
ప్రచురణ తేది-1961

29. బలరామకృష్ణయ్య, మగ్గిగాల : తెలుగుసీమ; తిపిర్నేని లక్ష్మీనారాయణ
మానవాదర్శ గ్రంథమండలి అంగలూరు,
కృష్ణాజిల్లా. ప్రచురణ తేది -1982.

30 బాపురెడ్డి, జె. : బాపురెడ్డి గేయాలు ; సుశీలానికేతన్
1సి.85. ఎర్రమంజిల్ కాలనీ,
హైద్రాబాదు—4

31. బాపురెడ్డి, జె. : మన చేతుల్లోనే వుంది; జయంప్రచురణలు
ప్లాట్ నెం 10, రోడ్ నెం. 6.జూబ్లిహిల్స్,
హైదరాబాదు—34. ప్రచురణ తేది-1966

32 బావయ్య చౌదరి, కొత్త : కల్పవల్లి: కొత్త బావయ్యచౌదరి,
సంగంజాగర్లమూడి గుంటూరు జిల్లా.
ప్రచురణ తేది 1963.

33 మూర్తి, ఎ వి.యస్. : నేను—నాదేశం. [కవితా సంపుటి]
'సైన్స్ హౌస్' 68, గిరినగర్, కొచ్చిన్,
కేరళ స్టేట్. 682020. ప్రచురణ-1972

34. రజనీకాంతరావు, బాలాంత్రపు: శతపత్ర సుందరి [గేయసంపుటి]
వావిళ్ళరామస్వామి శాస్త్రులు అండ్ సన్స్,
490, తిరువొత్తియూరు హైరోడ్,
చాకలిపేట మద్రాసు—21.ప్రచురణ-1954

35. రమణారెడ్డి, కె.వి.: శ్రీ శ్రీ సాహిత్యం: శ్రీ శ్రీ షష్టిపూర్తి సన్మాన సంఘం(2-1-1970) కాంతి ప్రెస్ 12. ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మదరాసు-1

36. రాఘవ శర్మ, గురజాడ: స్వాతంత్ర్యపథం; బృందావన ప్రచురణలు, మచిలీపట్టణము, విజయ ప్రెస్. విజయవాడ. ప్రచురణ తేది 1978 (రెండవ ముద్రణ)

37. రామ్‌జేయ్ అండ్ కంపెనీ : మాతృపూజ [సంకలనం] రామ్‌జేయ్ అండ్ కంపెనీ, 13 తంబుచెట్టి వీథి, మదరాసు. ప్రచురణ తేది_1932 [దుగ్గిరాల గోపాల కృష్ణయ్య గారి జ్ఞాపకార్థం చేసిన సంకలనం].

38 రాంషా: అనంతం; కళాకేళి ప్రచురణాలయం, శ్యామల్‌కోట. ఛికాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ-2. ప్రచురణ_1958

39. రామకృష్ణ, మిరియాల : బాలాభిరామం [పిల్లల పాటల పుస్తకం]: మిరియాల రామకృష్ణ, ప్రభాత్ పబ్లిషింగ్ హౌస్, తెనాలి. ప్రచురణ-1966 (దక్షిణ భాషా పుస్తక సంస్థ సహకారముచే ప్రకటితము).

40. రామకృష్ణమాచార్య, నండూరి.: తారాతోరణము; విజ్ఞాన ప్రభాస, భీమవరము, పశ్చిమ గోదావరి. శ్రీరామా ప్రింటింగ్ ప్రెస్, అనంతపురం. ప్రచురణ 1949.

41. రామకృష్ణారావు అబ్బూరి : అబ్బూరి రామకృష్ణారావు ఊహాగానము-ఇతర కృతులు-కవిత; 15 సాధు వాస్వాని మార్గ్, న్యూఢిల్లీ-10005. శివాజీ ప్రెస్, 1782, గంజ్ బజార్ సికింద్రాబాదు-8 ప్రచురణ - 1978

42. రామచంద్రారెడ్డి, అలుగుపల్లి : ద్రాక్షగుత్తులు (బాలసాహిత్యం), యువ రచయితల సమితి, నల్లగొండ. ప్రచురణ-1979.

43. రామనాథశాస్త్రి, దాగా : ముక్తసస్య (గేయసంపుటి): డా॥ దాగా రామనాథశాస్త్రి, మేధుమతి పబ్లికేషన్స్, లాయరుపేట, ఒంగోలు, ప్రచురణ-1981

44. రామస్వామిచౌదరి, త్రిపురనేని : శతకాలు, గీతాలు: త్రిపురనేని రామస్వామి చౌదరి, సరళా పబ్లికేషన్స్, బోస్ రోడ్ - తెనాలి, గుంటూరు జిల్లా. ప్రచురణ: 1977.

45. రామానుజరావు, దేవులపల్లి : పచ్చతోరణము, ఆంధ్రసారస్వత పరిషత్తు, రామకోటి, హైదరాబాదు ప్రచురణ-1981 (మూడవ ముద్రణ)

46. రామానుజరావు, దేవులపల్లి : కావ్యమాల, కేంద్రసాహిత్య అకాడమి, రవీంద్రభవన్, న్యూఢిల్లీ, ప్రచురణ-1984.

47. రామారెడ్డి, ముకురాల : హృదయశైలి: డా॥ ముకురాల రామారెడ్డి చంద్రభూషణ్ ప్రచురణలు బి-20, ఎస్/1,

మల్లెపల్లి, విజయనగర్ కాలని,
హైదరాబాదు. ప్రచురణ-1979.

48. విశ్వనాథశాస్త్రి, తుంగతుర్తి : నీలాదిరేవు (గేయసంపుటి): తుంగతుర్తి విశ్వనాథశాస్త్రి; శ్రీనివాస సాహితీ సమితి, 58, వివేకనగరం, హైదరాబాదు-20. ప్రచురణ 1970.

49. విశ్వనాథశాస్త్రి, తుంగతుర్తి : ఆశాకిరణం; శ్రీనివాస సాహితీసమితి 58, వివేకనగరం, హైదరాబాదు-20

50. విశ్వసుందరమ్మ, తల్లాప్రగడ: కవితాకదంబము ; మల్లవరపు ప్రచురణ "ఇంద్రప్రస్థ" ద్వారకానగర్ విశాఖపట్నం-4. ప్రచురణ—1973.

51. వీరరాఘవాచార్యులు, కొండూరు: అమరావతి : కొండూరు వీరరాఘవాచార్యులు; వి.యస్.ఆర్. కళాశాల, తెనాలి. ప్రకాశకులు : కె వి. ఆర్. అండ్ సన్స్. తెనాలి. గుంటూరు కో ఆపరేటివ్ ప్రింటింగ్ వర్క్సు లిమిటెడ్ తెనాలి ప్రచురణ 1950.

52. వీరాస్వామి, కల్యాణం : కుసుమాంజలి; కల్యాణం సూర్యకాంతం. ఆంధ్రసాహిత్య ప్రచారసభ విశాఖపట్టణము-1. ప్రచురణ-1970.

53. వెంకటరత్నం, పెనుమర్తి : రత్నావళము; సారస్వతీకుటీరము తెనాలి గుంటూరు జిల్లా. ఆంధ్రపత్రికా ముద్రణాలయము, మదరాసు. ప్రచురణ-1934.

54. వెంకటేశ్వరరావు, కమ్మిశెట్టి : గుజ్జనగూళ్ళు. విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ. ప్రచురణ 1957.

55. వేంకటరత్నశర్మ, క్రొవ్విడి : ఆంధ్రిస్మృతి. (తెలుగు పిట్టలు) ఉషాగ్రంథమాల ప్రచురణ 1945.

56. వేంకటరావు, కవికొండల : కవికొండల వేంకటరావు గీతాలు. కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్. సంస్కృతాంధ్ర బుక్ డిపో, రాజమండ్రి, ప్రచురణ 1961.

57. వేంకటశివరావు, వడ్డి : కలువకొలను. వడ్డి వేంకటశివరావు c/o వడ్డి నాగమ్మగారు, సి-49, బాపూజీ నగర్, కొవ్వూరు, పశ్చిమగోదావరి జిల్లా. ప్రచురణ 1959.

58 వేంకటహనుమంతరావు పిల్లలమర్రి : కాలముకొట్టిన గంటలు. శారదా పీఠము. గుంటూరు-4, ప్రచురణ 1967.

59 శరభాచార్య, పులివర్తి : విద్యాలయగీతాలు. పులివర్తి శరభాచార్య విద్యాశాఖాధికారి, గుంటూరు ఓరియంట్ పబ్లిషింగ్ కో. శాఖలు. మదరాసు, తెనాలి గుంటూరు, హైదరాబాదు, రాజమండ్రి ప్రచురణ 1962.

60. శ్రీనివాసాచార్యులు, తిరుమల : ఉదయరాగము. తిరుమల శ్రీనివాసాచార్యులు. సాహితీ ప్రియమండలి కరీంనగర్ ప్రచురణ 1970.

61. శ్రీ మహావిష్ణు, సముద్రపు : హృదయవీణ, ప్రకాశం జిల్లా అ.ర.సం. ప్రచురణ. యస్. విజయకుమారి బి–9 గవర్నమెంటు క్వార్టర్స్ ఒంగోలు ఆంధ్రప్రదేశ్ ప్రచురణ 2974.

62. శ్రీ మహావిష్ణు, సముద్రపు : వెలుగు రేఖలు కర్నూలు జిల్లా తెలుగు రచయితల సంఘం కర్నూలు. యస్. విజయకుమారి 48/19 నరసింగరావు పేట కర్నూలు ప్రచురణ 1975.

63. శ్రీరాములు, మహాకవిదాసు : తెలుగునాడు. మహాకవిదాసు శ్రీరాములు స్మారకసమితి 1–10–97 అశోక్‌నగర్ హైదరాబాదు–20 ప్రచురణ 1974. (అరవకూర్పు)

64. శ్రీరాములురెడ్డి, పూతలపట్టు : తెనుఁగు సందేశము.

65. శ్రీహరిశాస్త్రి, బాచిమంచి : మధురశ్రీ. భక్తకవి బాచిమంచి శ్రీహరి శాస్త్రి, వరలక్ష్మిముద్రణశాల విజయవాడ-2 ప్రచురణ 1958.

66. శేషగిరిరావు, కొర్నెపాటి : తెలుఁగు వెలుగు. శ్రీపరాశక్తి ప్రింటింగ్ వర్క్సు తెనాలి. ప్రచురణ 1949.

67. శేషుబాబు : నిర్మాణగానము. చల్లపల్లి, కృష్ణా జిల్లా. వయా మచిలీపట్నం సాధనసమితి సికింద్రాబాదు. ప్రచురణ 1945.

68 సత్యనారాయణ విశ్వనాథ : ఆంధ్రప్రశస్తి వి.యస్.యస్. అండిసన్స్ మారుతీనగర్, విజయవాడ-4 ప్రచురణ 1961.

69. సత్యనారాయణ ఎం.వి. [సంకలనకర్త] : నవకవిత [సంకలనం] ఆంధ్ర విశ్వకళా పరిషత్తు' వాల్తేరు, విశాఖపట్టణం-530 003. ప్రచురణ 1980.

70. సత్యనారాయణశాస్త్రి, వేదుల : ముక్తఝరి. గౌతమీకోకిల గ్రంథమాల కూనవరం భద్రాచలం తాలూక ఖమ్మం జిల్లా॥ ప్రచురణ 1968.

71 సత్యదుర్గేశ్వరకవులు : ఆంధ్రప్రతిష్ఠ. సీతంపేట రాజమంద్రి చింతామణిప్రెస్ ప్రచురణ తేది 27-9-1946.

72. సత్యనారాయణ ధర్మపురి : చైతన్యస్వరాలు. ఇం. నెం. 10-10-46 గిర్మాజీపేట, వరంగల్, కార్యదర్శి, చైతన్యసాహితి 3-3-150, హన్మకొండ. ప్రచురణ 1982.

73. నరళ, పి. : ఆంధ్రులకథ. [గేయకథనం] ఆంధ్రప్రదేశ్ బాలల అకాదమి,! 34/4RT, ఐక్కిల్‌పురా క్వార్టర్సు హైదరాబాదు-500 027.

74. స్పందన సాహితీ సమాఖ్య : వికాసం. స్పందన సాహితీసమాఖ్య 23/182E, న్యూ మున్సిపల్ క్వార్టర్సు, మచిలీపట్టణం, ప్రచురణ 1975.

75. సీ. వి. రెడ్డి, వై : పారిజాతం. 2-76A, నాగరాజుపేట, కడప ప్రచురణ 1978.

76 సీతారామమూర్తి చౌదరి, తుమ్మల : రాష్ట్రగానము ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాల బెజవాడ ప్రచురణ 1939.

77. సీతారామమూర్తి చౌదరి, తుమ్మల : పఱిగపంట ప్రకాశకులు: కురుకూరి సుబ్బారావు అండ్ సన్ ప్రొప్రైటర్సు: సరస్వతి బుక్ డిపో బెజవాడ ప్రచురణ 1943.

78. సీతారామమూర్తిచౌదరి, తుమ్మల : ఉదయగానము, భారతీప్రెస్, తెనాలి. ప్రచురణ-1964.

79. సుబ్బారావు, నాయని : నాయని సుబ్బారావుకృతులు, అజంతా ప్రింటర్సు, సికింద్రాబాదు. ప్రచురణ-1958.

80 సుబ్బారావు, రాయప్రోలు : ఆంధ్రావళి, నవ్య సాహిత్యపరిషత్తు, గుంటూరు. రినైసాన్సు ప్రింటర్సు లిమిటెడ్., మదరాసు. ప్రచురణ-1944.

81. సుబ్బారావు, రాయప్రోలు : నీరాజనము, అమరజ్యోతిప్రెస్, మార్కాపురం. ప్రచురణ-1958.

82. సుబ్బారావు, రాయప్రోలు : మిశ్రమంజరి, అజంతాప్రింటర్సు, సికింద్రాబాదు. ప్రచురణ 1963.

83. సుబ్బరామశాస్త్రి, పైడిపాటి : మధుర సంక్రాంతి, భారతీనికేతన్,
మారుతీనగర్, విజయవాడ-2.
ప్రచురణ, మార్చి 1959.

84. సుబ్బరామశాస్త్రి, పైడిపాటి : విజయ భారతి, భారతీనికేతన్,
మారుతీనగర్, విజయవాడ-2.
ప్రచురణ : మే 1959.

85. సోమయాజి, గంటి జోగి : రామచంద్రుని హంపియాత్ర.
ఆర్. వెంకటేశ్వర అండ్ కో
బుక్ సెల్లరు, మదరాసు-1.
ప్రచురణ-1972.

86. హనుమచ్ఛాస్త్రి, ఇంద్రగంటి : మధువని. శ్రీరాధాకృష్ణా పబ్లికేషన్స్,
రామచంద్రపురం, తూర్పుగోదావరి జిల్లా,
ప్రచురణ-1959.

87. హనుమచ్ఛాస్త్రి, ఇంద్రగంటి : దక్షారామము, విశాలాంధ్ర పబ్లిషింగ్
హౌస్, ఏలూరు రోడ్డు, విజయవాడ.
ప్రచురణ—1971.



# పత్రికలు


1. ఆంధ్రపత్రిక. శుక్ల సంవత్సరాది సంచిక.
2. ఆంధ్ర సాహిత్యపరిషత్పత్రిక. 1966-67 మార్గశీర్షపుష్యములు
3. ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక. 1967-68 ఆశ్వయుజకార్తికములు.
4. కృష్ణాపత్రిక 8-10-1966 శనివారం, సంపుటం-65, సంచిక-34.
5. కృష్ణాపత్రిక 14-1-1967 శనివారం, సంపుటం-65, సంచిక-49.
6. కృష్ణాపత్రిక 4-11-1967 శనివారం, సంపుటం-66, సంచిక-39.
7. కృష్ణాపత్రిక 13-1-1968 శనివారం, సంపుటం-66, సంచిక-49.
8. తెలుగువాణి-1982 డిసెంబరు మాసపత్రిక, అంతర్జాతీయ తెలుగు కేం
9. తెలుగువాణి-1983 మార్చి మాసపత్రిక, అంతర్జాతీయ తెలుగుకే
10. భారతి 1931 జూన్ మాసపత్రిక.
11. భారతి 1952 ఏప్రిల్ మాసపత్రిక
12. భారతి 1953 జూన్ మాసపత్రిక.
13. భారతి 1953 అక్టోబరు మాసపత్రిక.
14. భారతి 1977 అక్టోబరు మాసపత్రిక.
15. వెంగంపేట యువజన సేవాసంఘం-రజతోత్సవ సంచిక 1980